# విన్నపం

శ్రీరామచంద్రుణ్ణి, మనం, మనిషి అనుకుని పరిశీలించుకోవాలి, దేవుడని కాదు.

ఇహలోకంలో, పురుషునికి సంభవించే గొప్పగొప్ప దుఃఖాలూ అనుభవించాడు, కష్టాలూ అనుభవించా డన్నీ, అతను.

అన్నీ నిగ్రహించుకున్నాడు, చివరికి.

పురుషోత్తమత్వం సాధించుకున్నా డతను, దాంతో.

రామాయణం రచించడంలో, పురుషు డైనవాడు జీవితసాఫల్యం కోసం చెయ్యవలసిన సాధన అంతా మనకు విశదం చెయ్యడమే, వాల్మీకి ముఖ్యోద్దేశం అనుకుంటున్నాను, నేను.

రామాయణం చదివినప్పు డల్లా, అడుగడుగునా, ఈసందేశమే వినిపిస్తోంది, నాకు.

ద్వంద్వభూయిష్ఠ మైన సంసారంలో పడి కొట్టుకునే మనిషికి ఇంతకంటే మంచి హితోపదేశం మరొకటి లేదు.

కనక, రామాయణం, పకొద్దిమంది పండితులలో మాత్రమే కాదు, జనసామాన్యం అంతా చదవాలి.

పండితులు పారాయణం చేసేటట్టు, జనసామాన్యమున్నూ, మళ్లీ మళ్లీ చదవాలిది. నిత్యచింతనా చేసుకోవాలి.

అప్పుడే మన జాతిలో పూర్ణపురుషులు లక్షలకు లక్షలు బయలుదేరతారు.

ఈఫలితం ఆశించే నే నిది వాడుకభాషలో రాశాను.

ఇది రాసీ, సర్వస్వాత్వాలతోనూ సరస్వతీ పవర్ ప్రెస్సు యజమానులు కీ. శే. శ్రీ లక్ష్మణస్వామినాయనింగారి కిచ్చీ వెనిమిదేళ్లయింది.

శ్రీ లక్ష్మణస్వామినాయనింగారి కుమారులు, చిరంజీవి నాగేశ్వరరావుగారు దయతో ప్రకటిస్తున్నా రిప్పు డిది.

వారికి నాకృతజ్ఞత విన్నవించుకుంటున్నాను. మరిన్నీ వేదవ్యాస మహార్షి సంస్కృతమూలం అనుసరించి, చివరికి వారికోనమే నిర్దిష్టమైన మహాభారతానువాదం దీక్షగా సాగించబోతున్నా నిక. విరాటపర్వం ఇదివరకే పూర్తిచేశాను. అదిన్నీ అచ్చయి సిద్ధంగా వుంది.

రాజమండ్రి
1–12–1955

ఇట్లు
శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

# ప్రకాశకుల విజ్ఞాపనము

ఇది మాచేతికి వచ్చి యెనిమిది సంవత్సరము లయినను, అప్పటిలో కాగితముల కరవేర్పడియుండుటవలన, పిదప మానాయనగారు వ్యాధిగ్రస్తు లగుటవలన, అప్పుడు ప్రకటించుట సాధ్యపడలేదు.

రామాయణము మీాది సహజప్రీతివలనను, శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారి రచనయెడలగల ఆదరానురాగములవలనను, ఆలస్యము సహించలేక, మానాయనగారు వ్రాతప్రతి, సొంతముగ కొంత చదువుకొని, కొంత చదివించుకొనియు విని ఆనందించినారు.

ఇంతలో వారు పరమపదించుట తటస్థించినది.

శ్రీరామునిగాథ—వాల్మీకిమహర్షి రచన—శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారి లలితానువాదము — ఇన్ని శుభలక్షణములతో నిండియున్న యీా మహాగ్రంథము ప్రకటించుటకు నే నిప్పటికి పూనుకొనగలిగినాను.

శ్రీ శాస్త్రిగా రాశించినట్లు, జనసామాన్య మిది చదువబూనుకొన్నప్పుడే నాకును సాఫల్యము.

ఇట్లు

రాజమండ్రి
1—1—1955

అద్దేపల్లి నాగేశ్వరరావు
ప్రొప్రయిటరు - సరస్వతీ పవర్ ప్రెస్

# విషయసూచిక

---

చంద్రు డంత చల్లనివాడు. భూమి అంత ఓర్పుగలవాడు; కాని కోపం స్తేమాత్రం ప్రళయాగ్ని అతనియెదట చాలా లిగాడు. దానధర్మాలు చెయ్యడంలో కుబేరు డైనా అతనికి చాలడు. ధర్మప్రవర్తనలో తన్ని చెప్పే యముణ్ణి చెప్పాలి.

దశరథమహారాజు తన పెద్దకొడుకైన ఆరాముసకు యౌవరాజ్య ట్టాభిషేకం చేతా మని ప్రయత్నించాడు; కాని అందుకోసం చేర్చిన ంభారా లన్నీ చూసి అతని సవతితల్లి కైక అది పడగొట్టింది. నక ఒకమాటు రాజు ఆమెకి రెండు వరా లిచ్చాడు. ఆరెండు రాలూ ఆమె యిప్పుడు చెల్లించమంది. అవి రెండూ వరసగా, ముదటిది రాముణ్ణి అడవులకు పంపడమూ, రెండోది తన కొడుకు రతుడికి పట్టాభిషేకం చెయ్యడమూను. దీంతో, దశరథుడు అన్న మాటకి కట్టుబడిపోయి రాముణ్ణి అడవులకు పంపేశాడు. రాముడు ండ్రిమాట తీసెయ్యడం యిష్టంలేక అడవులకు వెళ్లాడు. అతనివెంట తన్ని విడిచివుండలేక, లక్ష్మణుడు కూడా వెళ్లాడు. అతను సుమిత్ర డుకు. రామునియెడల అతనికి మిక్కిలీ స్నేహం. రాముని భార్య త. ఆమె జనకమహారాజు కూతురు. ఆమె సర్వలక్షణసంపన్నురాలు. స్త్రీలలో అంతటి ఉత్తమురాయిల్లాలు మరిలేదు. ఆమె రామునకు యభార్య. ప్రాణాలకంటె యెక్కువది. ఆమె కూడా చంద్రునితో రోహిణి లాగ రామునితో అడవులకు వెళ్లింది. సీతనూ, రాముణ్ణీ, క్ష్మణుణ్ణీ పౌరులూ, దశరథుడూ చాలాదూరం సాగ నంపారు.

గంగాతీరాన శృంగిబేరపురంలో రాముడు సూతుణ్ణి రథం అయో ధ్యకు తోలుకుపొమ్మని పంపేశాడు. ఆపట్నంరాజు గుహుడు. అతను బోయకులం రాజు. దశరథునికీ అతనికీ మిక్కిలీ స్నేహం. రాము డంటే తనికీ; అతనంటే రామునకూ ఎంతో ప్రీతి. అతను పడవనడిపి సీతా రామలక్ష్మణులను స్వయంగా గంగానది దాటించాడు. అక్కణ్ణుంచి

వారు సొంతంగా బయలుదేరారు. అడవి తరవాత అడవి దాటారు. పొంగిపొరలిపోతున్న నదులున్నూ ఎన్నో దాటారు. భరద్వాజమహర్షి ఆశ్రమానికి వెళ్లి అతన్ని పూజించి, అతని సెలవుచొప్పున వెళ్లి వారు చిత్రకూటపర్వతంమీద నివసించారు. అక్కడ వారు చక్కని పర్ణశాల కట్టుకున్నారు. దేవతల్లాగ, గంధర్వుల్లాగ అక్కడ సుఖంగా వున్నారు.

ఇక్కడ రాముడు చిత్రకూటపర్వతం చేరుకునేటప్పటికి, అక్కడ అయోధ్యలో రాముణ్ణి విడిచివుండలేక అతనికోసం శోకించిశోకించి దశరథుడు చనిపోయాడు. అతను చచ్చిపోగా, వసిష్ఠుడూ మంత్రులూ భరతునకు పట్టం కట్టబోయారు; కాని భరతు డంగీకరించలేదు. పైపెచ్చు, రాముణ్ణి ప్రార్థించి వెనక్కి తీసుకువచ్చి పట్టాభిషేకం చేయిద్దామని భరతుడు సపరివారంగా బయలుదేరి వెళ్లి చిత్రకూటంలో రాముణ్ణి కలుసుకున్నాడు. "ధర్మాత్ముడవైన నువ్వే రాజవు" అని భరతు డెంత చెప్పినా, ఎంత ప్రార్థించినా రాము డందు కంగీకరించ లేదు. "అది నాయనగారి ఆజ్ఞకి వ్యతిరేకం" అని చెప్పి అతను భరతునిమాట కొట్టేశాడు; కాని భరతుడు కోరగాకోరగా తన పాదుక లిచ్చాడు. "ఈపాదుకలే రాజ్యం చేస్తాయి, నేను కాదు." అని అవి శిరసావహించి వెళ్లి భరతుడు నందిగ్రామంలో నివసించి పాదుకల పక్షంగా రాజ్యపాలనం చేశాడు. రాముడు తిరిగి వచ్చేదాకా అత నలా వుండడానికే నిశ్చయించుకున్నాడు. భరతుడు వెళ్లిపోయాక రాముడు, ఈ అలవాటును బట్టి పౌరులూ, బంధువులూ మళ్లీమళ్లీ వస్తూవుంటా రనీ, అది యిష్టంలేకా అక్కణ్ణించి బయలుదేరి దండకారణ్యంలో ప్రవేశించాడు.

ఆమహారణ్యంలో రాముడు విరాధు డనే రాక్షసుణ్ణి చంపాడు. శరభంగమహర్షినీ, సుతీక్ష్ణమహర్షినీ అగస్త్యమహర్షినీ అగస్త్యభ్రాతనీ

సందర్శించాడు. అగస్త్యుడు ఇంద్రు డిచ్చిన ధనస్సూ, బాణాలూ, ఖడ్గమూ అక్షయతూణీరాలూ ఇవ్వగా తనకు తగిన ఆయుధా లని సంతోషించి రాము డవి పుచ్చుకున్నాడు. అక్కడవుండగా మహర్షు లనేకులు వచ్చి రాక్షసులను సంహరించ మని రాముణ్ణి ప్రార్థించారు. అందుకు రాముడు, ఆ రాక్షసభూమిలో నివసించి వుంటా ననీ, రాక్షసులను సంహారిస్తా ననీ అగ్నికల్పు లైన ఆ మహర్షులకు మాట యిచ్చాడు. అత నక్కడ వుండగా కామరూపిణి అయిన శూర్పణఖ వచ్చింది. ఆమె ముక్కూ చెవులూ కోసి లక్ష్మణుడు పంపేశాడు. ఆశూర్పణఖ పోయి ప్రోత్సహించగా ఖరుడూ, త్రిశిరుడూ, దూష ణుడూ, వారివెంట పద్నాలుగు వందల రాక్షసులూ వచ్చి వారిమీద పడ్డారు; కాని రాము డొక్కడే వాళ్ళ నందరినీ సంహారించాడు. రాము డిలాగ జనస్థానంలో రాక్షసపురుగు లేకుండా చేసేశాడు.

లంకలో రావణు డిదంతా విన్నాడు. అంతమంది జ్ఞాతులను చంపా డనేటప్పటికి అతనికి రామునిమీద చాలా కోపం వచ్చింది. వెంటనే వచ్చి ఒక ఆశ్రమంలో తపస్సు చేసుకుంటున్న మారీచుణ్ణి సాయం రమ్మన్నాడు. "రాముడు మహాబలపరాక్రమశాలి. అతనితో విరోధం నీకు శ్రేయస్కరం కాదు" అని మారీచు డెన్నివిధాల చెప్పినా రావణు డది వినక మారీచుణ్ణి బలవంతపెట్టి తన వెంట తీసుకుని రాముని ఆశ్రమానికి వచ్చాడు. వచ్చి మాయావి అయిన మారీచుని సాయంతో రామలక్ష్మణులు దూరంగా వెళ్ళేటట్టు చేసి సీతను హరించి అడ్డువచ్చిన జటాయువును సంహరించి రావణుడు లంకకి వెళ్ళిపోయాడు. జటాయువు చచ్చిపోవడమూ రావణుడు సీత నెత్తుకుపోవడమూ తెలు సుకుని రాముడు మిక్కిలి శోకించాడు. ఆశోకంతోనే జటాయువుకి 'హనసంస్కారం చేశాడు. మళ్ళీ సీతను వెతకడానికి బయలుదేరాడు. ళ్ళగా వెళ్ళగా ఘోరరూపు డైన కబంధు డనే రాక్షసుడు

కనపడ్డాడు. రాముడు వాణ్ణి చంపేసి దహనంకూడా చేసేశాడు. ఆ కబంధుడు స్వర్గానికి వెళ్లిపోతూ "రామా! శ్రమణి అయిన శబరి ఒకామె సమస్తధర్మాలూ తెలుసుకున్నది వుంది. నువ్వామెను చూడు" అని చెప్పగా, రాము డక్కడికి వెళ్లి ఆమె పూజ లందుకున్నాడు.

రాముడూ, పంపాతీరాన హనుమంతు డనే వానరుడూ కలుసుకున్నారు. ఆ హనుమంతుడు రామున్ణీ సుగ్రీవుణ్ణీ సమావేశం చేశాడు. జరిగిం దంతా ముఖ్యంగా సీతవిషయం యావత్తూ రాముడు సుగ్రీవునితో చెప్పాడు. అదంతావిని తృప్తిపొంది సుగ్రీవుడు అగ్నిసాక్షిగా రామునితో సఖ్యం సంపాదించుకున్నాడు. సుగ్రీవుడు తన సంగతి అంతా దుఃఖిస్తూ చెప్పాడు. "నేను వాలిని సంహరిస్తా" నని రాముడు శపథం చేశాడు; గాని సుగ్రీవునకు నమ్మకం కలుగలేదు. దానిమీద పర్వతంలాగ పడివున్న దుందుభి యెముకలగుట్టను సుగ్రీవుడు చూపించగా రాముడు అది కాలి బొటనవేలితో పదిఆమడల దూరానపడేటట్టు యెగదన్నాడు. ఒక్క బాణంతో సప్తతాళ్లుకూడా కొట్టి చూపించాడు. ఆ బాణం చెట్లు కొట్టడమే కాకుండా పర్వతంకూడా దూసుకుపోయి రసాతలానికి వెళ్లింది.

సుగ్రీవుడు అప్పుడు రాముడు మహావీరు డనినమ్మి ఆతణ్ణి కిష్కింధకు తీసుకువెళ్లాడు. సుగ్రీవుడు సింహగర్జనం చెయ్యగా మండిపడుతూ వాలి యెదటికి వచ్చాడు. తార అనేకవిధాల చెప్పి వారించినా వినక అతను వచ్చాడు. రాముడు వాలి నొక్క బాణంతో చంపాడు. సుగ్రీవుణ్ణి వానరరాజుగా చేసేశాడు. అప్పుడు సుగ్రీవుడు సీతను వెతకడానికి వానరులను దశదిక్కులకూ పంపాడు. ఒక జట్టులో వున్న హనుమంతుడు, జటాయువు అన్న అయిన సంపాతి చెప్పగా నూరామడల సముద్రం దాటి లంకలోకి వెళ్లి అశోకవనంలో దుఃఖిస్తున్న సీతను కనిపెట్టి సంగతి అంతా చెప్పి ఆనవాలిచ్చి ఊరడించి తరవాత, ముందుగా ద్వారతోరణం పాడుచేశాడు. అయిదు

యం లేనేలేదు. అన్నంలేక ఆకలితో బాధపడడం కలలో కూడా నగరాలూ, పల్లెలూ ధనధాన్యసమృద్ధాలై వుండినాయి. ఎప్పుడూ ఆనందిస్తూ వుండినారు.

రాముడు వందలకొద్దీ అశ్వమేధయాగాలు చేసీ కోట్లకొద్దీ గోదా నా చేసీ బ్రాహ్మణులకు కోట్లకొద్దీ ధనం యిస్తాడు. వందల రాజవంశాలు స్థాపిస్తాడు. చతుర్వర్ణాలకూ ధర్మనిష్ఠ కలిగిస్తాడు. రాముడు పదకొండువేల సంవత్సరాలు రాజ్యంచేసి అప్పుడు లోకానికి వెళ్లిపోతాడు.

రామచరిత్ర పరమపవిత్రం. వేదాలతో సమాన మైనది. సకల యూ పోగొడుతుంది. ఇది చదివేవాడు ఇక్కడ సకలసుఖాలూ గ్యాలూ అనుభవించి అంతమందు స్వర్గానికి వెళ్లిపోతాడు. ఇది బ్రాహ్మడు మంచి పండితుడు అవుతాడు. క్షత్రియుడు రాజు డు. వైశ్యుడు గొప్పవర్తకుడై గొప్ప ఐశ్వర్యవంతు డవుతాడు. డు గొప్పవా డవుతాడు.

౨

శా విని వాల్మీకి శిష్యులతో కూడా నారదమహర్షిని మిక్కిలీ చాడు. ఆ దేవర్షి ఆపూజ లన్నీ అందుకుని చాలా ఆనందించి, సెలవున్నూ పొంది ఆకాశమార్గాన వెళ్లిపోయాడు. ఇలాగ డు వెళ్లిపోయిన తరవాత, వాల్మీకి, భరద్వాజు డనే శిష్యుణ్ణి బెట్టుకుని గంగానదికి సమీపాన వుండిన తమసానదికి వెళ్లాడు. వు బురదలేకుండా చాలా చక్కగా వుంది. "భరద్వాజా! ఇది క రేవు. ఇక్కడ జలం ప్రసన్నంగా వుంది. ఇది సజ్జనహృదయం ట్టుంది. కనక, చెంబు అక్కడ వుంచి నా పంచె యిలా తే,

గురు రాక్షససేనాధిపతులను చంపాడు. ఏడుగురు మంత్రిపుత్రుల చంపాడు. అక్షకుమారుణ్ణి చంపాడు. చివరికి అతను బ్రహ్మాస్త్రా పట్టుబడ్డాడు. బ్రహ్మవరంవల్ల అది తన్నేమీ చెయ్యలేదని ఆత తెలుసు. కనక, నిశ్చింతగా వుండి రావణునితో మాట్లాడి, చివ సీత వుండిన చోటూ, విభీషణుని యిల్లూ మాత్రం విడిచిపెట్టి తక్కి లంకాపురం అంతా తగలబెట్టేసి చక్కావచ్చాడు.

ఇలాగ వెళ్లిన పని నిర్వహించుకువచ్చిన హనుమంతుడు సం అంతా రామునితో చెప్పాడు. రాముడు సుగ్రీవుతో దండయా బయలుదేరి దక్షిణసముద్రతీరానికి వచ్చి తన బాణాలతో సముద్ర కలిచేశాడు. సముద్రుడు ప్రత్యక్షమై ఉపాయం చెప్పాడు. వెంట రాముని సెలవుపొంది నళుడు సేతువు కట్టాడు. రాముడు సప వారంగా లంకకు వెళ్లి రావణుణ్ణి చంపేసి సీతను నిష్ఠురా లాడాడ సీత అగ్నిప్రవేశంచేసి పరిశుద్ధురాల నని నిరూపించుకుంది. అగ్ని కూడా చెప్పగా రాముడు సీతను పరిగ్రహించాడు. అందుకు దేవ లందరూ ఆనందించారు.

అప్పుడు రాముడు విభీషణునకు లంకారాజ్యంపట్టంగట్టి, దేవ లిచ్చిన వరా లందుకుని స్నేహితులను వెంటబెట్టుకుని అయోధ్యక పుష్పకవిమానంమీద బయలుదేరి భరద్వాజాశ్రమంలోదిగి భరతుని దగ్గిరికి హనుమంతుణ్ణి పంపాడు. తరవాత నందిగ్రామంవెళ్లి అక్కడ జడలు విప్పేసుకుని తమ్ములతో కూడా అయోధ్యకు వెళ్లి పట్టాభిషిక్తు డైనాడు. ఇలాగ రాముడు తమకు రాజుకాగా పౌరులూ జానపదులూ మిక్కిలీ సంతోషించారు. రామరాజ్యంలో దేశం సుభిక్షంగా వుంది. ఎక్కడా రోగబాధలు లేవు. ఎవరికీ సంతానం నష్టం కాలేదు. స్త్రీలకు వైధవ్యం కలగలేదు. అగ్నిభయం మెవరూ మెరగరు. నీటి ండాలూ, వాయుపీడా, జ్వరబాధా కూడా మెవరూ మెరగరు,

నేనిక్కడే స్నానం చేస్తాను" అని వాల్మీకి అన్నాడు. శిష్యు డలా చెయ్యగా వాల్మీకి ఆ పంచె కట్టుకుని యాదాలాభంగా అక్కడి అడవిలో ప్రవేశించి కొంచెంసేపు అటూయిటూ తిరిగాడు. ఒకచోట ఒక క్రౌంచపక్షిమిథునం కులాసాగా సంచరిస్తోంది. అవి రెండూ ఉల్లాసంగా కూస్తున్నాయి; కాని చూస్తూనే వుండగా బోయవా డొకడు వచ్చి రివ్వున బాణం విడిచి వాటిలో మొగపిట్టను చంపేశాడు. దాంతో, గిరగిర తిరుగుతూ కిందపడి రక్తంలో పొరలాడుతున్న తన పెనిమిటిని చూసి ఆడపిట్ట చాలా దీనంగా యేడ్చింది. అది చూశాటప్పటికి ధర్మాత్ము డైన వాల్మీకిమహర్షికి జాలిపుట్టింది. అతను కరుణార్ద్రహృదయుడు కనక, అది అక్రమం అనుకుంటూ "ఓరీ, బోయవాడా! నువ్వింకెన్నాళ్లో బతకవురా. ఏమంటే? కామమోహితమై వుండిన క్రౌంచమిథునంలో వొకదాన్ని చంపావు కనక" అన్నాడు. అత నిలా అని "ఏమిటిదీ?" అనుకున్నాడు. "శోకార్త మయిన యీపిట్టను చూడగానే నేనన్న దేమిటీ?" అంటూ అతని కాలోచన కలిగింది. ఇలాగ ఆలోచిస్తూ అతను భరద్వాజునితో

"మా నిషాద! ప్రతిష్ఠాం త్వ
మగమ శ్శాశ్వతీ స్సమాః
య త్క్రౌంచమిథునా దేక
మవధీః కామమోహితమ్"

అన్నాను చూశావా? ఇది సమాక్షరాలతో కూడిన నాలుగు పాదాలతో గీతం లాగ లయబద్ధం అయివుంది. ఇది వీణమీద వాయించడాని కనువుగా కూడా వుంది. శోకార్తు ణ్ణయిన నానోట బుట్టిన యిది శ్లోకమేగాని మరొకటి కాదు" అన్నాడు. భరద్వాజుడు

"అలాగే వుంది, సందేహం లేదు" అన్నాడు. శిష్యుడి అంగీకారంతో వాల్మీకి చాలా తృప్తిపడ్డాడు.

తరవాత మహర్షి స్నానాద్యనుష్ఠానాలు ముగించుకుని ఆవిషయమే ఆలోచించుకుంటూ ఆశ్రమం చేరుకున్నాడు. వినయవిధేయతలతో కలశం పట్టుకుని భరద్వాజు డతని వెనకనే వచ్చాడు. ఆశ్రమంలో ప్రవేశించాక మహర్షి ఇతరవిషయాలు అనేకాలు మాట్లాడాడు; గాని అతని ధ్యాస మాత్రం ఆశ్లోకంమీదే వుండిపోయింది. ఇలాంటి స్థితిలో లోకకర్తా, చతుర్ముఖుడూ అయిన బ్రహ్మ వాల్మీకిని చూడ డానికి వచ్చాడు. అతన్ని చూసి వాల్మీకి విస్మితుడై లేచి పాదాభి వందనంచేసి అర్ఘ్యపాద్యాదు లిచ్చి పూజించి కుశలం అడిగి, ఆసనం యిచ్చి, అతని ఆజ్ఞతో తానూ కూచుని అతనితో మాట్లాడుతూనే ఆక్రౌంచపక్షినీ ఆశ్లోకమూ తలుచుకుంటూ వుండినాడు.

అది గ్రహించి బ్రహ్మ చిరునవ్వు నవ్వుతూ "మహర్షీ! నువ్వు రచించింది శ్లోకమే సందేహపడనక్కర్లేదు. నాసంకల్పంవల్లనే నీనోట యిలాంటి శ్లోకం పుట్టింది. కనక, నువ్వు ఈశక్తితో రామచరితం అంతా రచించు. ధర్మాత్ముడూ, గుణవంతుడూ అయిన రాముని చరిత్ర అంతా నీకు నారదుడు చెప్పివున్నాడు. నువ్వది రచించు. నా అనుగ్రహంవల్ల నీకు రామునిచరిత్రా, లక్ష్మణాదులచరిత్రా, రాక్షసుల చరిత్రా, సీతచరిత్రా, వీటికి సంబంధించిన ఉపాఖ్యానాలూ అందరికీ తెలిసినవీ, రహస్యంఅయి వున్నవీ కూడా నీకు తెలిసిపోతాయి. ఆ కావ్యంలో నువ్వు రచించినది యేదీ అసత్యం అయివుండదు. కనక, రామకథ అంతా శ్లోకబద్ధం చెయ్యి. పర్వతాలూ, నదులూ భూలోకంలో వుండినంతకాలమూ నువ్వు రచించిన రామచరిత్ర కూడా వుంటుంది. భూలోకంలో రామాయణం ప్రచారంలో వున్నంత

కాలమూ నువ్వు నాలోకాలన్నిటిలోనూ యథేచ్ఛగా సంచరించ గలవు" అని చెప్పి చూస్తూ వుండగానే అంతర్ధానం అయిపోయాడు.

అందుకు వాల్మీకీ, శిష్యుడు భరద్వాజుడూ చాలా ఆశ్చర్యపడ్డారు. తరవాత అతని శిష్యు లందరూ అత్యుత్సాహంతో ఈ శ్లోకం మాటి మాటికీ చదువుకుంటూ ఆనందించసాగారు. సమానంగా అక్షరాలు గల నాలుగుపాదాల యీ శ్లోకం శిష్యు లదేపనిగా చదువుతూ వుండ డంవల్ల శ్లోకం అని ప్రఖ్యాతం అయింది. దీంతో "ఇలాంటి శ్లోకాల తోనే నేను రామాయణం అంతా రచిస్తాను" అని ముని సంకల్పించు కున్నాడు. వెంటనే అతను రామాయణం చాలా రసవంతంగా అనేక వందలశ్లోకాలతో రచించాడు. ఆ రఘురాముని చరిత్రమూ, రావణ వధా శ్రద్ధగా వినండి"

వాల్మీకి, నారదుడు చెప్పిన రామకథ అంతా విన్నాడు; కాని యింకా వివరాలు తెలుసుకోడానికి బాగా ఆలోచించాడు. ఇందు కోసం, అతను, ఆచమానం చేసి తూర్పుదిక్కుకి కొస లుండేటట్టు దర్భలు పరుచుకుని వాటిమీద కూచుని, దోసిలి వొగ్గి ఆంతర దృష్టితో చూశాడు. దాంతో, రాముడూ, లక్ష్మణుడూ, సీతా, దశ రథమహారాజూ, అతని భార్యలు — కౌసల్యా సుమిత్రా కైకా, పరివా రమూ, ప్రజలూ చేసిందీ, చెప్పిందీ, పొందిందీ, నడిచిందీ నడిపించిందీ సమస్తమూ అతనికి తెలిసిపోయింది. సీతతోకూడా రాముడు అడవుల్లో వున్నప్పు డేమి చేశాడో, యేమి అనుభవించాడో, ఏమి పొందాడో అది కూడా స్పష్టంగా కనపడింది. యోగ దృష్టితో అత నిలాగ సంగతు లన్నీ కరతలామలకంగా తెలుసుకుని రామచరిత్ర రచించడానికి పూనుకున్నాడు. చివరికి అతను కామార్థాలతో కూడి వుండేటట్టూ

గుణార్థాలతో వి_స్తరించేటట్టూ, సముద్రంలాగ రత్నాలతో నిండివుండే టట్టూ, వినేవారికి రుచిగా వుండేటట్టూ, నారదుడు చెప్పిన రామకథ అంతా వివరంగా వర్ణించి రామాయణం చేశాడు.

అందులో, వాల్మీకి, రామజననమూ, అతని బలపరాక్రమాలూ, అందరికీ అత ననుకూలుడై వుండడమూ, అతనంటే లోకానికి గల ప్రీతీ, అతని క్షాంతీ, సౌమ్యభావమూ, సత్యదీక్షా, విశ్వామిత్రునితో కలుసు కున్నప్పుడు జరిగిన వింతవింతకథలూ, జానకీపరిణయమూ, శివధనుస్సు విరవడమూ, రాముడూ పరశురాముడూ యుద్ధం చెయ్యడమూ, రాముని పట్టాభిషేకప్రయత్నాలూ, కైక చెడుతలంపూ, పట్టాభిషేక భంగమూ, రాముడు అడవులకు బయలుదేరడమూ, దశరథుని విలా పమూ, మరణమూ, ప్రజలదుఃఖమూ, ప్రజలను వెనక్కి పంపెయ్య డమూ, గుహునితో కలుసుకోవడమూ, సారథిని వెనక్కి పంపెయ్య డమూ, గంగ దాటడ , భరద్వాజమహర్షి దర్శనమూ, భరద్వాజుని ఆజ్ఞవల్ల చిత్రకూటానికి వెళ్లడమూ, అక్కడ పర్ణశాల నిర్మించుకో డమూ, అక్కడికి భరతుడు రావడమూ, రాముణ్ణి ప్రార్థించడమూ, రాముడు తండ్రికి తర్పణాలు చెయ్యడమూ, పాదుకాపట్టాభిషేకమూ, భరతుడు నందిగ్రామంలో నివసించడమూ, రాముడు దండకారణ్యా నికి వెళ్ళడమూ, విరాధుణ్ణి సంహరించడమూ, శరభంగమహర్షిని చూడడమూ, సుతీక్ష్ణమహర్షిని కలుసుకోడమూ, అనసూయతో సీత కూచోడమూ, అనసూయ సీతకు అంగరాగం యివ్వడమూ, అగస్త్యమహర్షిని సందర్శించడమూ, జటాయువును కలుసుకోవడమూ పంచవటికి వెళ్ళడమూ, శూర్పణఖ రావడమూ, దానితో మాట్లాడడమూ, చివరికి దాని ముక్కూ చెవులూ కొయ్యడమూ, ఖరుణ్ణీ, త్రిశిరుణ్ణీ సంహరించడమూ, రావణుని ప్రయాణమూ, మారీచవధా, రావణుడు సీత నెత్తుకుపోవడమూ, రాముడు విలపించ

డమూ, జటాయువు మరణమూ, కబంధుడు కనపడడమూ, పంప చూడడమూ, శబరిని చూడడమూ, హనుమంతుణ్ణి కలుసుకోడమూ, అతనితో ఋశ్యమూకపర్వతంమీాదికి వెళ్లి సుగ్రీవునితో కలుసుకోడమూ, సుగ్రీవుణ్ణి నమ్మకం కలిగించి స్నేహితుణ్ణి చేసుకోడమూ, వాలీ సుగ్రీవుడూ ద్వంద్వయుద్ధం చెయ్యడమూ, రాముడు వాలిని సంహరించడమూ, సుగ్రీవునకు వానరరాజ్యాభిషేకం చెయ్యడమూ, తార విలపించడమూ, రామసుగ్రీవుల సంకేతమూ, వర్షాకాలంలో రాముడు రాత్రులు గడపడమూ, రాముడు కోపపడమూ, సుగ్రీవుడు వానర బలగం అంతా కూర్చడమూ, దేశస్థితి చెప్పి సకలదిక్కులకూ వానరులను పంపడమూ, రాముడు హనుమంతునకు ఉంగరం యివ్వడమూ, హనుమంతుడు తన మిత్రులతో ఋక్షబిలం అనే గుహ చూడడమూ, వానరులు ప్రాయోపవేశానికి సిద్ధపడడమూ, అప్పుడు వారికి సంపాతితో సమాగమం కలగడమూ, హనుమంతుడు పర్వతంయెక్కి సముద్రం దాటడమూ, సముద్రునిమాటమీాద హనుమంతుడు మైనాకుణ్ణి చూడడమూ, సింహికను సంహరించడమూ, లంకలో వున్న మలయపర్వతం చూడడమూ, రాత్రివేళ లంకలో ప్రవేశించడమూ, ఏకాంతంగా హనుమంతు డాలోచించడమూ, రావణుణ్ణి చూడడమూ, పుష్పక విమానం కూడా చూడడమూ, రావణుని పానశాలలో తిరగడమూ, అంతఃపురస్త్రీలను చూడడమూ, అశోకవనానికి వెళ్లి అక్కడ సీతను చూడడమూ, రాము డిచ్చిన ఆనవా లామె కివ్వడమూ, రావణుణ్ణి అక్కడ చూడడమూ, సీతను రాక్షసాంగనలు తర్జనభర్జనలు చెయ్యడమూ, త్రిజటకు కల రావడమూ, సీత హనుమంతునకు శిరోమణి యివ్వడమూ, హనుమంతుడు అశోకవనం భగ్నం చెయ్యడమూ, రాక్షసాంగనలు పారిపోవడమూ, హనుమంతుడు కింకరులను సంహరించడమూ, హనుమంతుణ్ణి రాక్షసులు పట్టుకోడమూ, హనుమంతుడు

లంక తగలబెట్టి గర్జించడమూ, మళ్లీ సముద్రం దాటడమూ, మధు వనంలో వానరులు స్వేచ్ఛగా విహరించడమూ, హనుమంతుడు రాముణ్ణి పూరడించి సీత యిచ్చిన శిరోమణి యివ్వడమూ, రాముడు వానరబలగంతో సముద్రతీరాన విడియడమూ, నళుడు సేతువు కట్ట డమూ, సేతువుమీదుగా వానరులు సముద్రం దాటడమూ, రాత్రివేళ లంక ముట్టడించడమూ, విభీషణశరణాగతీ, విభీషణుడు ఉపాయాలు చెప్పడమూ, కుంభకర్ణుడు చచ్చిపోడమూ, ఇంద్రజిత్తు చచ్చిపోడమూ, రావణుడు నశించిపోవడమూ, రాముడు సీతను పొందడమూ, విభీష ణాభిషేకమూ, పుష్పకవిమానం చూడడమూ, దానిమీద అయో ధ్యకు బయలుదేరడమూ, భరతుణ్ణి నందిగ్రామంలో కలుసుకోవడమూ, రామపట్టాభిషేకమూ, సైనికుల నందరినీ పంపివెయ్యడమూ, తన రాష్ట్రంలోని ప్రజల నందరినీ రాముడు రంజించడమూ, సీతను అడవులకు పంపెయ్యడమూ, రాముడు పుట్టకపూర్వం జరిగిన కొన్ని సంగతులు చెప్పడమూ — ఇలాగ సమస్తమూ వాల్మీకిమహర్షి ఏడుకాండల్లో చక్కగా వర్ణించాడు.

౪

వాల్మీకి మహర్షి ఈరామాయణం అంతా రాముడు పట్టాభిషిక్తుడై రాజ్యం చేసేటప్పుడు రచించాడు. ఇందులో వున్న శ్లోకాలు ఇరవై నాలుగువేలు. సర్గలు ఐదువందలు. ఉత్తరకాండతో కూడా కాండ లేడు. ఇదంతా రచించడం పూర్తి అయిపోయాక "ఇదంతా యెవరు ప్రకటిస్తారు?" అని ఆలోచనలో పడ్డాడు. ఈస్థితిలో మునివేషు లైన కుశలవులు వచ్చి వాల్మీకి పాదాలు పట్టుకున్నారు. వా రిద్దరూ అన్నదమ్ములు. ధర్మం తెలిసినవారు. రాజపుత్రులు. యశోవంతులు. మంచి శారీరంగలవారు. వాల్మీకి ఆశ్రమంలోనే వుండినవారు. వారు

మహామేధావు లయివుండడమూ, వేదవేదాంగాలు తెలిసినవారు కావడమూ గుర్తించి ఈవేదం లోకంలో ప్రకటన కావడానికి ఆద్యంతంగా వాల్మీకి వారికి నేర్పాడు.

ఇది చదవడానికీ పాడడానికీ కూడా చాలా మధుర మైనది. ద్రుతమధ్య విలంబితకాలాదులతోనూ, సప్తతాళాలతోనూ, వీణా వాద్యానుకూల్యంతోనూ ఒప్పుతోంది. ఇందులో శృంగారాది రసాలు తొమ్మిదీ వున్నాయి. ఇది నేర్చిన కుశలవులు గానశాస్త్రం క్షుణ్ణంగా తెలిసినవారు. చక్కని శారీరం కలవారు. మూర్ఛనా స్థానాలు బాగా తెలిసినవారు. రూపానికి గంధర్వకుమారుల్లా వున్నారు. దీపంలోనుంచి పుట్టిన దీపంలాగ రామునకు, రాముడే అనుకునేటట్టు తద్రూపంతో పుట్టినవారు.

ఆ రాజపుత్రులు ధర్మోపబృంహితం అయిన ఈ కావ్యం అంతా వాచోవిధేయంగా చేసుకుని ఋషులు సమావేశం అయివున్నచోటా, బ్రాహ్మణులు సభచేసుకుని వున్నచోటా, సాధుజను లంతా చేరివుండిన చోటా, నేర్చుకున్నది నేర్చుకున్నట్టు పాడసాగారు. వా రొకప్పుడు మహర్షు లంతా చేరివుండిన వొక సమావేశంలో యిది పాడారు. అది విని ఆ మహర్షు లందరూ ఆశ్చర్యచకితులై ఆనందముగ్ధులై ఆనంద బాష్పాలు విడిచారు. "భేషు, భేషు" అని చాలా పొగిడారు. వారు రామాయణగ్రంథం ప్రశంసించడమే కాదు, సర్వసమర్థులైన కుశలవులను కూడా మిక్కిలీ కొనియాడారు. "ఏమి శ్లోకాలు! ఏమి గానం! ఎప్పుడో జరిగిం దయినా కథ అంతా యెదురుగా జరుగుతున్నట్టుంది" అనుకుంటూ ఆనందించి వారు కొనియాడారు. మహర్షులు పొగిడిన కొద్దీ కుశలవులు మిక్కిలి చక్కగా పాడారు. ఇందుకు సంతో

పించి మహర్షి వొకడు వారి కొక కలశం యిచ్చాడు. ఇంకొక మహర్షి మంచి నారబట్ట యిచ్చాడు.

ఇలాగ వారు కవులకు ఆధారమైన యీ రామాయణం చాలా చోట్ల రాజమార్గాల్లో పాడారు. ఇది తెలిసి రాముడు వారిని తన యింటికి పిలిపించుకుని చాలా గౌరవించాడు. నిండు కొలువున సింహాసనాసీనుడై వుండి మంత్రి సామంతాదులు అందరూ బలిసివుండగా రాముడు వారి రూపసంపద చూసి "వీరు చాలా చక్కగా పాడు తున్నారు వినండి" అని లక్ష్మణునితోనూ, భరతునితోనూ చెప్పాడు. అందుకు తగ్గట్టు కుశలవులు చక్కగా వీణలు వాయిస్తూ లయతప్పిపో కుండా చూసుకుంటూ కమ్మగా పాడారు. అదివిని అక్కడివారందరూ మిక్కిలీ ముగ్ధు లయిపోయారు. వారి కెంతో మనోల్లాసమూ, హృద యానందమూ కలిగాయి. "ఈకుశలవులు మునికుమారు లయివుండినా రాజలక్షణాలతో తేజరిల్లుతున్నారు. వీరు మహాతపశ్శాలులు. నాకు కూడా ఇది చాలా సుఖంగా వుంది" అని రాము డన్నాడు.

---

# కథోద్ఘాతం

వైవస్వతమనువు మొదలుకుని యీ భూమి నేలిన రాజు లందరిలోనూ "ఇక్ష్వాకు" వంశీయులు చాలా గొప్పవారు. ఎంతెంతలేసి యుద్ధాల్లోనూ కూడా వారు అపజయం అన్నది యెరగరు. సప్తద్వీపాత్మిక అయిన యీభూమి, ఇక్ష్వాకువంశీయుల కందరికీ యెవరికి వారికే వారికోసమే పుట్టుకువచ్చిందా అన్నట్టుండేది. వారిలో సగరుడనే రాజు చాలా ప్రసిద్ధి పొందాడు. అతని వల్లనే సముద్రానికి సాగరం అన్న పేరు వచ్చింది. అతనికి అరవై వేలమంది కొడుకులు. తండ్రి జైత్రయాత్రకు బయలుదేరితే వారందరూకూడా యుద్ధసన్నద్ధులై వెళ్ళేవారు.

ఆ యిక్ష్వాకువంశీయులది కోసలదేశం. అది సరయూనదిని ఆనుకుని వుంది. ఆ దేశం ధనధాన్యసమృద్ధం అయింది. ఆ దేశంలో వున్న గ్రామాలూ, పట్నాలూ, నగరాలూ జనులతో కిక్కిరిసిపోయి వున్నాయి.

## అయోధ్యానగరవర్ణన

ఆ దేశంలో వున్న నగరా లన్నిటిలోనూ "అయోధ్య" అనేది చాలా గొప్పది. ప్రపంచం అంతటా అది మిక్కిలీ పేరుపడ్డది. మనువు స్వయంగా నిర్మించిన నగరం అది. కోసలదేశాధిపతు లైన యిక్ష్వాకు వంశీయుల కందరికీ ఆనగరమే రాజధాని.

దాని పొడుగు పన్నెండు యోజనాలు. వెడల్పు మూడు యోజనాలు. ఆ నగరవీధులు విశాలంగానూ దిద్దితీర్చి వుంటాయి. ప్రతీ దినమూ, ఆవీధులలో ముందుగా నీళ్లూ, తరవాత పువ్వులూ ముత్యాలూ చల్లుతూ వుంటారు,

రాజ్యం పెంపుచేసుకోడంలో మిక్కిలి నేర్పుగల దశరథు డనే మహారాజు, స్వర్గంలో దేవేంద్రుడు లాగ, ఆనగరంలో నివసిస్తూ వుంటాడు.

స్త్రీలకు వొడ్డాణం లాగ ఆనగరానికి చుట్టూ బలమైన ప్రాకారం వుంది. రాకపోకలకు వీలుగావుండేటట్టు, ఆప్రాకారానికి, అక్కడక్కడ ఎత్తయిన ద్వారా లున్నాయి. ఆనగరంలో అనేకవిధాలైన యుద్ధ యంత్రాలూ, ఆయుధవిశేషాలూ నిండుగా వున్నాయి. పెద్దపెద్ద బురుజులూ ఆ బురుజులమీద చక్కని ధ్వజాలూ వున్నాయి. ఎన్నో ఫిరంగులున్నూ వున్నాయి. అందున్న గుర్రాలకూ ఏనుగులకూ లొట్టి పిట్టలకూ అంతూ పంతూ లేదు: అగడ్త చాలా లోతుగానూ వెడల్పుగానూ వుంది. దేవతలకు గూడా జయించరాని కోట అది.

ఆనగరం విశాలమైన సమప్రదేశంలో నిర్మించబడ్డది. అక్కడ అంగడివీధులు పేర్చినట్టు తీర్చివున్నాయి. అందున్న నివాసా లన్నీ మేడలే. అన్నీ మేరుపర్వతా ల్లాగ అమూల్యాలే. ఎన్ని కరువులు వచ్చినా, యెన్ని దీర్ఘయుద్ధాలు తటస్థించినా ఆ నగరంలో ఆహార సామగ్రి కొంచెమున్నూ తరగదు. చెరుకురసంకంటేనూ మధుర మైన సరయూనదీజలం ఆ నగరవాసులకు నవశక్తి సంఘటిస్తూ వుంటుంది.

చిత్రకారులూ రథకారులూ మొదలైన శిల్పులు ఆ నగరంలో వేనవే లున్నారు. సూతులూ మాగధులూ కూడా లెక్కలేనంతమంది వున్నారు. సామంతరాజు లనేకు లక్కడ నివసించివున్నారు. దేశ దేశాలనుంచి వచ్చి కుబేరులవంటి వర్తకు లెందరో ఆనగరంలో వర్తక వ్యాపారాలు చేసుకుంటున్నారు.

ఎన్నో విధా లైన గోపురాలతో నిండి ఆనగరం అష్టాపదాకా రంగా వుంది.

ఆనగరంలో స్త్రీల నాటకసంఘా లెన్నో వున్నాయి. దుందుభీధ్వానాలతోటీ, మృదంగధ్వనులతోటీ, వీణానిక్వానాలతోటీ, పణవారవాలతోటీ ఆనగరం షష్టిగడియలూ ముఖరితం అవుతూ వుంటుంది. అక్కడి పురుషులు దేవకుమారులనూ స్త్రీలు అప్సరసలనూ మించి వుంటారు.

ఆ నగరంలో వున్న బ్రాహ్మణు లందరూ వేదవేదాంగపారగులై యజ్ఞయాగాలు చేసినవారే. మరిన్నీ వారందరూ సుగుణభూషితులు. దానధర్మపరాయణులు. సత్యనిరతులు. నిరతాన్నప్రదాతలు. మహర్షుల వంటివారు.

అక్కడి క్షత్రియు లందరూ మహాబలపరాక్రమవంతులే. మదించి, అడవిలో స్వేచ్ఛగా సంచరించే పులులనూ సింహాలనూ ఆయుధసహాయం లేకుండా విడిచేతులతోనే వారు సంహరించగలరు. వారందరూ మహారథులు. ధర్మాత్ములు. ఒంటరి అయివున్నవాణ్ణీ, తల్లిదండ్రులూ పుత్రులూ లేనివాణ్ణీ దాగినవాణ్ణీ వా రెన్నడూ సంహరించరు.

వేలకొలది అలాంటి బ్రాహ్మణులతోనూ క్షత్రియులతోనూ నిండి వుండిన ఆ మహానగరంలో వుండి దశరథమహారాజు ప్రజాపాలనం సాగిస్తున్నాడు.

౨

## పౌ ర జ న వ ర్ణ న

ఆదశరథమహారాజు వేదవేత్త. సర్వసంగ్రహుడు. దీర్ఘదర్శి. పౌరులకూ జానపదులకూ మిక్కిలీ ప్రియుడు. యజ్వ. అతిరథుడు. ధర్మపరాయణుడు. ఆత్మనిగ్రహము గలవాడు. మహర్షులతో తులతూగే రాజర్షి. త్రిలోకాలయందూ పేరుపొందినవాడు. బలపరాక్రమశాలి. శత్రుంజ

యుడు. గొప్పగొప్ప మిత్రులు గలవాడు. విజితేంద్రియుడు. హిరణ్య రత్నదివ్యాంబరాభరణాదులయందూ నిధినిక్షేపాలయందూ దేవేంద్రుని తోనూ కుబేరునితోనూ సమానుడు.

వైవస్వతమనువు లోకా లెలా పరిపాలించాడో, దశరథుడు కూడా దేశం అలాగే పరిపాలిస్తూ అయోధ్యానగరంలో నివసించి వున్నాడు.

అతను, సత్యంతప్పకుండానూ, ధర్మార్థకామాలు ఏమరకుండానూ, అమరావతిని ఇంద్రుడు పరిపాలించేటట్టు అయోధ్యానగరం పరిపాలిస్తూ వున్నాడు.

ఆనగరంలో వుండిన జను లందరూ చక్కని భవనాల్లో నివసిస్తూ, ధర్మకార్యాలు చేస్తూ, పండితులవల్ల సకలశాస్త్రాలూ తెలుసుకుంటూ, తమతమ కులాచారాల ననుసరించి ధనధాన్యాదికం సంపాదించుకుంటూ, లోభులు కాకుండా, సత్యమే పలుకుతూ సుఖంగా వుంటున్నారు. వారిలో ప్రతీవాడూ బహుధనవంతుడే. ప్రతీవాడూ బహుకుటుంబీకుడే. ప్రతీవాడూ త్రివర్గపరాయణుడే. ప్రతీవాడూ ఆవులూ గుర్రాలూ రథాలూ కలవాడే. ప్రతీవాడూ ఏదో వొక విద్యలో పరిపూర్ణుడే. ప్రతీవాడూ ఆస్తికుడే. మరిన్నీ, స్త్రీపురుషులందరూ ధర్మశీలురే. కుండలాలూ ఉంగరాలూ కంకణాలూ మొదలైన ఆభరణాలు ధరించనివాడూ, శిరోవేష్టనం లేనివాడూ, పూలదండలు ధరించనివాడూ, భోగభాగ్యా లనుభవించనివాడూ, కస్తూరీ పచ్చకర్పూరమూ అత్తరులూ, కలిసిన గంధము పూసుకోని వాడూ, పంచభక్ష్య పరమాన్నాలు భుజించనివాడూ, దానధర్మాలు చెయ్యనివాడూ, జితేంద్రియుడు కానివాడూ, యజ్ఞాలు చెయ్యనివాడూ, నిత్యమూ అగ్నిహోత్రాలు చెయ్యనివాడూ, అల్పవిద్యలు మాత్రమే నేర్చినవాడూ,

దొంగతనం చేసేవాడూ, పరస్త్రీలను కోరేవాడూ ఆనగరంలో వొక్కడూ లేడు.

ఆనగరంలో వున్న బ్రాహ్మణు లందరూ దానాధ్యయన శీలురూ, స్వకర్మనిరతులూ, విజితేంద్రియులూను. వారిలో నాస్తికుడూ, అసత్యవాదీ, గొప్పగొప్ప విద్యలు నేర్చుకోనివాడూ, అసూయాపరుడూ, అశక్తుడూ, చాంద్రాయణాదివ్రతా లాచరించనివాడూ, దీనుడూ, లుబ్ధుడూ, దుఃఖితుడూ, వ్యాకులచిత్తుడూ వొక్కడూ లేడు.

వారిలో, పురుషు లందరూ నవమన్మథులే. స్త్రీలందరూ రతీదేవులే.

వారిలో రాజభక్తి లేనివా డొక్కడూ లేడు.

మరిన్నీ, ఆనగరంలో వున్న నాలుగు అగ్రవర్ణాలవారిలోనూ అందరూ దేవతలనూ అతిథులనూ పూజించేవారే. అందరూ కృతజ్ఞులూ, దాతలూ, శూరులూ, బలపరాక్రమవంతులూను. అందరూ దీర్ఘాయుష్మంతులూ, ధర్మనిరతులూ, సత్యప్రియులూను. అందరూ బహుకుటుంబీకులున్నూ.

ఆనగరంలో వున్న క్షత్రియు లందరూ బ్రాహ్మణుల ఆజ్ఞలు అనుసరిస్తూ వుంటారు. వైశ్యు లందరూ క్షత్రియుల ఆజ్ఞలు అనుసరిస్తూ వుంటారు. శూద్రులు స్వధర్మనిరతులై బ్రాహ్మణులనూ క్షత్రియులనూ వైశ్యులనూ సేవించుకుంటూ, వుంటారు.

అలాంటి అయోధ్యను పూర్వం వైవస్వతమనువు పాలించినట్టే దశరథమహారాజున్నూ పరిపాలిస్తున్నాడు.

ఆనగరంలో వున్న యోధులు శస్త్రాస్త్రవిద్యలు క్షుణ్ణంగా నేర్చినవారు. వారందరూ కౌటిల్యం లేనివారు. అగ్నితుల్యులు. వారి మొగాలమీాద వీరతేజస్సు ఉట్టిపడుతూ వుంటుంది. శత్రువులను వారు

లేశమాత్రమున్నూ సహించరు. సింహాలు గుహను ఆశ్రయించి వుండే టట్టు వారంతరూ అయోధ్యానగరంలో నివసించివున్నారు.

గుర్రాలు ఆనగరంలో వున్నన్ని మరెక్కడా లేవు. వాటిలో కొన్ని కాంభోజదేశంనుంచి వచ్చినవి. కొన్ని బాహ్లీకదేశంనుంచి వచ్చినవి. కొన్ని వనాయుదేశంనుంచి వచ్చినవి. మరికొన్ని సింధునదీ తీర్థంనుంచి వచ్చినవి. అవన్నీ కూడా దేవేంద్రుని ఉచ్చైశ్రవం లాగ సర్వశుభలక్షణాలతోనూ కూడుకుని వున్నవి.

నడగొండలవంటి యేనుగులు కూడా ఆనగరంలో వేలూ లక్షలూ వున్నాయి. వాటిలో కొన్ని వింధ్యపర్వతంమీద పుట్టినవి. కొన్ని హిమవత్పర్వతంమీద పుట్టినవి. కొన్ని ఐరావతం కోవలోవి. కొన్ని పుండరీకం కోవలోవి. కొన్ని అంజనం కోవలోవి. కొన్ని వామనం కోవలోవి. వాటిలో కొన్ని భద్రాలూ మంద్రాలూ మృగాలూ అనే శ్రేష్ఠజాతులకు చెందినవి. కొన్ని భద్రభద్రమంద్రమృగాలూ, భద్రమంద్రాలూ, భద్రమృగాలూ, మృగమంద్రాలూ అనే సంకీర్ణ జాతులకు సంబంధించినవి.

మొత్తానికి, ఆయేనుగు లన్నీ సర్వకాలసర్వావస్థలయందూ మదించి వుంటాయి.

ఆనగరం చుట్టూ రెండు యోజనాలవరకూ బలిష్ఠాలైన రక్షణ సాధనా లమర్చి వున్నాయి. మూడు యోజనాల వెడల్పుగల ఆనగరంలో మధ్యభాగంలో రెండు యోజనాల పరిమితి గలది సత్యపురం అన్న పేరితో ప్రఖ్యాతమయి వుంది. సార్థకనామం గల ఆసత్యపురం యెలాంటి వాళ్ళకీ గూడా అజేయం.

చంద్రుడు నక్షత్రాలను పరిపాలిస్తున్నట్టు, దశరథుడు అలాంటి పౌరులు గల అయోధ్యను పరిపాలిస్తున్నాడు.

సత్యపురం చుట్టూ కూడా అసాధ్య మైన ప్రాకారం వుంది. దానికి గల తోరణాలూ అర్గళాలూ దేవతలకూ రాక్షసులకూగూడా సాధ్యం కావు. చిత్రవిచిత్రా లైన మేడ లన్నీ ఆభాగంలోనే వున్నాయి. రాజబంధువులూ, సామంతరాజులూ, రాజపురుషులూ, సంపన్నులూ ఆభాగంలోనే వున్నారు. వారి కందరికీ మధ్యగా వుండి దశరథుడు దేవేంద్రుడు అమరావతి నేలుతున్నట్టు అయోధ్య నేలుతున్నాడు.

## 3

## దశరథుని మంత్రిమండలి

ఆ దశరథమహారాజునకు, ధృష్టి జయంతుడు విజయుడు సిద్ధార్థుడు అర్థసాధకుడు అశోకుడు మంత్రపాలుడు సుమంత్రుడు అని యెనమండుగురు మంత్రు లున్నారు. ఋషి సత్తము లైన వసిష్ఠుడు వామదేవుడు అని యిద్దరు పురోహితులున్నూ వున్నారు. జాబాలుడు మొద లైన ఋర్త్విజులు కూడా వున్నారు.

మంత్రులు లౌకికకార్యాలూ, ఋర్త్విజులు వైదికకార్యాలూ నిర్వర్తిస్తూ వుంటారు. వసిష్ఠుడూ వామదేవుడూ ఉభయకార్యాలూ నిర్వహిస్తూ వుంటారు.

వారందరూ మంత్రతంత్రాలు బాగా తెలిసినవారు. పరేంగిత జ్ఞానులు. ప్రభువునకు ప్రియమూ హితమూ అయిన ప్రతీకార్యమూ కష్ట నిష్ఠురాలు సహించి నిర్వహిస్తారు. ఆన్వీక్షకి మొదలయిన విద్యలన్నీ క్షుణ్ణంగా నేర్చినవారు. చెడ్డపను లెన్నడూ తలంపున కయినా రాని వ్వారు. విజితేంద్రియులు. బుద్ధిమంతులు. ఐశ్వర్యవంతులు. సాటిలేని బల పరాక్రమాలు గలవారు. సకలశాస్త్రపరిజ్ఞాతలు. కీర్తివిస్తారులు. రాజ కార్యాలయం దెప్పుడూ వా రప్రమత్తు లై వుంటారు. మనస్సులో

తలుచుకున్నదే చెబుతూ, చెప్పినదే చేస్తూవుంటారు. తేజోనిధులు. క్షమాశీలులు. మదమాత్సర్యాలు లేక మందహాసం చేస్తూనే మాట్లాడతారు. క్రోధంవల్ల గాని, డబ్బుకోసం గాని, మరేమయినా ప్రయోజనం కోరి గాని వారెన్నడూ అబద్ధాలాడరు. స్వరాష్ట్రంలోనూ పరరాష్ట్రాలలోనూ జరిగిందీ జరుగుతూ వున్నదీ, జరగబోయేదీ కొంచెమయినా మిగిలిపోకుండా చారులవల్ల వారెప్పటికప్పుడు గ్రహించేస్తూ వుంటారు.

రాజకార్యాలు నిర్వహించడంలో వారు మిక్కిలీ నేర్పుగలవారు. మైత్రివిషయమై చాలా పరీక్షలకున్నూ తాళినవారు. వారు, తమ కొడుకులు తప్పు చేసినా నిర్దాక్షిణ్యంగా శిక్షిస్తారు. ధనకనకరత్నరాసులతో బొక్కసం నింపడంలోనూ, జీతనాతాలు సరిగా యిస్తూ చతురంగబలాలనూ కట్టుబాటులలో వుంచడంలోనూ వారు చాలా సావధానంగా వుంటారు -

అపరాధం చేస్తే తప్ప శత్రు వయినంత మాత్రాన వారు ఎవరినీ యెంతమాత్రమూ బాధించరు. శత్రువులను అరికట్టడంలో సమర్థులున్నూ, శత్రుసంహారంలో వుత్సాహవంతులున్నూ, తూచాలు తప్పకుండా నీతిశాస్త్రం అనుసరించి నడుచుకునేవారున్నూ కనక, స్వరాష్ట్రంలో, మనోవాక్కాయకర్మలయందున్నూ శుచులై ప్రవర్తించే వారి నందర్నీ కాపాడుతూ వుంటారు. ఎంత డబ్బు సంపాదించుకున్నా తప్పు చేస్తే తప్ప వారెవరినీ పీడించరు. తప్పు చేస్తే బ్రాహ్మణులనూ క్షత్రియులనూ కూడా వారు శిక్షించకుండా విడిచిపెట్టరు. అయితే, ఎవరి నయినా, చేసిన నేరానికి తగిన శిక్షే విధిస్తారు; గాని పగబట్టి వారు అక్రమశిక్షలు విధించరు.

త్రికరణశుద్ధులై బాధ్యతలు గుర్తించుకుని మంత్రు లందరూ ఒక్క మాటమీద నడుచుకుంటూ వుండడంవల్ల అయోధ్యానగరంలోనే కాక,

కోసలదేశం, అంతటా కూడా అబద్ధా లాడేవా డొక్కడూ లేడు. కుటిలుడూ, పరస్త్రీరతుడూ కూడా వొక్కడూ లేడు. నగరమూ, రాష్ట్రమూ ఎల్లప్పుడూ ప్రశాంతంగానే వుంటాయి.

మంత్రు లందరూ ఎల్లప్పుడూ విలువగల వస్త్రాభరణాలు ధరిస్తారు. శీలవంతులై రాజునకు అభ్యుదయమే సాధిస్తూ వుంటారు. గుణం మాత్రమే గ్రహిస్తూ గురుజనులను వారు భక్తిశ్రద్ధలతో పూజిస్తారు.

ఎట్టివారితో యేసమయంలో యెలాంటి సంధి చేసుకోవాలో వారికి బాగా తెలుసు. యుద్ధం తప్పకపోతే యెలాంటివారితో యేసమయంలో యెంత యెత్తున దండయాత్ర సాగించుకోవాలో కూడా వారికి బాగా తెలుసు. బలపరాక్రమాలలో ఎవరికీ లొంగరనీ, అతీతానాగతవిష యాలు గుర్తించడంలో అంతటి సూక్ష్మబుద్ధి గలవారు మరెవరూ లేరనీ విదేశాలలో కూడా వారికి గొప్ప ప్రఖ్యాతి వుంది.

ఇలాంటి, ఆమంత్రుల సాయంతో దశరథమహారాజు జగజ్జేగీయ మానంగా ప్రజాపాలనం చేస్తున్నాడు. అతను కూడా చారులవల్ల స్వరాష్ట్రవార్తలూ పరరాష్ట్ర వృత్తాంతాలూ సకృచ్ఛ్రంగా తెలుసు కుంటూ వుంటాడు. ఎవరు అధర్మంగా ప్రవర్తించినా వారిని కఠినంగా శిక్షించడమూ, ఎవరు ధర్మంగా ప్రవర్తించినా వారిని ఆదరించడమూ అతనికి వ్రతం. అతని శత్రువుల్లో అతన్ని మించగలవాడు గాని - అథవా - అతనితో సమానం కాగలవాడు గాని వొక్కడూ లేడు. మీదుమిక్కిలి పరరాజులలో చెప్పుకోతగ్గవా రందరూ అతనితో యిష్టంగా వుండడానికే ప్రయత్నిస్తూ వుంటారు. సామంతు లందరూ యెప్పుడూ అతని పాదాలకు మొక్కుతూ వినయవిధేయతలు చూ పిస్తూ వుంటారు.

మంత్రాంగనిర్వహణంలోనూ, తనకు అనుకూలంగా నడచుకోడం లోనూ సమర్థులున్నూ సర్వశక్తిసంపన్నులున్నూ అయిన యిలాంటి మంత్రులతో కూడుకుని ఆ దశరథ మహారాజు తేజస్వంతాలైన అసంఖ్యాకకిరణాలతో బాలసూర్యుడులాగ ప్రకాశిస్తూ వున్నాడు.

## ४

## దశరథుని అశ్వమేధయాగ సంకల్పం

ఎన్నుంటే ఏమి లాభం, దశరథునికి సంతానం లేకపోయింది. వంశకర్త లైన కొడుకుల కోసం యెంత పరితపించినా యెప్పటికీ అతని కొక్క కొడుకయినా పుట్టలేదు. చివరి కతను "కొడుకుల కోసం మనం అశ్వమేధం యెందుకు చెయ్యగూడదూ?" అనుకున్నాడు. "చేసి తీరాలి" అని నిశ్చయమున్నూ చేసుకున్నాడు.

వెంటనే అతను ఈసంగతి సూక్ష్మబుద్ధు లైన మంత్రుల కందరికీ చెప్పాడు. చెప్పి, వా రందరిలోనూ మిక్కిలీ సమర్థుడూ ఉత్తముడూ అయిన సుమంత్రుణ్ణి చూసి "మన గురువులనూ పురోహితులనూ వెంటనే తీసుకురా" అని ఆజ్ఞాపించాడు.

సుమంత్రుడున్నూ అతిశీఘ్రంగా వెళ్ళి వేదపారగు లైన సుయజ్ఞుణ్ణీ, వామదేవుణ్ణీ, జాబాలినీ, కాశ్యపుణ్ణీ, పురోహితు డైన వసిష్ఠుణ్ణీ, బ్రాహ్మణోత్తములు కొందరినీ తీసుకువచ్చాడు. ధర్మాత్ము డైన దశరథుడు వారి నందరినీ యథావిధిగా పూజించి "మహాత్ములారా! కొడుకులు లేకపోడంవల్ల నాకు సుఖం లేకుండా వుంది. కనక, పుత్ర సంతానం నిమిత్తం శాస్త్రప్రకారం యజ్ఞం చెయ్యాలని నాకు నిశ్చయబుద్ధి కలిగింది. మీరంతా మహానుభావులు, కనక, నాకోరిక

యెలా నెరవేరుతుందో ఆలోచించి నిశ్చయించండి" అని మనవిచేసు కున్నాడు.

పరమప్రీతులై వారందరూ వెంటనే మంచిదన్నారు. అందరితోటీ ఆలోచించి వసిష్ఠుడు "నీసంకల్పం స్తుతిపాత్రంగా వుంది. సంభారా లన్నీ సమకూర్పించు. యజ్ఞాశ్వం కూడా విడిచిపెట్టు. నీకు సర్వ లక్షణ సంపన్నులైన కొడుకులు తప్పకుండా కలుగుతారు" అని చెప్పాడు.

బ్రాహ్మణవాక్యం విని దశరథుడు మిక్కిలీ సంతోషించి, మంత్రు లను చూసి "గురువుల ఆజ్ఞ విన్నారుకదా? కనక, సంభారా లన్నీ సిద్ధం చెయ్యండి. సమర్థుడైన రక్షకుణ్ణి ఏర్పరిచి, ఉపాధ్యాయుల నున్నూ తోడిచ్చి యజ్ఞాశ్వం విడిచిపెట్టండి. సరయూనది ఉత్తరపు గట్టున యజ్ఞశాలలు నిర్మింపించండి. శాస్త్రోక్తాలైన శాంతికవిధు లన్నీ నిర్వర్తించండి. రాజులైనవారి కందరికీ అశ్వమేధం చెయ్య తగ్గదే; కాని తప్పులు సంభవించకుండా నెరవేర్చడం కష్టం; కాబట్టి యెవరో నూటికీ కోటికీ వొక్కరే గాని అందరూ పూనుకోలేరు. యజ్ఞాలు చెయ్యడంలోనూ, చేయించడంలోనూ మంత్రలోపాలూ, క్రియాలోపాలూ తటస్థిస్తే ఆబ్రాహ్మణులు బ్రహ్మరాక్షసు లవుతారు. అలాంటివారు నాయజ్ఞంలో తప్పులు పట్టడానికే చూస్తారు. యజ్ఞం చెడిపోతే కర్త నశించిపోతాడు; కనక, మీరందరూ యిది యథా విధిగా నెరవేరేటట్టు సావధానంగా వుండండి" అని సెలవిచ్చాడు.

బ్రాహ్మణు లందరూ రాజు నాశీర్వదించి వెళ్లిపోయారు. మంత్రు లందరూ "తమ సెలవు చొప్పున నడుచుకుంటా" మని మనవిచేసు కున్నారు. అందుకూ యిందుకూ చాలా సంతోషించి మహాద్యుతి మంతుడైన దశరథుడు అంతఃపురానికి వెళ్లి, భార్యలను చేరబిలిచి

"కొడుకులకోసం నేను అశ్వమేధయాగం చెయ్యబోతున్నాను. గనక, మీరు దీక్షగా వుండండి" అని చెప్పాడు.

హృదయోత్తేజకం అయిన రాజుమాట వినపడేటప్పటికి, చలి కాలం గడిచి వసంతకాలం రాగానే తామరపువ్వులు సమధికశోభతో వికసించేటట్టు రాణుల ముఖపద్మాలు ప్రఫుల్లా లయినాయి.

## ౫

## ఋ శ్య శృ ం గ రో మ పా దు ల స మా వే శ ం

ఇదంతా వినీ చూసీ సుమంత్రుడు దశరథునితో ఇలాచెప్పాడు.

"మహాప్రభూ ఇప్పుడు వసిష్ఠాదులు సెలవిచ్చిన యీపుత్ర సంపాద నోపాయం ఇతిహాసరూపంగా యిదివరకే నేను విని ఉన్నాను. అదంతా త్రికాలజ్ఞాన సంపన్నుడైన సనత్కుమారుడు చెప్పివున్నాడు.

"ఇప్పుడు కాశ్యపునకు విభండకు డనే కొడుకున్నాడు గదా ? ఆవిభండకునికి ఋశ్యశృంగు డనే కొడుకు పుడతాడు. తాను నివసించి వుండే అడవి తప్ప అతనికి గ్రామా లున్నాయనీ, పట్నా లున్నా యనీ, నగరాలున్నా యనీ, ప్రపంచకంలో యెన్నో విధాల మనుష్యు లున్నా రనీ, యేమిటేమిటో వస్తువు లున్నా యనీ, లేశమూ తెలవదు. తండ్రి ఆజ్ఞ ననుసరించి తమ ఆశ్రమం వుండిన అరణ్యంలో మాత్రమే అతను సంచరిస్తూ వుంటాడు. అరణ్యంలో నైనా అతని కెప్పుడూ నర దర్శనం కాదు. బ్రహ్మచర్యం రెండు విధా లనీ, వొక విధం, వివాహా నికి పూర్వం వ్రతానుష్ఠానాలతో గడిపే దనీ, రెండో విధం, వివాహం చేసుకుని ఋతుకాలంలోనే భార్యను మాత్రమే కూడడం అనీ లోకంలో ప్రసిద్ధమే కదా ? ఈరెండు విధాల బ్రహ్మచర్యమూ కూడా

శ్రేష్ఠ మైనదే అని వేదవేదాంగవేత్త లైన బ్రాహ్మణులు చెబుతూనే వున్నారు కదా? కనక, ప్రపంచకం యేమీ యెరగని ఋశ్యశృంగు డున్నా బ్రహ్మచర్యానుష్ఠానం యీ రెండు విధాలా సాగించుకోగలడు.

వ్రతానుష్ఠానరూప మైన బ్రహ్మచర్యం సాగించుకుంటూ అగ్ని పూజా, పితృసేవా, గురుశుశ్రూషా చేసుకుంటూ వుండగా ఋశ్య శృంగునకు యౌవనం వస్తుంది. సరిగా, ఆసమయాన, ప్రసిద్ధి పొందిన రోమపాదు డనే రాజు అంగదేశం పాలిస్తూ వుంటాడు. కొంతకాలా నికి విధినిషేధాలు ఉల్లంఘించి ఆరాజు అధర్మంగా ప్రవర్తిస్తాడు. అందు వల్ల, అంగదేశంలో, ఘోరమూ సర్వభూతభయంకరమూ అయిన అనావృష్టి సంభవిస్తుంది. దానివల్ల ప్రజలు మలమల మాడిపోతారు. అది చూసి, ఆరాజు, మిక్కిలీ దుఃఖించి, గొప్ప పండితులూ, ధర్మ మార్గప్రవర్తకులూ అయిన బ్రాహ్మణులను పిలిపించుకుని "మహాను భావులారా! మీకు ధర్మాలన్నీ తెలుసు. లోకచరిత్ర కూడా మీరు బాగా యెరుగుదురు. నే నకృత్యాలు చెయ్యడంవల్ల దారుణమైన యీ అనావృష్టి సంభవించింది. ఇది పోడానికి తగిన ప్రాయశ్చిత్తం విధించి నన్ననుగ్రహించండి" అని ప్రార్థిస్తాడు. అందుకు, వేదపారగు లైన ఆబ్రాహ్మణులు "రాజా! ఋశ్యశృంగు డని వొక మహానుభావు డున్నాడు. అతను విభండకుని కుమారుడు. ఏదో వొక వుపాయం పన్ని అత న్నిక్కడికి రప్పించుకుని, బాగా సత్కరించి, నీకూతు రైన శాంత నిచ్చి యథావిధిగా పెళ్లి చెయ్యి. అలా చేస్తే అనావృష్టి దోషం పోయి, వర్షాలు కురిసి, సుభిక్షం ఏర్పడి నీప్రజలు బతుకుతారు. దేశం మళ్లీ కలకల్లాడుతూ వుంటుంది" అని చెబుతారు.

అది విని రోమపాదుడు చాలా సంతోషిస్తాడు; కాని ఋశ్య శృంగుణ్ణి రప్పించికునే వుపాయంతోచక మిక్కిలి చింతించి, తుదకి,

పురోహితుణ్ణీ, మంత్రులనూ పిలిచి "మీరు వెళ్లి సర్వోపాయాలూ అవలంబించి ఋశ్యశృంగుణ్ణి తీసుకురండి" అని ఆజ్ఞాపిస్తాడు. అయితే, వారందుకు సిద్ధపడలేరు. "మహాప్రభూ! విభండకుడు మహర్షి. అతను సర్వసమర్థుడు. మా ప్రయత్నం తెలుసుకున్నాడంటే మమ్ము శపించేస్తాడు. కనక, వెళ్లలేము. మమ్ము కటాక్షించు" అని ప్రార్థించి, మంచి వుపాయం మాత్రం చెబుతారు. వెంటనే రోమపాదుడు వారకాంతలను పంపి ఋశ్యశృంగుణ్ణి రప్పించుకుంటాడు. అతను దేశంలో అడుగు పెట్టగానే వర్షాలు కురుస్తాయి. రోమపాదుడు తన పెంపుడు కూతురైన శాంతాదేవి నిచ్చి అతనికి పెళ్లి చేస్తాడు. ఆశాంత తమకు ఔరసపుత్రి కనక, వివాహం తమరు చెయ్యకపోయినా, ఋశ్యశృంగుడు తమకున్నూ అల్లుడే. ఆమహానుభావుడు తమకు పుత్రసంతానం కలిగే యజ్ఞం చేయించగలడు."

## ౬

## వేశ్యలు ఋశ్యశృంగుణ్ణి తీసుకురావడం

ఇదంతా విని చాలా సంతోషించి, దశరథుడు "ఋశ్యశృంగుణ్ణి వెవరెలా తీసుకువచ్చారో ఆసంగతి వివరంగా చెప్పు" అని అడిగాడు.

"చిత్తగించండి" అని సుమంత్రు డిలా బదులు చెప్పుకువచ్చాడు.

"మంత్రులు వింటూ వుండగా రోమపాదుణ్ణి చూసి పురోహితుడు "మహాప్రభూ! మేము అపాయంలేని ఉపాయం ఆలోచించాం. ఋశ్యశృంగుడు తాను పుట్టి పెరుగుతూ వుండిన అరణ్యం వొక్కటే యెరుగును. వేదం వల్లించుకోడమూ, తపస్సు చేసుకోడమూ తప్ప అతను మరో పనే యెరుగడు. స్త్రీజాతి వొకటి వున్నదని అతను విని అయినా వుండలేదు. శబ్దస్పర్శరూపరసగంధాలకు సంబంధించిన సుఖం

అతను కలలో కూడా యెరుగడు; కనక, పురుషుల చిత్తాలను ఆకర్షించే వుపాయాలు పన్ని అతన్ని యిక్కడికి రప్పించదలిచాం. ఇందుకు రూపవతులైన వేశ్యలు తగుదురు. వాళ్ళయితే యెలా గయినా కార్యం సాధించగలరు" అని విన్నవించాడు.

రోమపాదు డందు కంగీకరించాడు. వెంటనే మంత్రులు తగిన సాధనసంపత్తి యిచ్చి వేశ్యలను పంపారు. వాళ్ళు విభండకాశ్రమ సమీపాన విడిది యేర్పరచుకుని ఉపాయాలు పన్నుతూ ప్రయత్నాలు ప్రారంభించారు.

ఋశ్యశృంగుడు పితృసేవ చేసుకుంటూ ఆశ్రమంలోనే వుంటాడు. బయటి కెప్పుడూ వెళ్ళడు. తననీ తండ్రినీ తప్ప అతను మరో మనిషినే యెరుగడు. కాని, దైవవశాన ఒకనాడు వారకాంత లున్నచోటికి వచ్చాడు. అతనికోసం తపస్సు చేస్తూవున్న వేశ్యలు చిత్రవిచిత్ర వేషాలతో వచ్చి చుట్టూ మూగి పాటలు పాడుతూ విభ్రమవిలాసాలతో అతన్ని ఆకర్షించారు. అంతేగాక: "నువ్వెవరయ్యా? ఈ కీకారణ్యంలో ఏకాకివై సంచరిస్తున్నా వేమయ్యా?" అని అడిగారు.

అలాంటి మనుషుల నెప్పుడూ చూసివుండకపోవడంవల్ల వాళ్ళ యెడల వెంటనే స్నేహభావం కలగ్గా అతను "నాతండ్రి విభండకు డనే మహర్షి. నేను ఆయన కుమారుణ్ణి. నాపేరు ఋశ్యశృంగుడు. శుభదర్శనులారా! మా ఆశ్రమం యిక్కడే — యీసమీపానే వుంది. మీరందరూ అక్కడికి రండి విధిపూర్వకంగా నేను పూజ చేస్తా" అని కోరాడు.

అతని ఆశ్రమం యెలా వుంటుందో చూతా మని వాళ్ళు అతని వెంట వెళ్ళారు. "ఇదిగో యిది అర్ఘ్యం, యిది పాద్యం, యివి కందమూల ఫలాలు" అంటూ అతను ప్రీతితో సమర్పించగా, వాళ్లు సంతో

పించారు ; గాని విభండకుడు వచ్చి శపించిపోతా డేమో అని భయ పడుతూనే "మాదగ్గిరా కొన్ని ఫలా లున్నాయి. అవి నువ్వు భక్షించాలి" అని చెప్పి, అందరూ తలొకమాటూ అతన్ని కౌగి లించుకుని తాము తెచ్చిన భక్ష్యా లతని చేతిలో పెట్టారు.

అతను, అవి పిండివంట లని యెరగడు. పిండివంట లెన్నడూ అతను చూడనైనా లేదు. కనక అవిన్నీ పళ్లు అనే అనుకుని పొంగి పోతూ అన్నీ భక్షించాడు. "ఇలాంటి తియ్యని పళ్లు నే నెప్పుడూ చూడనేలే" దని చాలా ప్రశంసకూడా చేశాడు. అతని మనస్సు తమమీద స్థిరపడేటట్టు అందుకు తగ్గ బదులు మాటలు చెప్పి "ఇక నైనా త్వరగా వెళ్లకపోతే కీడు మూడుతుం దని స్థిరపరుచుకుని "మిత్రుడా! వ్రతచర్య నడుపుకుంటూ నిన్ను విడిచిపెట్టలేక నీతో వచ్చాం. వ్రతశేషం నిర్వహించుకోకపోతే దోషం చుట్టబెట్టుకుంటుం దని నువ్వా యెరుగుదువుకదా? కనక, దయవుంచి మా కిప్పటికి సెలవియ్యి" అని కోరి అతన్ని విడవలేకుండా వున్నట్టు నటిస్తూ, అతి కష్టంమీద వెడుతున్నట్టు కనపడుస్తూ తమ విడిదికి వెళ్లిపోయారు.

వాళ్లలా వెళ్లారు, ఋశ్యశృంగుని మనస్సిలా తారుమా రయి పోయింది. దుఃఖం ముంచుకు వచ్చింది. ఏమి చెయ్యడానికీ తోచ లేదు. మర్నాడు తెల్లవారడం తరవాయిగా అతను వాళ్ళ విడిది చేరుకున్నాడు.

ఇది యిలా జరుగుతుం దని వేశ్యలకు తెలుసు. అంచేత వాళ్ళు పష్టిగడియలూ చక్కగా అలంకరించుకుని వుంటున్నారు. కాగా, కమ్మని పాటలు పాడుకుంటూ, విభ్రమవిలాసాలు చూపిస్తూ యెదురు వెళ్లి, స్వాగతం యిస్తున్నట్టు తలొకమాటూ గట్టిగా కౌగలించుకుని, చెవిలో ప్రియభాషలు పలుకుతున్నట్టు పెదవులతో చెక్కిళ్లు స్పృశించి,

తీసుకువెళ్లి తమ మధ్య కూచోబెట్టుకున్నారు. దాంతో అతను పరవశుడై పోయాడు. అది గుర్తించి వాళ్లు "సౌమ్యుడా! మేమిక మా ఆశ్రమానికి పోవలసివుంది. మేము నీఆశ్రమానికి వచ్చినట్టే నువ్వున్నా వొకమాటు మా ఆశ్రమానికి రావడం ధర్మం. అక్కడ నీ కింతకంటే యెక్కువగా అతిథిపూజ చేస్తాము" అన్నారు.

అది అతనికి గొప్పవరం లాగ కనపడింది. వెంటనే అతను గంగా నదిలో పడవ యెక్కి వాళ్ళతో బయలుదేరాడు. ఆ పడవ అంగ దేశం ప్రవేశించీ ప్రవేశించడంతోనే దేశం అంతటా గొప్ప వాన కురిసింది. ఆవానతో అతని రాకగుర్తించి రోమపాదుడు సకలపరివారంతోనూ యెదురు వెళ్లి, సాష్టాంగనమస్కారాలు చేసి, నమ్రుడై యథాశాస్త్రంగా అర్ఘ్యపాద్యాది విధులతో పూజించి 'మహాత్మా! నా అపరాధాలు క్షమించి నన్ను మన్నించు' అని ప్రార్థించాడు. తరవాత, అంతఃపురానికి తీసుకువెళ్ళి తన కూతురైన శాంత నిచ్చి యథాశాస్త్రంగా వివాహం కూడా చేశాడు. అందుకు చాలా సంతోషించి, అతను, మామగారి పూజ లందుకుంటూ శాంతతో సకల సుఖాలూ అనుభవించసాగాడు.

## ౭

## ఋశ్యశృంగుడు అయోధ్యకు రావడం

"రాజేంద్రా! కథావశాన ఆ సనత్కుమారుడు సెలవిచ్చింది యింకా వుంది. మనవి చేసుకుంటూ నాలకించండి. ఇక్ష్వాకువంశంలో దశరథుడనే మహారాజు పుడతాడు. అతను ధార్మికుడూ సత్యప్రతిజ్ఞుడూ అయివుంటాడు. దశరథుడూ, అంగరాజయిన రోమపాదుడూ స్నేహితులవుతారు. దశరథుడు ఆరోమపాదుని దగ్గిరికి వెళ్లి 'ధర్మాత్మా!

నేను సంతానభాగ్యం లేక దుఃఖితుణ్ణయి వున్నాను. సంతానం కోసం నేను యజ్ఞం చెయ్యతలచుకున్నాను. ఆ యజ్ఞం శాంతాదేవి భర్త అయిన ఋశ్యశృంగుడు చేయిస్తేనే నాకోరిక నెరవేరుతుంది. కనక ఆమహానుభావుణ్ణి నువ్వు శాంతతో కూడా మాయింటికి పంపి నన్ను కృతార్థుణ్ణి చెయ్యి' అని కోరతాడు. దానిమీద, రోమపాదుడు బాగా ఆలోచించి, అప్పటికి పుత్రవంతుడయి వున్న ఋశ్యశృంగుణ్ణి దశరథున కప్పగిస్తాడు. దశరథుడున్నూ మిక్కిలీ సంతోషించి, యజ్ఞంకోసమూ సంతానంకోసమూ, స్వర్గంకోసమూ ఋశ్యశృగుణ్ణి ఋత్విక్కుగా వరిస్తాడు. దానివల్ల అతనికోరిక నెరవేరుతుంది. అతనికి అమితబలపరాక్రమవంతులైన నలుగురు కొడుకులు పుడతారు. వారు త్రిలోకాలయందూ కీర్తి కలవాళ్ళూ వంశకర్తలూ అవుతారు. "

" దేవప్రవరుడైన సనత్కుమారుడు సెలవిచ్చిన యీక్రమం తప్పకుండా జరిగితీరుతుంది ; కాబట్టి తమరు అలా చెయ్యడం అగత్యం " అని సుమంత్రుడు మనవిచేశాడు.

తానుండగా దశరథుడు మరో బ్రాహ్మణ్ణి వరించి యజ్ఞం చేస్తే వసిష్ఠుడు అసూయపొందవచ్చు. కనక, మతిమంతుడైన దశరథుడు ఇదంతా యెరిగించి వసిష్ఠుని అనుమతి పొంది, మహారాణులనూ మంత్రులనూ తగిన పరివారమూ వెంటబెట్టుకుని, నిండు మనస్సుతో అంగదేశం చేరుకుని, ముందుగా, రోమపాదుని నగరిలో అగ్నిలాగ తేజరిల్లుతూ వుండిన ఋశ్యశృంగుని దర్శనం చేసుకున్నాడు.

తమకు గల స్నేహం పురస్కరించుకుని రోమపాదుడున్నూ మహానందభరితుడై దశరథుణ్ణి అనేకవిధాల గౌరవించాడు. మరిన్నీ, అతను, తనకీ దశరథునికీ బంధుత్వమే కాక స్నేహం కూడా వుండడమూ, దశరథుడు శాంతాదేవి జనకతండ్రి అయివుండడమూ సకృచ్ఛంగా

చెప్పగా ఋశ్యశృంగుడున్నూ మామగారైన దశరథుణ్ణి మిక్కిలీ పూజించాడు.

అందు కెంతో సంతోషించి దశరథుడు అక్కడ యేడెనిమిది దినాలుండి రోమపాదునితో "రాజేంద్రా! నీకూతురు శాంతనూ, అల్లుడు ఋశ్యశృంగుణ్ణీ ఒకమాటు మాతో పంపాలి" అని కోరుతూ, ఉన్న సంగతు లన్నీ చెప్పాడు. రోమపాదుడు అందుకు చాలా ఆనందించి "అమ్మాయీ, నువ్వూ వెళ్లి దశరథుని యింట కొన్నాళ్ళుండి రండి" అని చెప్పగా ఋశ్యశృంగుడు సంతోషించి అందు కంగీకరించాడు.

తరవాత, దశరథుడూ రోమపాదుడూ ఒకరి చేతు లొకరు పట్టుకునీ, ఒకరి నొకరు కౌగిలించుకునీ ప్రీతివిస్రంభాలు ప్రకటించుకున్నారు. అదయిన తరవాత, రోమపాదుని అనుజ్ఞ పొంది దశరథుడు సపరివారంగా అయోధ్యకు బయలుదేరాడు.

మంత్రులు దూతలవల్ల ఈసంగతి తెలియపరచగా, రాజోద్యోగులూ పౌరులూ స్వర్గపట్టణం కంటే ఎక్కువ అందంగా వుండేటట్టు అయోధ్యా నగరం అలంకరించారు. వీధు లన్నీ చక్కగా తుడిచి, పన్నీరు చల్లి, అగరుధూమాలతో సువాసింపజేసి పతాకలున్నూ యెగరవేసి అత్యుత్సాహం కనపరిచారు. రాజూ ఋశ్యశృంగుడూ రాగానే స్వాగతం నివేదించి, అర్ఘ్యపాద్యా లిచ్చి అనేకవిధాల గౌరవాదరాలు కూడా చూపించారు. శంఖదుందుభిస్వనాలతో దిక్కులు పిక్కటిల్లాయి.

దశరథుడు శాంతనూ ఋశ్యశృంగుణ్ణీ ఒక చక్కని ప్రాసాదంలో విడియించి "కృతకృత్యు ణ్ణయినా" నని ఆనందించాడు. అంతఃపుర స్త్రీ లందరూ శాంతనూ ఆమె భర్తనూ చాలా ఆదరించారు.

అందరిచేతా సాదరంగా పూజించబడుతూ భర్తతో కూడా శాంతాదేవి కొన్నాళ్ళు అక్కడ ఉండిపోయింది.

## ౫

## దశరథుడు ఋశ్యశృంగుణ్ణి ఋత్త్విక్కుగా వరించడం

కాలం గడుస్తూ వుండగా మనోల్లాసం కలిగించే వసంతకాలం వచ్చింది. అంతట, చైత్రపౌర్ణమినాడు, దశరథుడు దేవవర్చస్సుగల ఋశ్యశృంగుణ్ణి పూజించి "కులాభివృద్ధి నిమిత్తం సంతానం కోరి అశ్వమేధం చెయ్యబూనుకున్నాను. ఇందతా యథావిధిగా నిర్వహించి నన్ను కృతార్థుణ్ణి చెయ్యగోరుతున్నాను" అని ప్రార్థించాడు.

"చాలా సంతోషం. యజ్ఞసంభారా లన్నీ సమకూర్పించు. అశ్వమున్నూ విడిచిపెట్టు" అని ఋశ్యశృంగుడు సెలవిచ్చాడు. దానిమీద దశరథుడు సుమంత్రుణ్ణి చూసి "జాబాలినీ, కాశ్యపుణ్ణీ పురోహితుడైన వసిష్ఠునీ తక్కిన బ్రాహ్మణోత్తములనూ రప్పించు" అన్నాడు.

స్వయంగా వెళ్లి సుమంత్రుడు వారి నందర్నీ తీసుకువచ్చాడు. వారున్నూ పరమానందభరితులై చెయ్యవలసిన వన్నీ చెప్పారు. "నీకు అమితవిక్రములైన నలుగురు కొడుకులు పుడతా" రని వసిష్ఠుడు ప్రత్యేకంగా చెప్పాడు. "వారు సెల విచ్చిన వన్నీ సరిగా చేయించు" మని దశరథుడు మళ్ళీ సుమంత్రుణ్ణి ఆజ్ఞాపించాడు.

## ౬

## అశ్వమేధసన్నాహం

పను లన్నీ ముగిశాటప్పటికి సంవత్సరం గడిచి మళ్ళీ వసంతం వచ్చింది. అప్పుడు దశరథుడు "మునిపుంగవా! సర్వమూ సిద్ధమయి వుంది. సంతానం నిమిత్తం ఉద్దేశించిన అశ్వమేధయాగం నడిపించి నన్ను కృతార్థుణ్ణి చెయ్యగోరుతున్నాను. రాక్షసాదులవల్ల విఘ్నం కలక్కుండా యథాశాస్త్రంగా సర్వమూ నెరవేర్పగోరుతున్నాను.

తాము నాయెడల అవిచ్ఛిన్న స్నేహం కలవారు. కావున తమరే యీ భారం అంతా వహించవలసివుంది" అని ప్రార్థించాడు. అందుకు చాలా ఆనందించి వసిష్ఠుడు "రాజేంద్రా! నువ్వు నిశ్చింతగా వుండు. నీకోరిక లన్నీ చక్కగా నెరవేరతాయి, సందేహం లేదు" అని చెప్పి యాజనసమర్థు లైన వృద్ధబ్రాహ్మణులనూ, స్థపతులనూ, కర్మాంతికులనూ, శిల్పకరులనూ, వర్ధకులనూ, ఖనకులనూ, గణకులనూ, శిల్పులనూ, శాస్త్రవేత్తలూ బహుశ్రుతులూ అయిన పండితులనూ, రసాభినయచతురు లైన నటులనూ భావాభినయసమర్థు లైన నర్తకులనూ చూసి "మహారాజులుంగారి సెలవయింది. మీ మీ చాతుర్యం చూపించి మెప్పూ బహుమతులూ పొందవలసిన సమయం వచ్చింది. ఎత్తూ వైశాల్యమూ వుండేటట్టు చక్కని రాజభవనాలు నిర్మించండి. భక్ష్యాన్నపానాలు నిండివుండేటట్టు బ్రాహ్మణగృహాలు నిర్మించండి. సకల సౌకర్యాలూ బహుభక్ష్యాలూ ఉండేటట్టు పౌరుల నిమిత్తమున్నూ చక్కని భవనాలు సిద్ధంచెయ్యండి. పల్లెటూరిజనానికిన్నీ వాసయోగ్యా లైన మందిరాలు నిర్మించండి అన్ని వర్ణాలవారూ మృష్టాన్నభోజనం చేసి సుఖించి ఆనందించాలి. ఇదంతా మీరు సరదాగా కాక, విధి అని నాకు శ్రేయస్కర మైన దనీ గుర్తించి జరిపించండి. ఎవరికీ అమర్యాద జరగకూడదు. ఎవరినీ తేలికగా చూడరాదు. ఎవరినీ ఏవగించుకోగూడదు. ఈసందర్భంలో యెవరి యెడలనూ యెవరూ కామక్రోధాదులు చూపించగూడదు. యజ్ఞకార్యనిర్వహణం చేసే శిల్పులను కూడా మృష్టాన్నసంతృప్తులను చెయ్యాలి. ధనకనక వస్తువాహనాలు కూడా యిచ్చి వారిని జ్ఞానవయోవృద్ధి ననుసరించి గొప్పగా సత్కరించాలి. ఇలాగ, మీరు స్నేహార్ద్రచిత్తులై యెవరినీ మరిచిపోకుండా యేమీ లోటు రాకుండా సర్వమూ సలక్షణంగా జరిగించండి" అని ఆజ్ఞాపించాడు.

అందుకు వా రందరూ "ఏమీ లోటు రానివ్వము, అంతా సవ్యంగా నడిపిస్తాము" అని మాట యిచ్చారు.

తరవాత వసిష్ఠుడు సుమంత్రుణ్ణి చూసి "మంత్రిపుంగవా! ధార్మికు లైన రాజుల కందరికీ ఆహ్వానాలు పంపు. దేశదేశాలనుంచి బ్రాహ్మణ క్షత్రియవైశ్యశూద్రులను కూడా రప్పించు. మిథిలాధిపతి అయిన జనక మహారాజు గొప్ప శూరుడు. సత్యవిక్రముడు. సర్వశాస్త్రాలూ క్షుణ్ణంగా తెలిసినవాడు. చతుర్వేదాలూ అధ్యయనం చేసినవాడు. ఆమహాభాగుణ్ణి నువ్వు స్వయంగా వెళ్లి తీసుకురా. కాశీపతి కూడా మనకి అలాంటి వాడే, అతనున్నూ మన ప్రభువుకి గొప్ప స్నేహితుడు. ప్రియవాది. అతన్ని కూడా, స్వయంగా వెళ్లి నువ్వే పిలుచుకురా. ప్రభువు మామగారైన కేకయమహారాజును కూడా నువ్వే వెళ్లి, కొడుకుతో కూడా తీసుకురా. అతను పెద్దవాడు. పరమధార్మికుడు. అంగదేశాధిపతీ, ప్రభువు స్నేహితుడూ, యశస్వీ అయిన రోమపా దుణ్ణి కూడా స్వయంగా నువ్వే వెళ్లి తీసుకురా. ప్రాగ్దేశపురాజులనూ, దాక్షిణాత్యమహారాజులనూ, సింధుసౌవీరసౌరాష్ట్రరాజులనూ కూడా రప్పించు. ప్రభువు స్నేతు లైన రాజు లింకా యెంద రో వున్నారు. సపరివారంగా వారిని కూడా రప్పించు" అని ఆజ్ఞాపించాడు.

సుమంత్రుడు వసిష్ఠుని ఆజ్ఞ శిరసావహించి ప్రధాను లైన రాజులను పిలిచి తీసుకురావడానికి తాను స్వయంగా బయలుదేరి వెడుతూ, తక్కిన వారి నిమిత్తం తగినవారిని పంపాడు.

తరవాత కర్మాంతికులు వచ్చి "మహానుభావా! మేము చెయ్య వలసినదంతా సిద్ధంచేశాము. తాము దయచేసి పరిశీలించవచ్చు" అని విన్నవించుకోగా, వసిష్ఠుడు వెళ్లి చూసి, అంతా చక్కగా సిద్ధమయి వున్నందుకు చాలా సంతోషించి వారితో "ఎవరినిన్నీ అగౌరవ

పరచవద్దు. ఎవరికీ కావలసిన వేవీ నిర్లక్ష్యంగా యివ్వవద్దు. ఆదర గౌరవాలు ఎంతమాత్రమూ తగ్గరాదు" అని గట్టిగా చెప్పాడు.

ఇదయిన తరవాత ధనకనకరత్న వాహనాదులైన కానుకలు పట్టించుకుని దేశదేశాల రాజులు ఒక్కొక్కరే వచ్చారు. వసిష్ఠుడు దశరథునితో "నరవ్యాఘ్రా! నీ ఆహ్వానం అందుకుని యిదే రాజు లందరున్నూ దయచేశారు. మేమంతా వారిని యథార్హంగా సత్కరించాము. యజ్ఞసంభారాలున్నూ సమస్తమూ సజ్జితమయి వున్నాయి. కనక, నువ్వొకమాటు యజ్ఞశాలకు వచ్చి అంతా చూడవలసింది" అని చెప్పాడు. ఋశ్యశృంగుడు కూడా యిలాగే చెప్పగా దశరథుడు శుభదినమున వసిష్ఠప్రముఖులైన బ్రాహ్మణోత్తములను, ఋశ్యశృంగుణ్ణి ముందుంచుకుని యజ్ఞారంభం చెయ్యడానికి సపరివారంగా వెళ్లి యజ్ఞశాలలో ప్రవేశించాడు.

## ౧౦

## యాగ విశేషాలు

సంవత్సరం గడిచింది. దేశా లన్నీ తిరితిరిగి గుర్రమున్నూ వచ్చింది. సరయూనది ఉత్తరపు గట్టున యాగం ప్రారంభం అయింది. ఋశ్యశృంగుణ్ణి అనుసరిస్తూ వేదవేదాంగవేత్త లయిన బ్రాహ్మణులు వేదం అనుసరించిన్నీ, మీమాంసాశాస్త్రం అనుసరించిన్నీ, కల్పసూత్రాలు అనుసరించిన్నీ సకలమూ నిర్వర్తించారు.

మునిపుంగవు లైన ఆ బ్రాహ్మణోత్తములు ఇంద్రున కివ్వవలసిన హవిర్భాగా లిచ్చి స్తోత్రశస్త్రాలతో సోమలతను స్తుతించి, బహిష్పవమానాదులచే తత్కర్మదేవతలను పూజించి, ప్రవర్గ్యోపసత్తు లయిన తరవాత ప్రాతస్సవనమూ, మాధ్యందినసవనమూ, తృతీయసవనమూ

నిర్వహించారు. వారు పొరపాటు కొంచెమయినా చెయ్యలేదు. అంతా బ్రహ్మభావనతోనే చేశారు.

ఆదినాలలో, అక్కడ, బడలిక పొందినవా డొక్కడూ కనబడలేదు. ఆకలితో మాడినవాడున్నూ కనపడలేదు. అక్కడకు వచ్చిన బ్రాహ్మణులలో విద్వాంసుడు కానివాడూ, నూర్గురు శిష్యులకు తక్కువ వున్న వాడూ ఒక్కడూ లేడు. ఆదినాలలో లెక్కలేనంతమంది బ్రాహ్మణులూ, వారి దాసులైన శూద్రులూ, తపస్వులూ, దిగంబరులైన సన్యాసులూ నిత్యమూ భుజిస్తూ వుండినారు. ముసలివాళ్లూ, రోగగ్రస్తులూ, స్త్రీలూ, పిల్లలూ స్వేచ్ఛగా భుజిస్తూ వుండిన్నీ తృప్తిలేక మళ్లీమళ్లీ భుజిస్తూ వుండినారు. వారు భుజించినకొద్దీ దశరథుడు తనకి తృప్తి లేక "ఇంకా అన్నంపెట్టండి. మళ్లీమళ్లీ బట్ట లివ్వండి" అని ఆజ్ఞాపిస్తూ వచ్చాడు.

భక్ష్యఖాద్యలేహ్యచోష్యాదిరూపాలతో భోజ్యపదార్థాలు ఎప్పటి కప్పుడు పర్వతా లంతలేసి గుట్టలుగా తయారయి వుండేవి. దేశదేశాల నుంచీ వచ్చిన స్త్రీపురుషులు "ఇంత చక్కని పదార్థాలు మేమెక్కడా చూడలేదు. మేము సంతృప్తులం అయినాము" అని గొంతెత్తి పలికి "దశరథమహారాజుకు ఇష్టాపూర్తి కావాలి" అని సర్వేశ్వరుణ్ణి ప్రార్థించారు. స్నానం చేసి చక్కగా అలంకరించుకున్న పురుషులు అనేకులు మరలమరల వడ్డించి వారిని తృప్తులను చేశారు.

ఇలాగ యాగం జరుగుతూ వుండగా బ్రాహ్మణులు తృప్తిగా భోజనాలు చేసి జిగీషతో శాస్త్రవాదాలు చేస్తూ కాలక్షేపం చేస్తూవుండినారు. ఋత్విక్కులు సర్వకర్మలు యథాశాస్త్రంగా నిర్వహిస్తూ వుండినారు. ఆయాగం చూడడానికి వచ్చిన బ్రాహ్మణులలో షడంగాలూ చదువుకోనివాడూ, బహుశ్రుతుడు కానివాడూ, వాదకుశలుడు కానివాడూ ఒక్కడున్నూ లేడు.

యూపోచ్ఛ్రయకాలాన, ఆయాగంలో, ఋత్విక్కులు బిల్వయూపా లారూ, ఖదిరయూపా లారూ, పలాశయూపా లారూ, శ్లేష్మాతక యూపం వొకటీ, దేవదారుయూపాలు రెండున్నూ నిలిపారు. ఒక్కొక్క యూపం యిర్వైయొక్క అరత్నుల పొడవున వుంది. శిల్పులు వాటిని ఎనిమిదేసి కోణాలు ఉండేటట్టు మిక్కిలీ చక్కగా చెక్కారు. అవన్నీ ఒక్కొక్క వస్త్రం చుట్టి గంధపుష్పాదులతో ఋత్విక్కు లలంకరించగా ఆకాశాన సప్తమహర్షులు ప్రకాశిస్తున్నట్టు ప్రకాశించాయి. శాస్త్రంలోచెప్పిన కొలతలతో యిటికిరాళ్లు చేయించి, శుల్బకర్మనిపుణు లైన బ్రాహ్మణులు వాటితో అగ్న్యాధార వేది నిర్మించారు. ఆవేది బంగారు రెక్కలు గల గరుడపక్షి ఆకారంగా వుంది. ఇంద్రాది దేవతల నుద్దేశించి ఆ యూపాలకు పశువులూ, సర్పాలూ, పక్షులూ యథాశాస్త్రంగా ఏరి సంపాదించి తెచ్చి కట్టారు. ఆ యూపాలకు కట్టిన మొత్తం పశువులు మూడువందలు. దశరథమహారాజు పట్టపుగుర్రాన్ని కూడా ఋత్విక్కులు ఆ పశువులలో చేర్చారు. పట్టమహిషి అయిన కౌసల్య ఆగుర్రాన్ని యథాశాస్త్రంగా పూజించి, సవతులతో కూడా బంగారపుసూదులతో దాని గుండెల మీద మూడు నాట్లు పెట్టింది. తరవాత కౌసల్య మనస్సు నిబ్బరం చేసుకుని ధర్మకామంతో ఆ రాత్రి అంతా ఆ గుర్రం దగ్గిర వుండి గడిపింది. పిదప, హోతా, అధ్వర్యుడూ, ఉద్గాతా బ్రహ్మ మహిషినీ, పరివృత్తినీ, వావాతనూ, బాలాకలిని వరాసగా పరిగ్రహించారు. నియతేంద్రియుడూ, ప్రయోగచాతుర్య సంపన్నుడూ అయిన అధ్వర్యుడు ఆగుర్రం వప తీసి యథావిధిగా హోమం చేశాడు. దశరథ మహారాజు యుక్తకాలంలో, యథాశాస్త్రంగా వపాధూమగంధం ఆఘ్రాణించాడు. తరవాత పదహారుగురు ఋత్విక్కులూ ఆగుర్రం అంగా లన్నీ విధివిధానంగా హోమం చేశారు. తక్కిన యజ్ఞాలలో

ఉపాహావిస్సు జువ్వికొమ్మలమీద సంస్కారం చేస్తారు. అశ్వమేధంలో మాత్రం ప్రబ్బలిమీద సంస్కారం చేస్తారు.

అశ్వమేధం మూడు దినాలు జరుగుతుంది. మొదటి దినం చతుష్టోమం అనీ, రెండో దినం ఉక్థ్యం అనీ, మూడో దినం అతిరాత్రం అనీ చెప్పబడింది. శాస్త్రం అనుసరించి ఆ అశ్వమేధంలో మరికొన్ని యాగాలు కూడా జరిగాయి. వాటిలో జ్యోతిష్టోమం వొకటి, ఆయుర్యాగం వొకటి, అతిరాత్రాలు రెండు, అభిజిద్యాగం వొకటి, విశ్వజిద్యాగం వొకటి, మహాక్రతువైన అప్తోర్యామం వొకటి, శాస్త్రసమ్మతాలైన మరెన్నో క్రతువులున్నూ అప్పుడు నిర్వర్తించబడ్డాయి.

బ్రహ్మ స్వయంగా ఏర్పరచిన అశ్వమేధయాగానికి, అది చేసిన మహారాజు తన రాజ్యం అంతా ఋత్విక్కులకు యాగదక్షిణగా యివ్వాలి. ఈవిధి ననుసరించి వంశవృద్ధి కోరుకుంటున్న దశరథమహారాజు హోతకు తూర్పు రాజ్యమూ, అధ్వర్యుడికి పడమటి రాజ్యమూ, బ్రహ్మకు దక్షిణరాజ్యమూ, ఉద్గాతకు ఉత్తరరాజ్యమూ యిచ్చి భూమి అంతా తక్కిన ఋత్విక్కుల కిచ్చాడు. అందుకు సంతోషించిన్నీ వారందరూ "రాజా, గతకల్మషుడవైన నువ్వొక్కడవే భూభారం వహించడానికి తగ్గవాడవు. భూమితో మాకేమీ పని లేదు. మేము రాజ్యం పాలించలేము. మేము వేదవేదాంగాధ్యయనం మాత్రమే చెయ్యగలం. కనక దానికి ప్రతిఫలంగా మా కేకొంచెమో ద్రవ్యమే ఇవ్వడం మంచిది. వీలయితే రత్నాలు, లేకపోతే బంగారం, అదీకాకపోతే ఆవులే చాలు." అన్నారు.

అందుకు సమ్మతించి దశరథుడు వేదపారగులైన ఆ బ్రాహ్మణులకు పదిలక్షల ఆవులూ, నూరుకోట్ల సువర్ణమూ, నాలుగు వందల కోట్ల వెండీ సమర్పించాడు. ఆబ్రాహ్మణులు ఆ ధనమంతా ఋశ్యశృంగునికీ

వసిష్ఠునికీ యిచ్చారు. వారిద్దరూ అది న్యాయంగా పంచి యెవ రికి ముట్టవలసింది వారికిచ్చారు. అందుకెంతో సంతోషించి వారు ఆ యిద్దరినీ కొనియాడారు.

తరవాత దశరథుడు యాగం చూడ్డానికి దేశదేశాలనుంచి వచ్చిన బ్రాహ్మణులకు కోటిసువర్ణా లిచ్చాడు. అంతా అయిపోయిన తరవాత వొక దరిద్రబ్రాహ్మణుడు వచ్చి ద్రవ్యం కోరగా మరేమీ లేనందున చేతి మురుగు ఇచ్చేశాడు. అందుకూ యిందుకూ గూడా బ్రాహ్మణులు చాలా సంతోషించారు. బ్రాహ్మణప్రీతి గల దశరథుడు వారి ఆనందం చూసి హర్షపర్యాకులనేత్రుడై వారి కందరికీ నమస్కరించాడు. బ్రాహ్మణులున్నూ సాష్టాంగపడిన దశరథుణ్ణి వేదోక్తాశీర్వచనాలు చేసి ఆనందపెట్టారు.

అప్పుడు దశరథుడు ఋశ్యశృంగుణ్ణి, నమస్కరించి "మహాత్మా, నావంశం వృద్ధి అయేటట్టు నువ్వే చెయ్యగలవు" అన్నాడు. ఋశ్య శృంగుడున్నూ "రాజా, నీకు నలుగురు కొడుకులు పుడతారు. వారు వంశవర్ధనులున్నూ అవుతారు" అని బదులు చెప్పాడు.

## ౧౧
## పుత్రకామేష్టి

ఇలా చెప్పి వేదవేత్త అయిన ఋశ్యశృంగుడు లెస్సగా ధ్యానించి లబ్ధ సంజ్ఞుడై "రాజా, సంతానం కలిగించే ఇష్టి వొకటి ఉంది. అది చేస్తాను" అని రాజుతో చెప్పి అధరస్సున చెప్పబడ్డ మంత్రాలతో విధివిధానంగా అది నెరవేర్చాడు. అంతట, దేవతలూ, గంధర్వులూ, సిద్ధులూ, పరమర్షులూ తమతమ హవిర్భాగాలు పుచ్చుకోడానికి అక్క డికి వచ్చి ఆసభలో కలుసుకుని, కూడబలుక్కుని బ్రహ్మ యెదట నిలిచి

" దేవా, రావణు డనే రాక్షసుడు నీఅనుగ్రహంవల్ల మిక్కిలీ గర్వించి మిమ్మందరినీ చాలా బాధిస్తున్నాడు. ఇదివరలో, నువ్వు ప్రీతుడవై వాడికి కోరిన వరం ఇచ్చావు. ఆవరం మాకు మాననీయం కనక, మేము వాడేమి చేసినా క్షమిస్తున్నాము. దుర్మతి అయి వాడు లోకాలనూ, స్త్రీలనూ చాలా భయపెడుతున్నాడు. మహోన్నతులైన లోకపాలకులను ద్వేషిస్తున్నాడు. త్రిదశరాజయిన ఇంద్రుణ్ణి పడగొడదా మని చూస్తున్నాడు. నువ్విచ్చిన వరంవల్ల మదించి, ఋషులనూ, యక్షులనూ, గంధర్వులనూ, అసురులనూ, బ్రాహ్మణులనూ అవమానిస్తున్నాడు. వాడి బలపరాక్రమాలకు జడిసి సూర్యుడు ఎండకాయలేకుండా వున్నాడు. వాయువు కదల్లేకుండా వున్నాడు. ఎల్లప్పుడూ కెరటాలువేసే సముద్రుడు స్తంభించి పోతున్నాడు. వాణ్ణి చూస్తేనే మాకు భయభ్రాంతులు కలుగుతున్నాయి; కాబట్టి వాణ్ణి సంహరించే ఉపాయం చూడవలసిం" దని ప్రార్థించారు.

వారందరూ ఇలా ప్రార్థించగా, బ్రహ్మదేవుడు ఆలోచించి, వారిని చూసి " ఇక విచారించకండి. వాణ్ణి సంహరించడాని కిదే ఉపాయం తోచింది. వాడు 'దేవదానవగంధర్వయక్షరాక్షసులవల్ల తనకి మరణం సంభవించగూడ' దని వరం అడిగాడు. నేను సరే అన్నాను. వాడు అప్పుడు మానవులవల్ల చావు రాగూడ దని కోరడం తన కవమానకరం అని వూహించి అదిమాత్రం కోరలేదు. కనక, వాడు మనుష్యుల చేతిలో మరణిస్తాడు. మరొకవిధంగా వాడు చావడు" అని చెప్పాడు.

ఇది విని వారంతా చాలా ఆనందించారు. ఈసమయాన పీతాంబరధారీ, శంఖచక్రగదాపాణీ, అయి జగత్పతి అయిన మహావిష్ణువు విజయంచేశాడు. అతను వచ్చి బ్రహ్మచెంత నుండగా, దేవత లందరూ అనేకవిధాల స్తోత్రం చేసి "ప్రభూ! లోకకల్యాణం కోసం వొక పని

చెయ్యవలసిం దని నిన్ను కోరుతున్నాము. అయోధ్యానగరాధిపతి అయిన దశరథ మహారాజు పరమధర్మజ్ఞుడు. మహాదాత. మహర్షులతో సమానుడు. అతనికి ముగ్గురు భార్యలున్నారు. వారు దక్షకన్య లైన హ్రీ శ్రీ కీర్తులతో సమానలు. మహాపురుషులకు తల్లిదండ్రులు కావడానికి సర్వవిధాలా ఆదంపతులు అర్హులు. కావున, దేవదేవా! నువ్వు వారికి నలుగురు పుత్రులవై మనుష్యజన్మ యెత్తి లోకకంటకు డైన రావణుణ్ణి సంహరించు. మూర్ఖుడై వాడు దేవతలను, గంధర్వులను, సిద్ధులనూ, మహర్షులనూ మ త్తిల్లి మిక్కిలీ బాధిస్తున్నాడు. నందన వనంలో క్రీడిస్తూ వుండే అప్సరసలను గంధర్వస్త్రీలనూ వాడు మరీ పీడిస్తున్నాడు. మేము అందరమూ వాని సంహారం కోరి నీకోసం యెదురుచూస్తున్నాము. మా కందరికీ నువ్వు తప్ప వేరే గతి లేదు. దేవతలకు పరమవిరోధి అయిన వాణ్ణి సంహరించడానికి నువ్వు మనుష్య జన్మ యెత్తక తప్పదు" అని మరీమరీ కోరారు.

ఇది విని, త్రిదశపుంగవు డైన మహావిష్ణువు బ్రహ్మతో కూడా వారి నందరినీ చూసి "మీకోరిక ధర్మబంధురంగా వుంది. ఇక మీరు విచారించకండి. భయపడకండి. దేవర్షులకు భయంకరుడూ, దురాత్ముడూ అయిన ఆరావణుణ్ణి పుత్రపౌత్రామాత్యమిత్రజ్ఞాతిబాంధవులతో కూడా సంహరించి, పదకొండు వేల సంవత్సరాలు మనుష్య జన్మలో వుండి యీభూమి పాలిస్తాను" అని అభయం ఇచ్చాడు.

వారి కిలా చెప్పి మహావిష్ణువు తాను దశరథ మహారాజునకు నలుగురు కుమార్లయి పుట్ట నిశ్చయించుకున్నాడు.

అప్పుడు వా రందరూ మళ్ళీ అనేకవిధాల పొగడి "ప్రభూ! ఉద్ధతుడూ, ఉగ్రతేజస్కుడూ, ప్రవృద్ధదర్పుడూ, దేవతాశత్రువూ

అయిన రావణుణ్ణి సంహరించి జగత్తు నుద్ధరించు. సబలంగానూ సబాంధవంగానూ వాణ్ణి సంహరించి, తరవాత, సురేంద్రగుప్త మైన వైకుంఠానికి దయచెయ్యి" అని కోరారు.

## ౧౨
## యజ్ఞపాయసం

దానిమీాద, విష్ణువు, తా నెరిగి వుండిన్నీ "సరే, మీా కోరిక తప్పక నెరవేరుస్తాను. మరి దాని కుపాయం చెప్పండి" అన్నాడు. అందుకు దేవతలు రావణుడు సంపాదించిన వరం సంగతి చెప్పి "నువ్వు ఇందు కోసం మానవజన్మ మెత్తవలసివుంది" అన్నారు. ఇది విని "సరే, మానవజన్మ మెత్తుతాను" అని బదులు చెప్పి విష్ణువు దశరథమహారాజును తండ్రిగా ఎంచుకున్నాడు.

సరిగా ఈసమయంలోనే పుత్రులను కోరి దశరథమహారాజు పుత్రకామేష్టి జరిగించాడు. అది గమనించి బ్రహ్మాదులకు సెలవిచ్చి విష్ణువు అంతర్ధాన మైనాడు.

ఇక్కడ అయోధ్యానగరంలో, దశరథుడు చేస్తున్న పుత్రకామేష్టి హోమకుండంలోనుంచి వొక మహాపురుషుడు పుట్టుకు వచ్చాడు. అతను చాలా బలవంతుడు. అతని మొగం యెర్రగా వుంది. కంఠధ్వని దుందుభిధ్వని లా వుంది. అతని మీాసాలూ గడ్డమూ సింహం జూలు లాగ సొంపుగా వుంది. అతను ఎరుపూ నలుపూ కలిసిన రంగుబట్టలు కట్టుకుని లెక్కలేనన్ని దివ్యాభరణాలు ధరించి శుభలక్షణసంపన్నుడై వున్నాడు. పర్వతశిఖరం లాగ ఎత్తుగా కూడా వున్నాడు.

అతను పట్టపగలింటి సూర్యుడు లాగ ప్రకాశిస్తూ, వెండిమూాత వేసిన బంగరు గిన్నెతో పాయసం పట్టుకువచ్చి "దశరథమహారాజా!

ప్రజాపతి పంపున నేను వచ్చివున్నా" నని చెప్పాడు. అందు కా రాజు "మహానుభావా! నీ కిదే స్వాగతం. నేను చెయ్యవలసి దేమో ఆజ్ఞాపించు" అని బదులు చెప్పాడు. దానిమీద ఆ మహాపురుషుడు "రాజా! అశ్వమేధమూ, పుత్రకామేష్టీ చేసి నువ్వు దేవతల నర్చించి నందుకు ఈ పాయసం నీకు లభించింది. ఇది దేవతలు సిద్ధపరిచినది. దీనివల్ల నీకు ఆరోగ్యం వృద్ధి అవుతుంది. సంతానమున్నూ కలుగుతుంది. నీకు అనుగుణంగా ప్రవర్తిస్తున్న నీముగ్గురు భార్యలకూ ఈపాయసం పంచిపెట్టు. ఇలా చేస్తివా, ఈ పుత్రకామేష్టికి ఫలితంగా నీకు కొడుకులు కలుగుతా" రని చెప్పాడు.

ఆమాటలు విని దశరథుడు మిక్కిలీ ప్రీతిపొంది, దేవపాయసం నిండివుండిన ఆ బంగరుపాత్ర శిరసా గ్రహించి, ప్రియదర్శను డైన ఆ మహాపురుషునికి ప్రదక్షిణ నమస్కారాలు సమర్పించి నవనిధులున్నూ పొందిన దరిద్రు డెంతసంతోషిస్తాడో అంతగా సంతోషించాడు.

ఆమహాపురుషుడు అప్పు డంతర్ధాన మైనాడు.

ఇదంతా విని అంతఃపురనివాసు లందరూ చాలా ఆనందించారు. ఆకాశం శరచ్చంద్రుని కిరణాలతో ప్రకాశించేటట్టు ఆపరమానందంతో అంతఃపురం అంతా దేదీప్యమానం అయింది. ఆ సమయంలో దశరథుడక్కడికి వెళ్ళి "పుత్రసంతానభాగ్యం కలిగించే ఈపాయసం భక్షించండి" అని చెప్పి అందులో సగం కౌసల్యకూ, ఆసగంలో సగం సుమిత్రకూ, మిగిలిన దాన్లో సగం కైకకూ, మిగిలివుండిన ఆమెని మిదోభాగం మళ్ళీ సుమిత్రకూ ఇచ్చాడు.

ఆ పాయసం భక్షించి, ఆ పట్టపురాణులు ముగ్గురూ తమకు చాలా సమ్మానం జరిగినట్టు సంతోషించారు. దానివల్ల అగ్నితోనూ,

సూర్యునితోనూ సమాన మైన తేజస్సు గల గర్భములు కూడా ధరించారు.

ఆసంగతి విని రాజుచాలా ఆనందించాడు.

## ౧3

## వా న రు ల పు ట్టు క

శ్రీమహావిష్ణువు ఇలాగ దశరథమహారాజు భార్యల గర్భవాసాలు ప్రవేశించగానే బ్రహ్మదేవుడు దేవతల నందరినీ చూసి "సత్యసంధుడూ, మహావీరుడూ, మనపాలిటి హితైషీ అయిన శ్రీమహావిష్ణువు క్రొత్త అవతారానికి సాయంగా వుండడానికి మహాబలవంతులూ, కామ రూపులూ అయిన యోధులను కనండి. ఆ యోధులందరూ ఎలాంటి మాయలైనా తెలిసికోగలవారూ, శూరులూ, వాయువేగులూ, నీతిశాస్త్రం బాగా తెలిసినవారూ, బుద్ధిమంతులూ, శ్రీమహా విష్ణువుతో పోల్చతగిన పరాక్రమవంతులూ, సర్వాస్త్రశస్త్రసమర్థులూ, మీలాగే ఆకలిదప్పులు లేనివారూ అయి వుండాలి. మరిన్నీ, వారు ఎవరికీ లొంగనివారూ, ఎవరివల్లా ఓడిపోనివారూ కూడా అయి వుండాలి. మరిన్నీ వారు వానరరూపులున్నూ అయి వుండాలి. మీకు తగిన అప్సరస్త్రీలూ, గంధర్వాంగనలూ ఎందరో వున్నారు. వారి యందు, మీ పేరు ప్రతిష్ఠలకు తగిన కుమాళ్ళను కనండి. నే నిదివరకే ఎలుగుగొడ్డు జాతిలో జాంబవంతుణ్ణి సృజించివున్నాను. అతగాడు నే నావులిస్తూ వుండగా నా ముఖంలోనుంచి పుట్టుకు వచ్చాడు" అని చెప్పాడు.

వెంటనే ఈశాసనం శిరసావహించి మహర్షులూ, సిద్ధులూ, విద్యా ధరులూ, నాగులూ, చారణులూ అనేకలక్షల కుమాళ్ళను కన్నారు.

దేవేంద్రుడు తనతో సమానుడూ మహాతేజశ్శాలీ అయిన వాలిని కన్నాడు. ప్రతాపవంతులలో అగ్రేసరు డైన సూర్యుడు సుగ్రీవుణ్ణి కన్నాడు. బృహస్పతి తారుణ్ణి కన్నాడు. తారుడు తండ్రి లాగే కుశాగ్రబుద్ధి. వానరులలో అంతటి బుద్ధిమంతుడు మరొకడు లేడు. కుబేరుడు గంధమాదనుణ్ణి కన్నాడు. విశ్వకర్మ నలుణ్ణి కన్నాడు. అగ్ని దేవుడు నీలుణ్ణి కన్నాడు. తేజస్సులోనూ, యశస్సులోనూ, బల పరాక్రమాలలోనూ అతన్ని మించినవాడు వానరులలో మరొకడు లేడు. సుందరులూ, ధనికులూ అయిన అశ్వినీ దేవతలు అందగాళ్ళయిన మైందుణ్ణీ ద్వివిదుణ్ణీ కన్నారు. వరుణుడు సుషేణుణ్ణి కన్నాడు. పర్జన్యుడు మహాబలసంపన్ను డైన శరభుణ్ణి కన్నాడు. వాయు దేవుడు ఆంజనేయుణ్ణి కన్నాడు. అతగాడు వేగంలో గరుత్మంతునితో సమానుడు. అతని శరీరం వజ్రం లాగ అభేద్యం.

వీరే కాక, ఇంకా అనేకలక్షలమంది అసామాన్యబలపరాక్రమ వంతులై న అనేకమంధి వానరులను కన్నారు. ఏ దేవుడు ఏరూపం గల వాడో, యేవేషం గలవాడో ఎంతటి పరాక్రమం కలవాడో అతని కొడుకున్నూ అలాంటి రూపమూ, అలాంటివేషమూ, అంతటి పరా క్రమమూ కలవా డైనాడు. ఆ భల్లూకవీరులూ, వానరవీరులూ మేరుమందరపర్వతాలతో సమానులూ, మహాబలశాలులూ అయి అతివేగంగా వృద్ధిపొందారు.

ఆ భల్లూక వానరవీరు లందరూ మహాపరాక్రమవంతు లై నారు. వారందరూ పెద్దపెద్దరాళ్లు విసిరి శత్రుసంహారం చెయ్యగలరు. చెట్లూ, చేమలూ గూడా ఆయుధాలుగా వాడగలరు. గోళ్లతో గీరగలరు. పళ్లతో కొరకగలరు. అస్త్రశస్త్రాలు అన్నివిధా లై నవీ వాడగలరు. వారందరూ గొప్ప పర్వతాలు పెకల్చి విసరగలరు. చెట్లు పెరకగలరు,

సరిత్పతి అయిన సముద్రుణ్ణి కూడా కలిచివెయ్యగలరు. కాళ్లతో భూమిని బద్దలుకొట్టగలరు. సముద్రాలు దాటగలరు. ఆకాశంలో యెగరగలరు. మేఘాలు పట్టుకోగలరు. అరణ్యాలలో మదించి సంచరించే యేనుగులను పట్టుకోగలరు. ఉరుములా అన్నట్టుగా అరిచి ఆకాశాన సంచరించే పక్షులను పడగొట్టగలరు.

ఇలాంటి వానరయోధులు నూరులక్షలు పుట్టారు. వారిలో సేనాధిపతులైనవారు కూడా గొప్ప యోధులైన వానరులను కన్నారు. వారిలో కొందరు ఋక్షవత్పర్వతంమీద నివసించారు. తక్కినవారు తక్కిన పర్వతాలమీద వసించారు. వారిలో చాలా మంది సూర్యపుత్రుడైన సుగ్రీవుణ్ణీ, ఇంద్రకుమారుడైన వాలినీ ఆశ్రయించుకుని వుండినారు. మహాబలవంతులైన నలుణ్ణీ, నీలుణ్ణీ హనుమంతుణ్ణీ కూడా మరికొందరు ఆశ్రయించుకుని వుండినారు.

వారందరూ పర్వతాలమీదా, అరణ్యాలలోనూ సంచరిస్తూ సింహాలనూ, పులులనూ, భయంకరాలైన పెద్దపెద్ద సర్పాలనూ సంహరిస్తూ తిరుగుతూ వుండినారు. అందరికంటే గొప్పవాడై వాలి ఆ యెలుగుగొడ్డులనూ, ఆ కోతులనూ స్వేచ్ఛగా పరిపాలిస్తూ వుండినాడు.

శ్రీరామసహాయం కోసం అవతరించిన ఆ వానరయూధం భూమండలం అంతా ఆవరించి వుండింది.

## ౧౪
## శ్రీ రా మ జ న నం

ఈవిధంగా, మహాత్ముడైన దశరథమహారాజు తలపెట్టిన అశ్వమేధమూ పుత్రకామేష్టీ పూర్తి కాగా, దేవతలు హవిర్భాగాలు స్వీకరించి వెళ్లిపోయారు. దీక్షానియమాలు నెరవేర్చుకుని భార్యలతోనూ,

భృత్యులతోనూ, చతురంగబలాలతోనూ వాహనాలతోనూ దశరథుడు అయోధ్యకు ప్రయాణ మైనాడు. రాజు లందరూ దశరథుడు చేసిన సత్కారాలకు చాలా ఆనందించి, మునిపుంగవుడైన వసిష్ఠుని సెలవుపొంది, తమతమ రాజ్యాలకు వెళ్ళిపోయారు. వారందరూ వెళ్ళిపోయిన తరవాత దశరథుడు బ్రాహ్మణులను ముందు ఉంచుకుని అయోధ్య ప్రవేశించాడు. ఋశ్యశృంగుడున్నూ గొప్పగొప్ప సత్కారాలు పొంది, ఆనందించి, శాంతను వెంటబెట్టుకుని, రోమపాదునితో కూడా వెళ్ళిపోయాడు.

ఇలాగ, వారందరూ ఎవరి దారిన వారు వెళ్ళిపోయాక, దశరథుడు సంపూర్ణమనోరథుడై పుత్రోత్పత్తి నిరీక్షించుకుంటూ వున్నాడు. ఉండగా వుండగా పన్నెండోది అయిన చైత్రమాసంలో, నవమినాడు, పునర్వసునక్షత్రకర్కటలగ్నంలో, కౌసల్యాదేవి రాముణ్ణి కన్నది. ఆసమయంలో అయిదు గ్రహాలు స్వోచ్చస్థానాలలో వున్నాయి. గురూదయసమయం అది. జగన్నాథుడూ, సర్వలోకపూజ్యుడూ, సర్వలక్షణసంపన్నుడూ అయిన విష్ణుమూర్తి అర్థాంశమే అలాగ ఇక్ష్వాకువంశవృద్ధికోసం పుట్టాడు. దేవేంద్రుణ్ణి కని అదితి యెలా ప్రకాశించిందో అమితతేజస్సు గల రాముణ్ణి కని కౌసల్య అలాగ విరాజిల్లింది.

కైకకు భరతుడు పుట్టాడు. అతను సాక్షాత్తూ విష్ణుమూర్తిలో ఎనిమిదో భాగం. తరవాత సౌమిత్రికి లక్ష్మణుడూ శత్రుఘ్నుడూ పుట్టారు. వారు విష్ణుమూర్తిలో మూడు పరకలు. భరతుడు పుష్య నక్షత్ర యుక్త మీనలగ్నంలో పుట్టాడు. సూర్యోదయం అయిన తరవాత ఆశ్లేషా నక్షత్ర కర్కాటకలగ్నంలో లక్ష్మణ శత్రుఘ్నులు పుట్టారు. వారు నలుగురూ ప్రోష్ఠపదసమానులూ దశరథునికి తగిన

వారూ అయి తేజరిల్లారు. వారు పుట్టినప్పుడు గంధర్వులు పాడారు. అప్సరసలు నృత్యం చేశారు. దేవదుందుభులు మోగాయి. పుష్ప వర్షం కురిసింది.

అప్పుడు అయోధ్యానగరంలో గొప్ప ఉత్సవం విరాజిల్లింది. వీధు లన్నీ గాయకులతోటి, వాద్య శిల్పులతోటీ, సూత మాగధ వంది బృందాలతోటీ నిండిపోయి ముఖరితా లయినాయి. దశరథుడు సూత మాగధ వందిబృంధాలకు బహుమతు లిచ్చాడు. బ్రాహ్మణులకున్నూ అపారంగా ధనమూ, లెక్కలేనన్ని ఆవులూ యిచ్చాడు. పన్నెండో దినాన అతను కొడుకులకు నామకరణమహోత్సవం చేశాడు. వసిష్ఠుడు కౌసల్య కొడుక్కి రాము డనీ, కైక కొడుక్కి భరతు డనీ, సుమిత్ర పెద్ద కొడుక్కి లక్ష్మణు డనీ, చిన్న కొడుక్కి శత్రుఘ్ను డనీ పేళ్లు పెట్టాడు. దశరథుడు కొడుకులకు జాతకర్మ మొదలైనవిన్నీ జరిగించి, ఆవేళ కూడా బ్రాహ్మణులకూ పౌరులకూ పల్లెటూళ్లవారికీ భూరిసంతర్పణలు చేయించి, విశేషించి, బ్రాహ్మణులకు అనేకరత్నరాసులు ఇచ్చాడు.

వారిలో జ్యేష్ఠు డైన రాముడు తండ్రికి మిక్కిలి సంతోషం కలి గిస్తూ జనుల కందరికీ ప్రీతిపాత్రు డైనాడు. మొత్తం మీద అన్న దమ్ములు నలుగురూ వేదవేత్త లైనారు. శూరు లైనారు. అందరికీ, ఆదరభాజనా లయినారు. సకలసుగుణాభిరాము లైనారు. జ్ఞానవంతు లున్నూ అయినారు. వారందరిలోనూ రాముడు సత్యపరాక్రముడూ అందరికీ మిక్కిలీ ఇష్టుడూ, చంద్రుడు లాగ దర్శనీయుడూ అయినాడు. గజారోహణంలోనూ, అశ్వారోహణంలోనూ, యుద్ధాలలో రథాలు నడిపే పద్ధతులలోనూ ఇంతటివాడు పుట్టబోడని పేరు సంపాదించాడు. అన్నివిద్యలలోనూ ధనుర్విద్య అంటే అతనికి చాలా యిష్టం. తల్లి దండ్రులను పూజించడంలోకూడా అతనికి శ్రద్ధాసక్తు లెక్కువ.

చిన్నప్పట్నుంచీ లక్ష్మణునకు రాముని యెడల చాలా స్నేహం కలిగింది. లక్ష్మీవర్ధను డైన లక్ష్మణుడు అందరికీ ప్రియకరుడే ; కాని రామునికి మిక్కిలీ ప్రియుడు. దీనికితగ్గట్టు అతను రామునికి బహిః ప్రాణమే. లక్ష్మణుడు, దగ్గిర లేకపోతే రాముడు అన్నం ముట్టడు. నిద్రపోడు. రాముడు గుర్రంయెక్కి వేటకి బయలుదేరితే, వెనక, లక్ష్మణు డుండవలసిందే.

ఇటు వీరిలా వుండగా, అటు లక్ష్మణుని తమ్ముడైన శత్రుఘ్నుడు భరతుణ్ణి పట్టిగడియలూ అనుసరించి వుంటాడు. తన ప్రాణాలకంటేనూ భరతుణ్ణి అత నెక్కువగా చూసుకుంటాడు. శత్రుఘ్ను డంటే భరతుడూ అక్షరాలా అలాగే వుంటాడు.

నలుగురు దిక్పాలకుల వల్లా, బ్రహ్మ యెంతగా పరమప్రీతు డవుతూ వుంటాడో అలాగే ఈ నలుగురు కొడుకులవల్లా దశరథుడున్నూ పరమ ప్రీతు డవుతూ వుంటాడు. వారు శిశువులుగా వున్నప్పుడే యింత సంతోషించిన దశరథుడు, వారు జ్ఞానవంతులై సుగుణవంతులై హ్రీమంతులై కీర్తిమంతులై దీర్ఘదర్శులై సాటి లేకుండా ప్రకాశించడం చూసి మరీ సంతోషించాడు. వారు కూడా తల్లిదండ్రులు గారాబంగా చూసినకొద్దీ మరీ శ్రద్ధాసక్తులతో వేదశాస్త్రాలు చదువుకుని, ధనర్వేదరహస్యాలు తెలుసుకుని, తల్లిదండ్రులను పూజించ సాగారు.

అన్నదమ్ములు నలుగురూ ఇలాగ దినదినమూ వృద్ధిపొందుతూ వుండడం చూసి దశరథుడు వారికి వివాహాలు చెయ్యదలచి తగిన కన్యలను వెదకసాగాడు. ఈవిషయం అతను బంధువులతోనూ ఉపాధ్యాయులతోనూ గూడా ఆలోచనలు ప్రారంభించాడు.

ఒకనాడు దశరథుడు మహాసభలో కూచుని ఈవిషయం మంత్రులతో కూడా ఆలోచిస్తూ వుండగా, గాధికుమారు డైన విశ్వామిత్రుడు

చక్కా వచ్చాడు. ద్వారపాలకులు అతనిరాక విన్నవించగా సభ్యు లందరితోటీ దిగ్గునలేచి రాజు అతనికెదురు వెళ్ళి సభలోకి తీసుకువచ్చి ఉన్నతాసనం యిచ్చి అర్ఘ్యపాద్యాలున్నూ ఇచ్చి పూజించాడు. విశ్వామిత్రుడున్నూ అందుకు చాలా సంతోషించి "రాజా.! నీకుటుంబం అంతా కుశలమేకదా ? నగరంలోనూ దేశంలోనూ రాజ్యం లోనూ అందరూ కూడా కుశలమే కదా ? ధనధాన్యసమృద్ధమై బొక్కసం అవ్యయంగా వుందికదా ? నీసామంతు లందరూ నీకు లొంగివున్నారా ? నీశత్రువు లందరూ పరాజితు లయి పోయార్రా ? యజ్ఞయాగాదివైదిక కర్మలూ, అతిథిపూజా నిర్విఘ్నంగా జరుగు తున్నాయా ?" అని రాజు నడిగి వసిష్ఠుణ్ణికూడా కుశలప్రశ్న చేసి, తక్కిన మునులనున్నూ క్షేమాదికం అడిగి ఆదరించాడు.

అంతా యథార్హంగా కూచున్నారు. అప్పుడు దశరథుడు విశ్వా మిత్రుణ్ణి చూసి "మహర్షీ ! నీరాకవల్ల మాకు అమృతం లభించిన ట్టుంది. ఎండలు మండి పోతున్నప్పుడు జడివాన కురిసినట్టూ, లేకలేక సంతానం కలిగినట్టూ, పోయిన సంపత్తు మళ్ళీ లభ్యం అయినట్టూ, వివాహాదులలో సంతోషం కలిగినట్టూ కూడా వుంది. నీకు స్వాగతం. నీకోరిక యేమో సెలవిస్తే నేను చాలా సంతోషిస్తూ తీరుస్తాను. బ్రహ్మతో సమానుడవైన నువ్వు మా అదృష్టంవల్ల లభించావు. నాజన్మయిప్పుడు సఫలం అయింది. నాబతుకున్నూ సార్థకం అయింది. మొదట రాజర్షివై వుండి, తరవాత గొప్పతపస్సు చేసి బ్రహ్మర్షి వయిన నువ్వు మిక్కిలీ పూజ్యుడవు. నీరాక పరమపవిత్రం. నీదర్శనం వల్ల నేను నాయింటనే దివ్యక్షేత్రగతు ణ్ణయినాను. కనక, నీరాకకు కారణం యేమిటో, నువ్వేమి కోరి దయచేశావో అది చెబితే నేను వెంటనే చేస్తాను. నీకోరిక తీర్చడానికి నాకు గల సర్వస్వమూ వినియో గిస్తాను. నువ్వే నాపాలిటి దేవాదిదేవుడవు. నీరాకవల్ల నాకు గొప్ప

అభ్యుదయం కలిగింది. నాధర్మమున్నూ శాస్త్రసమ్మతం అయింది" అని విన్నవించుకున్నాడు. ఇది విని విశ్వామిత్రుడు చాలా చాలా ఆనందించాడు.

## ౧౫
## వి శ్వా మి త్రు ని రా క

చాలా అద్భుతంగా వున్న రాజసింహుని ఆమాట విని మహాతేజశ్శాలి అయిన విశ్వామిత్రుడు శరీరం అంతా పులకలు పెట్టెత్తగా "దశరథ మహారాజా! నీవంశం చాలా గొప్పది. పైగా వసిష్ఠుడు నీకు గురువు. కనక, ఇలాంటి మాట నీకే తగును. మరొక డెవడూ ఇలాంటి మాట యివ్వలేడు. నాహృద్గత మైన కార్యం చెబుతా, నది చేసి సత్యవాక్య పరిపాలకుడవై మసులుకో. నేనొక సిద్ధికోసం యజ్ఞదీక్ష పట్టివున్నాను. దానికి కామరూపు లైన యిద్దరు రాక్షసులు విఘ్నం కలిగిస్తున్నారు. వాళ్ళలో వొకడు మారీచుడు; రెండోవాడు సుబాహుడు. నావ్రతం యిక పూర్తి అవుతుం దనగా వచ్చి వాళ్లు, రక్తమాంసాలతో నాయజ్ఞవేది ముంచెత్తారు. అలాగ నావ్రతం భంగపడ్డంవల్ల నిరుత్సాహం పొంది యిలా వచ్చాను. అంత ద్రోహం చేసినా వాళ్ళని శపించడానికి నాకు బుద్ధి పుట్టడం లేదు. ఎందుచేత నంటే? ఆవ్రతం చేస్తున్నంతసేపూ కోపం వహించగూడదు. శపించనూ కూడదు. కనక, రాజశార్దూలా! నీపెద్దకొడు కైన రాముణ్ణి ఒక్కమాటు నాకియ్యి. నిజాని కతను బాలుడు. ఇంకా కాకపక్షాలతోనే వున్నాడు. అయినా, అతను మహాశూరుడు. సత్యపరాక్రముడు. వెనకవుండి నేను నడిపిస్తే అతను ఈపని చెయ్యగలడు. విఘ్నకారు లైన రాక్షసుల నిద్దరినీ అతను అనాయాసంగా చంపగలడు. ఆపని చేశాక, త్రిలోకాల లోనూ గొప్ప ప్రతిష్ఠ పొందేటట్లు నే నాతనికి బహువిధాల శ్రేయస్సు

కలిగిస్తాను. రాముణ్ణి ఎదిరించి వాళ్ళెంతమాత్రమూ నిలవలేరు. రాముడు తప్ప వాళ్ళని సంహరించగలవాడు కూడా మరొకడు లేడు. ఎంత పరాక్రమవంతులైనా వాళ్ళకి చావు మూడింది. రామునికి వాళ్ళెంతమాత్రమూ చాలరు. ఈ సందర్భంలో కొడుకు గదా అని నువ్వు రాముణ్ణి గారాబంగా చూడకు. నేను ప్రతిజ్ఞ చేస్తున్నాను. ఆరాక్షసులు ఇక చచ్చారని నమ్ము. సత్యపరాక్రముడైన రాముని సంగతి నాకు బాగా తెలుసు. మహాతేజశ్శాలి అయిన ఈ వసిష్ఠుడూ, తక్కిన యీమహర్షులున్నూ బాగా యెరుగుదురు. కనక, ఉత్కృష్ట మైన ధర్మలాభమూ, స్థిరమైన గొప్ప కీర్తీ నీకు కావలసివుంటే రాముణ్ణి నాకియ్యి. నీమంత్రులూ, వసిష్ఠాదిమహర్షులూ ఇందు కంగీక రిస్తేనే రాముణ్ణి నాతో పంపు. నీకున్నూ అంగీకారం అయితేనే, యజ్ఞదీక్ష పదిరాత్రులూ రాజీవలోచనుడైన రాముణ్ణి నాదగ్గిర వుండ డానికి పంపు. ఇంతకీ: నాయజ్ఞకాలం దాటిపోకుండా నువ్వీ పని చెయ్యి. విచారించకు" అని చెప్పాడు.

మహాతేజశ్శాలి అయిన విశ్వామిత్రుడు ఇలాగ ధర్మార్థసహితంగానే అన్నా, రాజు శోకించకుండా వుండలేకపోయాడు. భయభ్రాంతుడై సింహాసనంమీదనుంచి పడిపోయేటట్టు గడగడ వొణికిపోయాడు.

## ౧౬

## రాముణ్ణి పంపనన్నాడు దశరథుడు

మునిశార్దూలుడైన విశ్వామిత్రుని మాట విని రాజశార్దూలుడైన దశరథుడు ఒక్క క్షణకాలం రిచ్చపడివుండి, మళ్లీ అంతలో తెలివి తెచ్చుకుని మెల్లిగా ఇలా అన్నాడు,—

"మహాత్మా! నారాముడు పదిహేను సంవత్సరాలవాడు. రాక్షసులతో పోరడానికి శక్తి చాలనివాడు. ఇదే నాచేతిలో ఒక అక్షౌహిణి సేనవుంది. దానికి ప్రభువునై నేనున్నాను. ఆసేనతో వచ్చి ఆరాక్షసులతో నేను యుద్ధంచేస్తాను. నాభృత్యులు అస్త్రవిశారదులూ శూరులూను. వాళ్లు రాక్షసులతో యుద్ధం చెయ్యగలరు. కనక, రాముణ్ణి తీసుకువెళ్లవద్దు. ధనుష్పాణినై, యుద్ధరంగంలో నిలిచి, ఈబొందిలో ప్రాణా లున్నంతసేపూ నేనే రాక్షసులతో యుద్ధం చేస్తాను. నేనే నీతో వస్తాను. నీవ్రతమున్నూ నిర్విఘ్నంగా నెరవేరుస్తాను; కనక, రాముణ్ణి తీసుకువెళ్లవద్దు. రాముడుబాలుడు. ఏవిద్యా రానివాడు. బలాబలా లెరగడు. అస్త్రబలం కలవాడున్నూ కాడు. యుద్ధవిశారదుడు కానే కాడు. దొంగపోటు యుద్ధంలో ఆరితేరిన రాక్షసులకు ఈడైనవాడుకా . ఇంతేకాక: రాముణ్ణి విడిచి నేను క్షణ మయినా బతికివుండలేను. కనక, రాముణ్ణి తీసుకువెళ్లవద్దు. కాదూ కూడదు, రాముణ్ణే తీసుకువెడతా నంటావా, అయితే, చతురంగబలంతో నన్ను కూడా తీసికువెళ్లు. అరవై వేల సంవత్సరాలు గడిచాక, లేకలేక, వ్రతాలూ ఉపవాసాలూ యజ్ఞాలూ చేసిచేసి నేను రాముణ్ణి కన్నాను. నా కొడుకులు నలుగురిలోనూ రామునిమీదే నాకు ప్రీతి యెక్కువ. పైగా, అతను నాకు జ్యేష్ఠకుమారుడు. కనక, రాముణ్ణి తీసుకువెళ్లవద్దు. ఇదిలా వుండగా: ఆ రాక్షసు లెవరి కొడుకులు? ఏమాత్రం బలవంతులు? రాముడైనా, చతురంగబలాలతో కదిలివచ్చి నేనైనా కూటయుద్ధంలో నిపుణులైన ఆ రాక్షసులకు చెయ్యవలసిన ప్రతీకారం యేమిటి? ఏవ్యూహం పన్ని వాళ్లని ఢీకొనవలసివుంటుంది? ఇదంతా నాకు వివరంగా చెప్పు."

అందుకు, విశ్వామిత్రుడు "పులస్త్యమహాముని వంశంలో పుట్టిన రావణు డనే రాక్షసు డున్నాడు. వాడు బ్రహ్మవల్ల వరం పొంది

త్రిలోకాలనూ పీడిస్తున్నాడు. వాడు రాక్షసాధిపతి. మహాబలుడూ మహావీర్యుడూను. సాక్షాత్తుగా వాడు కుబేరునకు సోదరుడు. విశ్రవసు కొడుకు. రాక్షసుల కందరికీని చక్రవర్తి. నువ్వూ ఇది వినే వున్నావు. యజ్ఞాలు పాడుచెయ్యడానికి వీలు లేనప్పుడు ఆరావణుడు ఆపని చెయ్యడానికి మారీచుడు సుబాహుడు అనే యిద్దరు రాక్షసులను పంపుతూ వుంటాడు” అని చెప్పాడు.

దీనిమీద దశరథుడు “మహానుభావా! ఆ రావణుణ్ణి యెదిరించగల శక్తి నాకు లేదు. కనక, నాకొడుకుమీద అనుగ్రహం వుంచు. దురదృష్టవంతు ణ్ణయిన నాకు నువ్వే దైవతం. దేవతలూ, దానవులూ గంధర్వులూ, యక్షులూ, నాగులూ కూడా రావణుణ్ణి యెదిరించి నిలవలేరు. ఎంతటి బలవంతుణ్ణయినా రావణుడు యుద్ధంలో సులభంగా వోడించగలడు. విడిగా నేనొక్కణ్ణయినా, చతురంగబలాలలో కూడి అయినా వాడితో యుద్ధం చెయ్యలేను. ఇలాంటి స్థితిలో యుద్ధతంత్రం యెరగని బాలుడైన రాముణ్ణి నీతో నేను పంపలేను. నీయజ్ఞం పాడు చేసేవాళ్లు సుందోపసుందుల కొడుకులూ, యమునితో సమానులున్నూ కనక నాకొడుకును నేను నీతో పంపలేను. మారీచుడూ సుబాహుడూ వీర్యవంతులూ శిక్షపొందిన యోధులున్నూ. వాళ్లతో నేను మాత్రం యెలాగ యుద్ధం చెయ్యగలనూ?” అన్నాడు. దానిమీద, యజ్ఞంలో, నెయ్యిపోస్తే అగ్ని విజృంభించే ట్టు, ఈమాట వినగానే విశ్వామిత్రుడు ఆగ్రహమహోగ్రుడైనాడు.

## ౧౭
## దశరథుడు రాముణ్ణి పంపడం

అప్పుడు “రాజా, ముందు మాటయిచ్చి తరవాత తప్పుతున్నావు. రఘువంశీయుల కిది తగిన పనికాదు. నీకులానికే యిది ప్రతికూలం,

అయినా, నీకిదే తగినట్టు నువ్వు భావించుకునే యెడల, ఇదిగో నేను వెళ్లిపోతాను, మాట తప్పించుకుని నీ బంధువులతో నువ్వు సుఖంగా బతుకు" అని విశ్వామిత్రుడు గర్జించగా భూమి అంతా గజగజ లాడి పోయింది. దేవత లందరూ భయభ్రాంతు లైపోయారు. అదంతా గుర్తించి సువ్రతుడూ, ధీరుడూ అయిన వసిష్ఠుడు దశరథుణ్ణి పిలిచి "రాజా, సాక్షాత్తుగా ధర్మం అవతరించినట్టు నువ్వు ఇక్ష్వాకువంశంలో పుట్టావు. పైగా, నువ్వు ధైర్యశాలివి. సువ్రతుడవు. నువ్వు ధర్మం తప్పడం మంచిదికాదు. త్రిలోకాలయందూ నువ్వు ధర్మాత్ముడ వని పేరుపొందావు; కనక, స్వధర్మం అవలంబించు. అధర్మానికి పాల్పడకు. "ఇలా చేస్తా" నని ముందు మాట యిచ్చి, యిప్పుడు నువ్వు అలా చెయ్యకపోతే నువ్వుచేసిన అశ్వమేధాంతా లయిన యజ్ఞ యాగాలూ, అన్నదానమూ వ్యర్థం అయిపోతాయి. నువ్వు చేసిన వాపీకూపతటాకాది నిర్మాణాలూ సేతుబంధనాలూ ఆరామ ప్రతిష్ఠలూ కూడా నిష్ఫలం అయిపోతాయి. కనక, రాముణ్ణి పంపించు. రాముడు అస్త్రశస్త్రకుశలు డయినా సరే కాకపోయినా సరే సందేహించకు. అగ్నిమధ్యస్థ మయిన అమృతం యెవరూ అంటలేనట్టు విశ్వామిత్రుని రక్షణలో వున్న రాముణ్ణి రాక్షసు లేమీ చెయ్యలేరు. విశ్వామిత్రుని శక్తి నువ్వెరగవు. ఇతను రూపొందిన ధర్మం. పరాక్రమవంతులలో నాయకమణి. బుద్ధిమంతుల కందరికీ తల మానికం. తపోధనులలో ఎవడూ ఇతనితో సమాను లయినా కారు. సచరాచరాలయిన త్రిలోకాలయందున్నూ గల అన్నివిధాల అస్త్రాలూ తెలిసినవా డితను ఒక్కడే. ఇంతటి శస్త్రాస్త్రకోవిదుడు మరొకడు లేడు. ఇక ముందున్నూ ఉండబోడు. మానవులే కాదు, దేవతలూ, మహర్షులూ, అసురులూ, రాక్షసులూ, గంధర్వులూ, యక్షులూ, కిన్నరులూ, ఉరగులూ కూడా అస్త్రపరిజ్ఞానంలో యితనికి సాటిరారు.

కైనక, రాజయి ఇతను ప్రజాపరిపాలనం సాగిస్తున్నపుడు భృశాశ్వునిపుత్రరూపా లయిన సర్వాస్త్రాలూ ఈశ్వరు డితని కిచ్చాడు. ఆభృశాశ్వపుత్రులు దక్షుని కూతుళ్లకు పుట్టినవారు. వారు మహాదీప్తిమంతులు. జయశీలురు. జయ సుప్రభ అనే దక్షకన్య లిద్దరూ పరమభాస్వరా లయిన నూరు అస్త్రశస్త్రాలు కన్నారు రాక్షససైన్యాలను నాశనం చెయ్యడానికి అమేయులూ కామరూపులూ అయిన మరొక యాభైమంది కొడుకులను కూడా జయ కన్నది. సుప్రభ కూడా సంహారు లనే మరొక యాభైమంది కొడుకులను కన్నది. వారు మహాబలవంతులు. ఎవరికీ లొంగనివారు. ఆ యస్త్రశస్త్రా లన్నీ యీవిశ్వామిత్రుని అధీనం అయివున్నాయి. ఇతను అపూర్వాలయిన అస్త్రాలను కూడా సృష్టించగలడు. విశ్వామిత్రు డంటే యిలాంటి మహానుభావుడు కనక, రాముణ్ణి యితనితో పంపడానికి సందేహించకు. ఈ విశ్వామిత్రుడు ఆ రాక్షసులను స్వయంగానే సంహరించగలడు. అయినా, నీ కొడుకులకు మేలు చెయ్యదలచి వచ్చి నిన్ను యాచిస్తున్నాడు" అని ప్రోత్సాహపరిచాడు.

ఇది విని ప్రసన్నచిత్తుడై దశరథుడు చాలా సంతోషించాడు. రాముణ్ణి అతనితో పంపడానికిన్నీ అంగీకరించాడు.

## ౧౮

## బలా అతిబలా విద్యాస్వీకారం

వసిష్ఠు డిలా చెప్పగా, లక్ష్మణుణ్ణి వెంటబెట్టుకు రమ్మని దశరథుడు రామునికి వర్తమానం చేశాడు. వచ్చాటప్పుడు కౌసల్య రామునికి మంగళసూక్తాలతో స్వస్తి పలికింది. వచ్చాక దశరథుడున్నూ స్వస్తి పలికాడు. తరవాత వసిష్ఠుడు కూడా స్వస్తిపలికాడు. అప్పుడు దశ

రఘుడు శిరస్సు మూర్కొని పరమప్రీతితో రాముణ్ణి విశ్వామిత్రుని కిచ్చాడు. పద్మనేత్రుడైన రాముడు విశ్వామిత్రునివాడు కాగానే దుమ్మూ ధూళీ లేని వాయువు హాయిగా వీచింది. దేవతలు దుందుభులు వాయిస్తూ వుండగా గొప్ప పూలవాన కురిసింది. దశరథుని ఇంగితం గుర్తించి ఆస్థానమర్యాదగా భృత్యులు శంఖాలూ దుందుభులున్నూ వాయించారు.

ముందు విశ్వామిత్రుడు బయలుదేరాడు. ధనుర్ధరుడై రాముడు తరవాత అడుగువేశాడు. ధనుర్ధారి అయి లక్ష్మణుడు రాముణ్ణి అనుసరించాడు. రెండేసి అమ్ములపొదులూ ధనస్సులూ ధరించి మూడు తలల సర్పాల లాగ వారు విశ్వామిత్రునితో వెడుతూ వుంటే బ్రహ్మతో కూడా అశ్విని దేవతలు వెడుతున్నట్టుంది. అప్పుడు రామలక్ష్మణులు ఉడుముతోలుతో చేసిన అంగుళిత్రాణాలూ, గొప్పఖడ్గాలూ ధరించి వున్నారు. సహజసౌందర్యానికి తోడుగా చక్కగా అలంకారాలు కూడా ధరించి మెరిసిపోతున్నారు. సాంబమూర్తిని అనుసరించి వెళ్లే అగ్నికుమారులు స్కంధవిశాఖులులాగా కూడా దీపిస్తున్నారు.

ఇలాగ సరయూనది దక్షిణపు గట్టునే ఒకటిన్నర ఆమడల దూరం వెళ్ళాక విశ్వామిత్రుడు రాముణ్ణి గారాబంగా పిలిచి "నాయనా! చేతులూ కాళ్ళూ కడుగుకొని ఆచమనం చెయ్యి. ఆలస్యం చెయ్యక త్వరగా రా. బల అతిబల అని రెండు విద్యలు. అవి మంత్రసమష్టి రూపాలు, అవి నీకు ఉపదేశిస్తాను, గ్రహించు. ఈ విద్యలు నీకు స్వాధీనం అయితే నీకెప్పుడున్నూ అలసట యేమాత్రమున్నూ కలగదు. జ్వరం రాదు. రూపం మారదు. నువ్వు నిద్రలో వుండినా, ఆదమరిచి వుండినా రాక్షసులు నిన్నేమీ చెయ్యలేరు. ఈ విద్యలవల్ల బాహుబలంలో, మూడులోకాలలోనూ నువ్వు సాటిలేనివాడవు అవు

తావు. సౌందర్యంలోనూ, సామర్థ్యంలోనూ, జ్ఞానంలోనూ, బుద్ధి సూక్ష్మతలోనూ, ప్రశ్నోత్తరాలలోనూ కూడా నువ్వు సాటిలేని వాడవు అవుతావు. బల అతిబల అనే యీ రెండు విద్యలూ సకల జ్ఞానాలకూ మాతృభూతాలు. ఇవి జపిస్తేవా ప్రయాణాలలో నీకు ఆకలీ దప్పికా కలగవు. వీటివల్ల నీకు అపారమైన కీర్తి కలుగు తుంది. తేజస్సమన్వితాలైన యీవిద్యలు రెండూ బ్రహ్మదేవుని కూతుళ్ళు. ఈ విద్యలు గ్రహించడానికి నువ్వే తగినవాడవు. సౌంద ర్యాదులు నీ కిదివరకే ఉన్నాయి, సందేహం లేదు; కనక, ఈ విద్యలు నీకు ఇంకా అనేక లాభాలు కలిగిస్తాయి" అని చెప్పాడు.

వెంటనే రాముడు ఆచమనాదికం చేసి, విశ్వామిత్రమహర్షి ఉపదే శించగా మహోత్సాహంతో ఆ రెండు విద్యలూ స్వీకరించాడు. మరిన్నీ అతను, ఆ విద్యలు స్వీకరించగానే మహాపరాక్రమవంతుడై, సహస్ర కిరణుడైన సూర్యుడు శరదృతువున తేజరిల్లేటట్టు ప్రకాశించాడు.

ఆరాత్రి రామలక్ష్మణులు, గురువైన విశ్వామిత్రునికి సకలపరిచా రాలూ చేశారు. చివరికి, ఆ ముగ్గురూ సరయుగట్టున గడ్డి పరుచుకుని పడుకున్నారు. కొంతసేపు విశ్వామిత్రుడు ఆమాటా యీమాటా చెప్పి రామలక్ష్మణులను లాలించాడు. తరవాత వారు సుఖంగా నిద్రించారు.

## ౧౬

## మన్మథాశ్రమవాసం

తెల్లవారింది. పెద్దవాడు కనక, ముందు విశ్వామిత్రునికి మెళుకువ వచ్చింది. వెంటనే అతను "కౌసల్యా కడుపు చల్లగా ఉండుగాక. రామా, తెల్లవారింది. ఈపాటికి మేలుకో. ఆహ్నికాలు నెరవేర్చుకో"

అని ప్రబోధించాడు. ఆమాట విని, రామలక్ష్మణు లిద్దరూ కాల్య కృత్యాలు తీర్చుకుని, స్నానసంధ్యాదినిత్యానుష్ఠానాలు ముగించుకుని జపం కూడా చేసుకున్నారు. తరవాత మునికి పాదాభివందనాలు చేసి అతని వెంట బయలుదేరారు. వెళ్ళివెళ్ళి సరయూనది గంగానదిలో కలిసింది. వారు ముగ్గురూ కూడా వెళ్ళివెళ్ళి ఆ సంగమస్థానం చేరుకున్నారు.

అక్కడ వొక మున్యాశ్రమం వుంది. తపోధనులలో చాలా గొప్పవారైన మును లక్కడ వున్నారు. వారు వేల సంవత్సరాలనుంచి తపస్సు చేస్తున్నవారు. అది చూసి రామలక్ష్మణులు "మహాత్మా! ఈ ఆశ్రమం యెవరిది? ఇందు వసిస్తూ వున్న మహర్షి యెవరు?" అని కుతూహలంతో అడిగారు.

ఆమాట విని నవ్వి విశ్వామిత్రు డిలా చెప్పాడు.

"రామా! కథ అంతా చెబుతా విను. మన్మథుడు సశరీరుడై వుండేటప్పుడు కాముడు అని పిలవబడేవాడు. ఇది సాంబమూర్తి ఆశ్రమం. ఆ దేవదేవు డిక్కడ సమాహితుడై తపస్సు చేసుకుంటూ వుండగా దుర్బుద్ధి అయి మన్మథుడు అల్లరిపెట్టాడు. అది సహించలేక శంకరుడు హుంకరించి మూడో కంటితో చూశాడు. వెంటనే మన్మథుడు భస్మం అయిపోయాడు. అది మొదలు మన్మథునికి అనంగు డని పేరు వచ్చింది. మన్మథుడు అంగత్యాగం చేసిన యీ స్థలాన్ని బట్టి ఈ దేశానికి అంగదేశం అని పేరువచ్చింది. ఆ దేవదేవుని శిష్యులే ఇప్పు డీ ఆశ్రమంలో వుంటున్న మహర్షులు. వీరు ఎప్పుడూ ధర్మపరులై వుంటారు. వీరికి పాపం కసింతైనా అంటదు. ఈ రాత్రి మనం ఈ ఆశ్రమంలో వుండి రేపు గంగానది దాటి వెడదాము. ముందు శుచిర్భూతులమై ఆశ్రమం ప్రవేశింతాము."

ఇక్కడ వీరు ఇలా అనుకుంటూ వుండగా, దివ్యదృష్టివల్ల ఈసంగతి అంతా గ్రహించి ఆశ్రమవాసు లైన మును లందరూ మహానందంతో వచ్చి ముందు విశ్వామిత్రునికి అర్ఘ్యమూ పాద్యమూ ఆతిథ్యమూ యిచ్చి, తరవాత, రామలక్ష్మణులకు కూడా అతిథిసత్కారాలు చేశారు. కొంతసేపు వారు ఆ కథా యీ కథా చెప్పి విశ్వామిత్రుణ్ణీ రామలక్ష్మణులనూ సంతోషపెట్టారు.

తరవాత సంధ్యోపాసన కూడా చేసి అతిథులను ఆశ్రమంలోకి తీసుకువెళ్లారు. ఆవేళ వారక్కడ విశ్రమించారు. విశ్వామిత్రుడు మంచిమంచి కథలు చెప్పి ఆ రాత్రి రామలక్ష్మణులను ఉత్సాహవంతులుగా చేశాడు.

## ౨౦

## తాటకావనప్రస్తావం

మళ్లీ తెల్లవారింది. కాల్యకృత్యాలు తీర్చుకుని రామలక్ష్మణులు విశ్వామిత్రునితో నది వొడ్డికి వచ్చారు. సంశ్రితవ్రతు లైన ఆశ్రమవాసు లందరూ వెంటవచ్చి మంచి నావ తెప్పించి "విశ్వామిత్రమహర్షీ ! రాజపుత్రులతో నావ యెక్కు. కాలం మించిపోకుండా బయలుదేరు. దోవలో శుభాలు కలుగుగాక" అని చెప్పారు. "మంచి" దని మారుపలికి, విశ్వామిత్రుడు ఆ మునుల నందరినీ పూజించి, వారి సెలవు పొంది, రామలక్ష్మణులతో పడవ యెక్కి సాగరగామి అయిన ఆ నది దాటాడు. పడవ నదిమధ్యకి వచ్చాటప్పటికి నీటిలోనుంచి ఒక ధ్వని వినిపించింది. రాముడదేమి టని అడగ్గా విశ్వామిత్రుడు "రామా ! బ్రహ్మదేవుడు కైలాసపర్వతంమీద తన మనస్సుతో వొక సరస్సు సృష్టించాడు. మనస్సంబంధంవల్ల మానససరోవరం అని పేరువచ్చింది.

అయోధ్యానగరం పడమటినుంచి ఉత్తరంగా వెళ్లి, తూర్పుగా మళ్లి అంగదేశంలో గంగతో కలుస్తున్న సరయూనది ఆసరోవరంలోనే పుట్టింది. అంచేతనే దానికి సరయూనది అని పేరు. గంగాతలం కంటే సరయూతలం ఎత్తు. సరయూనది ఎత్తునుంచి గంగలోపడుతోంది కనక ఈశబ్దం పుడుతోంది. ఇది పూజ్య మైనది, నమస్కారం చెయ్యి" అని చెప్పాడు.

వెంటనే ఆ రెండు నదులకూ నమస్కరించి రామలక్ష్మణులు, పడవ దక్షిణపు వొడ్డుచేరగా అతిలాఘవంగా లంఘించారు. ఒడ్డు ఎక్కేటప్పటికి భయంకర మైన అరణ్యం కనపడింది. ఆవనంలో కీచురాళ్లు చెవులు బద్దలయేటట్టు కూస్తున్నాయి. కుక్కలూ భయంకరమృగాలూ అరుస్తున్నాయి. భాసపక్షులు దారుణధ్వనులు చేస్తున్నాయి. ఇంకా అనేకవిధా లైన పక్షులు అతిఘోరంగా కూస్తున్నాయి. సింహాలూ పెద్దపులులూ ఏనుగులూ విచ్చలవిడిగా తిరుగుతున్నాయి. చండ్ర చెట్లూ, నల్లమద్దిచెట్లూ, మారేడుచెట్లూ కలిగొట్టుచెట్లూ, రేగు చెట్లూ — మొదలైన ఎన్నోవిధాల చెట్లు ఆకాశం అంటేటట్టు పెరిగి అల్లుకుపోయి వున్నాయి. జనసంచారం ఎంతమాత్రమూ లేని ఆ అరణ్యం చూసి రాముడు "దీని పేరు ఏమిటి?" అని అడిగాడు.

అందుకు "వినండి" అని విశ్వామిత్రు డిలా చెప్పాడు.

"ఈప్రదేశం అంతా మలద దేశాలకీ కరూశ దేశాలకీ సంబంధించినది. ఈ దేశాలు ధనధాన్యసమృద్ధాలై దేవలోకం లాగ వుండేవి. వెనకటికి, వృత్రాసురుణ్ణి సంహరించడంవల్ల దేవేంద్రునికి బ్రహ్మహత్యాపాతకం చుట్టుకుని దానివల్ల అతనికి మాలిన్యమూ ఆకలీ ఎక్కువ అయిపోయాయి. అప్పుడు దేవతలూ మహర్షులూ చేరి ఇంద్రుణ్ణి గంగానదుల్లో స్నానం చేయించి, చివరికి, మంత్రపూతాలైన కలశాలా

కాలతో కూడా స్నానం చేయించి ఆమాలిన్యమూ ఆకరూశమూ (ఆకలీ) పోగొట్టారు. అవి రెండూ ఇంద్రునికి స్నానం చేయించిన చోట భూమికి సంక్రమించాయి. ఆ భూభాగం యిదే. ఆవిధంగా ఇంద్రుడు నిర్మలుడూ నిష్కరూశుడూ అయి పరమప్రీతుడై 'ఇవి ధనధాన్యసమృద్ధా లయిన జనపదా లయి, నా శరీరసంబంధా లైన మలకరూశాలను భరించాయి కనక మలద దేశాలూ కరూశ దేశాలూ అని ప్రఖ్యాతి పొందుగాక' అని అనుగ్రహించాడు. అది చూసి దేవతలూ మహర్షులూ మేలుమే లని పొగిడారు. తరవాత ఈదేశాలు చాలాకాలంవరకూ జనసంకీర్ణాలూ ధనధాన్యసమృద్ధాలూ అయి వెలిశాయి.

కాలం యిలా గడుస్తూవుండగా, దురదృష్టవశాన తాటక అనే యక్షురాలు ఇక్కడ ప్రవేశించింది. అది కామరూపిణి. పుట్టుకలోనే దానికి వెయ్యి ఏనుగుల బలం ఏర్పడింది. పై పెచ్చు, అది సుందోప సుందులలో వొక డైన సుందుని భార్య. దాని కొడుకే మారీచు డనే రాక్షసుడు. మెలికలు తిరిగిన చేతులూ పెద్ద శరీరమూ, వెడల్పయిన మొగమూ వాడూ పరాక్రమంలో దేవేంద్రునితో సమానుడు. ఇలాగ భయంకరాకారు డైన ఆ మారీచుడు ఈదేశాలలో వున్న ప్రజలను మిక్కిలీ బాధించసాగాడు. ఊళ్లకి వూళ్లే నాశనం చెయ్యసాగాడు. దుష్టచారిణీ అయిన ఆ తాటక ఇక్కడికి ఒకటిన్నర ఆమడల దూరాన మార్గానికి అడ్డంగా నివసించి వుంది. కనక, మనం ఆమార్గాన వెళ్లి తీరాలి. నేను ఆదేశిస్తున్నాను, కాబట్టి నువ్వు దుష్టురా లయిన తాటకను సంహరించు. మలదకరూశదేశాలను నిష్కంటకాలుగా స్వస్థ్యం చెయ్యి. తాటక మూలాన పాడుపడిన యీదేశాలకు మరెవరూ స్పృష్టించండా వున్నాడు."

ప్ర. ౯

## తా ట క

విశ్వామిత్రు డిలా చెప్పగా రాముడు "మునిపుంగవా! యక్షులు బల హీనులని వింటామే, మరి అబల అయిన తాటక వెయ్యేనుగుల బలం కలది యెలా అయిందీ?" అని అడిగాడు. అందుకు విశ్వామిత్రుడు మళ్లీ యిలా చెప్పాడు.

"రామా! వరప్రసాదంవల్ల తాటక అంత బలవంతురా లయింది. వెనకటికి సుకేతు డని వొక గొప్ప యక్షు డుండేవాడు. వాడు చాలా బలవంతుడు. సంతానంకోసం వాడు శుభాచారుడై అతినిష్ఠతో తపస్సు చేశాడు. బ్రహ్మ సంతోషించి, సాక్షాత్కరించి కొడుకు నివ్వక కూతురి నిచ్చాడు. దానికి వెయ్యి ఏనుగుల బలం కూడా యిచ్చాడు. అదే యీతాటక. అదిపెరిగి పెద్దది అయి చక్కని చుక్క కూడా అయింది. అంతట సుకేతుడు దాన్ని ఝర్ఝుని కొడు కైన సుందుని కిచ్చి పెళ్లి చేశాడు. కొన్నాళ్లకి దానికి మారీచు డని కొడుకు పుట్టాడు. తరవాత ఏదో కారణంవల్ల అగస్త్యుడు సుందుణ్ణి చంపేశాడు. దానిమీాద మండిపడి ఈతాటక, కోరికి తినివేద్దా మని కొడుకుతో కూడా అగ స్త్యునిమీాద పడింది. అది చూసి ఆ మహర్షి 'నువ్వు రాక్షసుడవు అయిపో' అని మారీచుణ్ణి శపించాడు. 'వికృతముఖివై కురూపివై రాక్షసి వయిపోయి, మనుష్యులను తింటూ పడివుండు' అని ఆ మహర్షి తాటకను కూడా శపించాడు. ఆ శాపంవల్ల కసిపెంచుకుని తాటక ఆమహర్షి కి స్వస్థలం అయిన ఈ దేశం నాశనంచేస్తోంది. రఘుకులచంద్రా! దీని చరిత్ర యిలాంటిది కనక, దుర్వృత్తురాలూ దుష్టపరాక్రమురాలూ అయిన యీతాటకను గోబ్రాహ్మణహితం కోరి వెంటనే సంహరించు. జరిగిం దంతా విని దీన్ని సంహరించడాని కెవడూ సిద్ధపడకుండా

వున్నాడు. ఈ మూడులోకాల్లానూ నువ్వు తప్ప యీపని చెయ్యగల వాడు మరొకడు లేడు. 'ఆడదాన్ని చంపనా?' అని నువ్వు ఏవగించుకోగూడదు. నువ్వు మహారాజకుమారుడవు. తాటకను సంహరిస్తే చాతుర్వర్ణ్యానికీ మేలు కలుగుతుంది. కనక నువ్వీ పని చేసితీరాలి. ప్రజలను రక్షించడానికి రాజులు క్రూరకర్మ అయినా చెయ్యాలి. పాపం వస్తుం దనీ, అపవాదలు పుడతా యనీ జంకకుండా ఏపని అయినా చెయ్యాలి. రాజులకు ఇది సనాతనధర్మం. దీన్ని ఆక్షేపించగలవాడెవడూ లేడు. ఈకారణంవల్ల ఇందులో అధర్మం ఏమీ లేదు కాబట్టి అధర్మపరురా లయిన యీ తాటకను సంహరించు. వెనకటికి, విరోచనునికి మందర అని వొక కూతురుండేది. అది భూమిని నాశనం చెయ్యడానికి పూనుకోగా, దేవేంద్రుడు దాన్ని చంపివేశాడు. మరిన్నీ శుక్రుడు దేవతలను శిక్షించడానికి ప్రజ్ఞ సంపాదించుకుందా మని రుద్రుని సమీపాన తపస్సు ప్రారంభించాడు. ఆసమయంలో వొక రాక్షసస్త్రీని దేవతలు పీడించారు. అది పారిపోయి శుక్రుని తల్లిని శరణుజొచ్చింది. దాన్ని రక్షించడానికి కామె ప్రపంచంలో ఇంద్రు డనే వాడు లేకుండా చేద్దా మని పూనుకుంది. ఆకారణంవల్ల ఆమె భృగుమహర్షి భార్య అని సందేహించకుండా శ్రీమహావిష్ణువు ఆమెని సంహరించివేశాడు. వీళ్లే కాదు, ఇంకా అనేకమంది స్త్రీలు చెడ్డపనులు చెయ్యగా మహామహావాళ్లే వాళ్లని సంహరించివేశారు. కనక, తాటకా వధ నీకు అకార్యకరణం అనిపించుకోదు."

## ౨౨

## రాముడు తాటకను సంహరించడం

ఇదంతా విని రాముడు దృఢవ్రతుడై దోసిలి వొగ్గి "అయోధ్యలో సభామధ్య నాన్నగారు గురువుల సన్నిధిని 'విశ్వామిత్రమహర్షి యేమి

చెబితే అది నిశ్శంకగా చెయ్యి' అని నన్నాజ్ఞాపించారు. కనక, బ్రహ్మవాది అయిన విశ్వామిత్రమహర్షి ఆజ్ఞానుసారంగా తాటకను సంహరిస్తాను. మహర్షీ! గోబ్రాహ్మణులకు క్షేమం కలగడం కోస మున్నూ, ఈదేశం అంతా జనబహుళమూ ధనధాన్యసమృద్ధమూ కావడానికిన్నీ, ముఖ్యంగా నీఆజ్ఞ నెరవేర్చడానికిన్నీ తాటకను సంహరిస్తాను" అని చెబుతూ ధనుస్సు ఎక్కుపెట్టి దిక్కులు బద్దలయేటట్టు నారి మోగించాడు. ఆ ధ్వని విని తాటకావనంలో వుండినవారందరూ ఉలిక్కిపడ్డారు. తాటక క్రోధం వహించి ఆధ్వని వచ్చిన దిక్కుగా పరుగెత్తింది.

అది చాలా వికారంగా వుంది. మొగం చాలా అసహ్యంగా ఉంది. పైగా ఆ తాటక చాలా పొడుగ్గాకూడా వుంది. దాన్ని చూపించి "లక్ష్మణా! ఈయక్షిణి యెంత భయంకరంగా వుందో చూడు. పిరికివాళ్ళు దీన్ని చూశారంటే గుండెలు బద్దలయి మూర్ఛిల్లిపోతారు. మాయాబలంతో మీదికి వస్తున్న దీన్ని ముక్కూ చెవులూ కోసి వెనక్కి మళ్లిస్తాను స్త్రీ కనక చంపను" అంటూ వుండగానే, అది క్రోధపరవశురాలై చేతు లెత్తుకుని రామునిమీదకి ఉరికింది, అదిచూచి విశ్వామిత్రుడు హుమ్మని దాని అదలించి "రామా! భద్రం" అన్నాడు.

దానిమీద, తాటక దుమ్మెత్తిపోసి రామలక్ష్మణులకు దిక్కులు తెలవకుండా వుండేటట్టు చేసింది. రాళ్ళు కూడా విసరి వారిని చీకాకు పరిచింది. అందుకు చాలా కోపించి, రాముడు, ముందు బాణాలతో ఆ రాతివర్షం తప్పించుకుని, తరవాత, అది యింకా మీదికి వస్తూవుండగా దాని చేతులు రెండూ తెగవేశాడు.

దాంతో అలసట పొంది తాటక సమీపాన పడి రొజుతూ వుండగా, లక్ష్మణుడు దాని ముక్కూ చెవులూ కోసేశాడు. వెంటనే

అది గర్జిస్తూ కామరూపిణి అయి అనేకవిధాల అల్లరిపెడుతూ మళ్లీ రాళ్లవర్షం ప్రారంభించింది. ఎటు తిరిగినా రాళ్లు పడుతూ వుండడం చూసి విశ్వామిత్రుడు "రామా! ఇక కనికారం చాలు. ఇది పాపాత్మురాలు. దుష్టచారిణి. యజ్ఞాలు పాడుచెయ్యడంలో ఇది మిక్కిలీ దక్షురాలు. త్వరగా చంపు. సాయంకాలం కాబోతోంది. సంధ్యాసమయంలో రాక్షసులను చెనకడం చాలా కష్టం"అని చెప్పాడు.

విశ్వామిత్రు డిలా చెబుతూ వుండగానే రాముడు శబ్దవేధ చేసి రాళ్లవాన ఆపుచేశాడు. అంతట తాటక రామలక్ష్మణులమీదికి ఉరికింది. వెంటనే రాముడు పిడుగు లాగ వస్తున్న తాటక గుండెల మీద బాణంతో కొట్టాడు. దాంతో, బొబ్బలు పెడుతూ కూలి పడి తాటక చచ్చిపోయింది.

తాటక అలా చచ్చిపడిపోగా, దేవేంద్రుడు "బాగుబాగు" అని రామలక్ష్మణులను మెచ్చుకున్నాడు. దేవతలు పూజించారు. తరవాత ఇంద్రుడూ దేవతలూ విశ్వామిత్రుణ్ణి సంబోధించి "మహర్షీ! నీకు భద్రం అగుగాక. నువ్వు చేసి చేయించిన పనికి మే మంతా సంతోషించాము; కనక, రాముణ్ణి కటాక్షించు. భృశాశ్వాస్త్రాలను రామునికి సమర్పించు. అత నందుకు తగినవాడు. నీప్రోత్సాహంతో అతను దేవతల కింకా యెన్నో మేళ్లు చెయ్యవలసివున్నాడు" అని చెప్పి వెళ్లిపోయారు.

తరవాత విశ్వామిత్రుడు రాముణ్ణి చేరదీసుకుని శిరస్సు మూర్కొని "రామా! ఈరాత్రి యిక్కడే వుండి, మనం రేపు నా ఆశ్రమానికి వెడదా" మన్నాడు. రాముడు 'సరే' అన్నాడు.

తాటక చావడంతోటే ఆ అడవి, కుబేరుని ఉద్యానవనం అయిన చైత్రరథంలాగ విరాజిల్లింది.

## ౨౬

## దివ్యాస్త్రలాభం

రాత్రి అంతా గడిచిపోయాక, విశ్వామిత్రుడు, చిరునవ్వు, నవ్వుతూ, "రామా! నువ్వు చేసిన పనికి చాలా సంతోషించాను. నీకు భద్రం అగుగాక. సంతోషంతో నీకు శస్త్రాలూ అస్త్రాలూ ఇస్తాను స్వీకరించు. యుద్ధం చేసి దేవతలు అసురులు గంధర్వులు నాగులు — మొదలైనవా రెవరెవరున్నా వారి నందరినీ జయించడానికి వీలయిన అస్త్ర శస్త్రా లన్నీ నీకు ఇస్తాను స్వీకరించు. వాటిలో ముఖ్యమైనవి, దండచక్రం. ఇది చాలా గొప్పది. ధర్మచక్రం, కాలచక్రం, విష్ణుచక్రం, ఇంద్రాస్త్రం, వజ్రాస్త్రం, శూలాయుధం, బ్రహ్మాస్త్రం, ఐషీకం—ఇవిన్నీ చాలా గొప్పవి స్వీకరించు. మోదకి శిఖరి అని రెండు గదలు. ఇవిన్నీ గ్రహించు. ధర్మపాశం, కాలపాశం, వరుణపాశం, వరుణాస్త్రం— ఇవి ఉత్తమోత్తమాలు పరిగ్రహించు. శుష్కాశని, ఆర్ద్రాశని, పినాకాస్త్రం, నారాయణాస్త్రం, శిఖరం అనబడే ఆగ్నేయాస్త్రం. ప్రథనం అనే వాయవ్యాస్త్రం, హయశిరోస్త్రం, క్రౌంచాస్త్రం, విష్ణు శక్తి, రుద్రశక్తి ఇవి సాటిలేనివి పుచ్చుకో. రాక్షసులు వాడే కంకాళం, ఘోరమైన ముసలం, కాపాలం, కంకణం — ఇవిగూడా స్వీకరించు. నందనం అనే విద్యాధరాస్త్రం మిక్కిలీ గొప్పది. దీని వల్ల అప్పటికప్పుడు లెక్కలేనన్ని ఖడ్గాలు పుట్టుకువస్తాయి. మానవాస్త్రం, ప్రస్వాపనాస్త్రం, ప్రశమనాస్త్రం సౌరాస్త్రం. — ఇవి గాంధర్వాలు, స్వీకరించు. దర్పణాస్త్రం, శోషణాస్త్రం, సంతాపనాస్త్రం, విలాపనాస్త్రం, మదనాస్త్రం — ఇవి కందర్పదయితాదులు, పరిగ్రహించు. మోహనాస్త్రం పిశాచాలు వాడేది.- అదిన్నీ గ్రహించు. తామసం, సౌమనం, సంవర్ధం, మౌసలం, సత్యం, మాయాధరం,

తేజఃప్రభం, శిశిరం, సుదామనం, దారుణమైన భగాస్త్రం, మానవం — అనే అస్త్రాలు నీదగ్గిర తప్పకుండా ఉండవలసినవి, పుచ్చుకో. ఇవన్నీ కామరూపాలు. చాలా శక్తి కలవి. పరమోదారాలు. ఇవన్నీ స్వీకరించు."

ఇలా చెప్పి విశ్వామిత్రుడు శుచి అయి, తూర్పుమొగంగా కూచుని ఈమంత్రగ్రామం అంతా పరమప్రీతితో రాముని కిచ్చాడు. ఇవన్నీ దేవతలకున్నూ దుర్లభాలు. విశ్వామిత్రుడు జపం చెయ్యగా ఇవన్నీ సాక్షాత్కరించాయి. మరిన్నీ అవి దోసిలి వొగ్గి రాముణ్ణి చూసి "మేము నీకు సేవకులమై వుంటా" మని చెప్పాయి. రాము డందుకు చాలా సంతోషించి వాటిని తాకి "మీరు నామనస్సు ననుసరించి నడుచుకుంటూ వుండండి" అన్నాడు.

తరవాత రాముడు పరమభక్తితో విశ్వామిత్రునికి నమస్కరించి అతనితో బయలుదేరాడు.

## ౨౮

## విశ్వామిత్రుడు అస్త్రోపసంహారం ఉపదేశించడం

"మునిపుంగవా! నువ్వు అనుగ్రహించిన శస్త్రాస్త్రాలు స్వీకరించి నేను దేవతలకున్నూ తేరిచూడరానివా ణ్ణయినాను. అయితే, ఉపసంహారం తెలియకపోతే నావల్ల యేమవుతుందీ? కనక, ఉపసంహారక్రమం కూడా అనుగ్రహించు" అని రాముడు అడుగువేస్తూనే అడిగాడు. "నిజమే" అని పలికి విశ్వామిత్రుడు అదంతా చెప్పాడు. అంతేకాక: సువ్రతుడై శుచి అయి సత్యవంతం, సత్యకీర్తి, ధృష్టం, రభసం, ప్రతిహారతరం, పరాఙ్ముఖం, అవాఙ్ముఖం, లక్షాక్షం, విషమం, దృఢనాభం, సునాభం, దశాక్షం, శతవక్త్రం, దశశీర్షం, శతోదరం, పద్మనాభం,

మహానాభం, మందునాభం, సునాభం, జ్యోతిషం, కృశనం, వైరాశ్యం, విమలం, యోగంధరం, హరిద్రం, దైత్యం, ప్రశమనం, శుచి, బాహువు, మహాబాహువు, నిష్కలి, విరుచి, సార్చిర్మాలి, ధృతిర్మాలి, వృత్తిమంతం, రుచిరం, పిత్రుసౌమనసం, విధూతం, మకరం, కరవీరకరం, ధనం, ధాన్యం, కామరూపం, కామరుచి, మోహం, ఆవరణం, జృంభకం, సర్వనాభం, సంతానం, వరణం అని పేళ్లు గల భృశాశ్వాస్త్రాలు కూడా ఉపదేశించి, ఉపసంహారక్రమమున్ను తెలియపరిచాడు. రాముడు స్వీకరించగానే అవి మూర్తిమంతాలై యెదట నిలిచాయి. వాటిలో కొన్ని మసిబొగ్గు ల్లాగున్నాయి. మరికొన్ని పొగలాగున్నాయి. కొన్ని సూర్యచంద్రుల్లాగున్నాయి. అవన్నీ దోసిలి వొగ్గి రామునితో "పురుషవ్యాఘ్రా! ఇదే మేము నీ అధీనం అయినాము. మేమేమి చెయ్యాలో ఆజ్ఞాపించు" అని విన్నవించుకోగా రాముడు "సమయం వచ్చినప్పుడు నేను స్మరిస్తాను. వెంటనే మీరు వచ్చి నేను చెప్పిన పని చేస్తూ వుండండి. ఇప్పటికి యథేచ్ఛగా వెళ్లిపొండి" అని అజ్ఞాపించాడు. వెంటనే అవి రామునికి ప్రదక్షిణం చేసి "సరే" అని చెప్పి వెళ్లిపోయాయి.

వారు మళ్ళీ బయలు దేరారు. కొంతదూరం వెళ్ళాటప్పటికి వొక ఆశ్రమం కనపడింది. అదొక పర్వతానికి దగ్గిరగా వుంది. పెద్ద పెద్ద చెట్లు గుంపులుగుంపులుగా దానిచుట్టూ వున్నాయి. లేళ్లు, వింత వింతగా పలికే పక్షులూ అక్కడ ఎన్నో వున్నాయి. అది చూసి రాముడు "మునిశ్రేష్ఠా! భయంకర మైన అరణ్యం దాటివచ్చాము. ఏ అలజడీ లేకుండా నిశ్చలంగా వుంది కనక, యిది మున్యాశ్రమం అని వూహిస్తున్నాను. ఇది నిజమా; అయితే యిది ఎవరి ఆశ్రమం? బ్రహ్మహంతలూ, దుష్టచారిణులూ అయిన రాక్షసులు వచ్చి నీయజ్ఞం

భగ్నం చేస్తా రన్నా వే ? ఆయజ్ఞం జరిగే నీఆశ్రమం యెక్కడ వుంది ? వాళ్ళని నేనెక్కడ చంపాలి ? ఇదంతా వివరంగా చెప్పు ” అని అడిగాడు

## ౨౯
## సి ద్ధా శ్ర మ ప్ర వే శ ం

ఇది విని విశ్వామిత్రుడు ఇలా ప్రారంభించాడు.

“మహాబాహుడ వైన రామా ! ఇది సిద్ధాశ్రమం. శ్రీమహా విష్ణువు తపస్సు చేసుకోడానికీ, యోగసిద్ధి పొందడానికీ యిక్కడ వందలకొద్దీ యుగాలు నివసించి వుండినాడు. ఇదివామనుని పూర్వాశ్రమం. మహాతపశ్శాలి అయిన కాశ్యపుడు తపస్సిద్ధి పొందాడు. మహావిష్ణువు ఇక్కడ తపస్సు చేస్తూ వుండినప్పుడు విరోచనుని కొడు కయిన బలిచక్రవర్తి ఇంద్రునితో కూడా దేవతల నందరినీ జయించి, త్రిలోకాలయందూ ప్రఖ్యాతి పొంది, మంత్రులను నియమించి స్వర్గరాజ్యం పరిపాలించాడు. మరిన్నీ అతను యజ్ఞంకూడా చేశాడు. అప్పుడు దేవత లందరూ అగ్నిని ముందిడుకుని వచ్చి ఇక్కడే విష్ణుమూర్తిని సందర్శించి ‘మహావిష్ణూ ! విరోచనుని కొడుకైన బలి ఉత్తమమైన యజ్ఞం చేస్తున్నాడు. అది పూర్తి అయితే వాడు ఎవరికీ సాధ్యుడు కాడు. కనక యిప్పుడే మనపని నెరవేర్చు. ఎవరు వచ్చినా పొమ్మనక, వచ్చిన వారేమి కోరినా లేదనక వాడు యాచకులను సంతోషపెడుతున్నాడు. కాబట్టి నువ్వు దేవతలను రక్షించడానికి వామనావతారం యెత్తి బయలుదేరు’ అని ప్రార్థించారు.

అగ్నిలాగ ప్రకాశిస్తున్న కాశ్యపుడు అనేకవేల సంవత్సరాలు తపస్సు చేసి సరిగా యీసమయంలోనే ప్రసన్నుడు కాగా భార్యతో కూడ ‘ప్రభూ ! నువ్వు తపోమయుడవు. తపోరాశివి. తపో

మూర్తివి, తపాత్మకుడవు. నిన్ను నేటికి చూడగలిగాను. నీ శరీరం లోనే జగత్తు అంతా చూడగలుగుతున్నాను. నువ్వు ఆద్యంతరహితుడవువు, అవాఙ్మానసగోచరుడవు. నువ్వే నాకు శరణం' అని భక్తితో ప్రార్థించాడు. అందు కానందించి శ్రీహరి 'వరం కోరుకో' మన్నాడు. అది విని ధూతకల్మషుడూ, మరీచి కొడుకూ అయిన కాశ్యపుడు 'వరదా! నువ్వు నాకూ నాభార్య అయిన అదితికీ కన్న కొడుకువు కావాలి. దేవేంద్రునికి తమ్ముడవై శోకార్తులైన దేవతల నందరినీ రక్షించు. నీ అనుగ్రహంవల్ల ఇది సిద్ధాశ్రమం అని పేరు పొందాలి. కనక ఇక్కణ్ణుంచే నువ్వు బయలుదేరాలి' అని కోరాడు.

వెంటనే మహావిష్ణువు అదితికి కొడుకయి పుట్టి పొట్టివాడయి, బలిచక్రవర్తి దగ్గిరికి వెళ్లి మూడు అడుగుల నేల అడిగి లోకాలన్నీ ఆక్రమించి, బలిని అణచివేసి స్వర్గం మళ్లీ యింద్రుని కిచ్చాడు. ఆ వామనుడు ఇక్కడ వుండినాడు. ఇక్కడ వుంటే శ్రమ అనేదే వుండదు. నే నిప్పుడు ఈ ఆశ్రమంలోనే వుంటున్నాను-ఇది నాస్వాధీనంలోనే వుంది. యజ్ఞవిఘ్నం చెయ్యడానికి రాక్షసు లిక్కడికే వస్తున్నారు. ఆ దుష్టులను నువ్వు ఇక్కడే సంహరించాలి కనక, మనం సిద్ధాశ్రమంలో ప్రవేశింతాం పద. నా కెలాంటిదో యిది నీకూ అలాంటిదే."

ఇలా చెబుతూ మంచు తగ్గిపోయాక పునర్వసుతో కలిసి చంద్రుడు ప్రకాశించేటట్టు ప్రకాశిస్తూ విశ్వామిత్రుడు రామలక్ష్మణులతో కలిసి ఆశ్రమంలోకి వెళ్లాడు. ఆ ఆశ్రమంలో వుండినవా రందరూ 'ఎగిరెగిరి పడుతూ వచ్చి విశ్వామిత్రుణ్ణి పూజించారు. విశ్వామిత్రుణ్ణి పూజించి నట్లే రామలక్ష్మణులను కూడా పూజించి అతిథిసపర్యలు చేశారు.

తరవాత రామలక్ష్మణులు కొంచెంసేపు విశ్రమించి దోసిలి వొగ్గి "మహర్షీ! ఇప్పుడే నువ్వు యజ్ఞదీక్ష స్వీకరించు. ఇది సిద్ధాశ్రమం

కనక, నీకు తప్పకుండా యజ్ఞసిద్ధి అవుతుంది" అని విన్నవించు కున్నారు. విశ్వామిత్రుడున్నూ నియతేంద్రియుడై దీక్షాస్వీకారం చేశాడు. రామలక్ష్మణులు సమాహితులై ఆరాత్రి గడిపి తెల్లవారగనే సంధ్యోపాసన ముగించుకుని, జపంకూడా పూర్తి చేసుకుని, అప్పుడే అగ్నిహోత్రాలు చేసుకుని వుండిన విశ్వామిత్రునికి పాదాభివందనాలు సమర్పించారు.

## ౨౬

## మారీచసుబాహులను చంపడం

దేశకాలాలు చక్కగా గుర్తెరిగివుండిన రామలక్ష్మణులు విశ్వామిత్రుణ్ణి చూసి "మహాత్మా! ఆరాక్షసుల నెప్పుడు సంహరించాలో అది విశదం చెయ్యి. మేము ఆసమయం దాటిపోనివ్వ" మని అడిగారు. ఇలా అడిగి యుద్ధం చెయ్యడానికి తొందరపడుతూ వున్న ఆ రామలక్ష్మణు లను చూసి అక్కడ వుండిన మునులు "ఇది మొదలు మీరు ఆరు రాత్రింబగళ్లు ఈ యాశ్రమం రక్షించవలసి వుంది. విశ్వామిత్ర మహర్షి యజ్ఞదీక్షలో వున్నాడు. అంచేత ఆయన మాట్లాడగూడదు" అని చెప్పారు.

రాజపుత్రు లిద్దరూ కంటికి నిద్ర అనేది లేకుండా ఆరు రాత్రులూ వారిని రక్షించారు. ఆరోనాడు రాముడు "లక్ష్మణా! జాగ్రత్త. సిద్ధంగా వుండు" అని చెబుతూ వుండగా ఋత్విజులతోనూ ఉపాధ్యా యులతోనూ నిండివుండిన యజ్ఞవేది చక్కగా ప్రజ్వలించింది. వేది అంతటా దర్భలూ, చమసలూ, స్రుక్కులూ, సమిధలూ, పువ్వులూ నిండివున్నాయి. విశ్వామిత్రుడు అక్కడ కూచుని జాజ్వల్యమానంగా వెలిగిపోతున్నాడు. ఆవేది ఆసమయాన చక్కగా ప్రజ్వలించింది.

ఇలా సమంత్రకంగా యజ్ఞం జరుగుతూ వుండగా ఆకాశాన భయానకమైన గొప్ప ధ్వని పుట్టింది. వర్షాకాలంలో మేఘాలు ఆకాశం అంతా కప్పుకుంటూ యెలా వస్తాయో, అలాగే మాయ చేస్తూ వచ్చి రాక్షసులు ఆకాశం అంతా నిండిపోయారు. మారీచుడూ సుబాహుడూ లెక్కలేనంతమంది రాక్షసులతో వచ్చి రక్తవర్షం కురిపించ సాగారు. ఆ రక్తం వేదిమీద పడింది. రామలక్ష్మణులు అది చూశారు. "ఆ" అని హుంకరిస్తూ మండిపడి వారు బయటికి వచ్చి ఆకాశాన ఆ రాక్షసులను చూశారు. "లక్ష్మణా! గాలితో మేఘాల నెగరగొట్టేటట్టు మానవాస్త్రం ప్రయోగించి యీ దుష్టులను ఎగరగొడతాను. చూడు" అని చెబుతూనే రాముడు పరమభాస్వరం అయిన అస్త్రంతో మారీచుని గుండెల మీద కొట్టాడు. ఆ మానవాస్త్రం నూరామడల దూరం యెగరగొట్టి, మారీచుణ్ణి సముద్రంలో కూలగొట్టింది. "లక్ష్మణా! మానవాస్త్రం, ప్రాణాలు తియ్యకుండా వాణ్ణెలా పీడిస్తోందో చుశావా? దయాధర్మాలు లేని యీ దుష్టరాక్షసులను కూడా వధించేస్తాను చూసుకో" అని చెప్పి రాముడు దివ్యమూ అద్భుతమూ అయిన ఆగ్నేయాస్త్రం సుబాహువు గుండెలమీద పెట్టి కొట్టాడు. వాయవ్యాస్త్రంతో కొట్టి తక్కినవాళ్ల నందరినీ కూడా నాశనం చేసి రాముడు మునులకు సంతోషం కలిగించాడు.

అది చూసి మహర్షు లందరూ అనేకవిధాల పొగడి రామలక్ష్మణులను పూజించారు. తరవాత యజ్ఞం పూర్తి అయింది. అప్పుడు విశ్వామిత్రుడు దిక్కు లన్నీ నిరుపద్రవంగా వుండడం చూసి "రామా! మహాబాహూ! నువ్వు గురువచనం చెల్లించావు. నిజంగా యిది సిద్ధాశ్రమం అనిపించుకుంది" అని చాలా ఆనందించాడు.

## ౨౬

## మిథిలకు ప్రయాణం

వచ్చిన పని చక్కగా నెరవేరడం వల్ల చాలా ఆనందించి ఆ రాత్రి గడిపారు. తెల్లవారగానే లేచి కాలకృత్యాలు తీర్చుకుని, బయలు దేరారు. అప్పటి కప్పుడే విశ్వామిత్రుడూ తక్కిన మునులూ స్నానమూ సంధ్యా జపమూ హోమమూ నెరవేర్చుకుని కూచుని వుండినారు. వెళ్ళివెళ్ళి రామలక్ష్మణులు వారి కందరికీ నమస్కరించి "మహర్షీ! ఇదే నీసేవకులం వచ్చివున్నాము, మే మేమి చెయ్యాలో ఆజ్ఞాపించు" అని విన్నవించుకున్నారు. దాని మీద మునులతో సంప్రదించి విశ్వామిత్రు డిలా చెప్పాడు.

"మిథిలాధిపతి అయిన జనకమహారాజు పరమధర్మిష్ఠమైన యజ్ఞం చెయ్యడానికి పూనుకుని వుండినాడు. మేము ఆ యజ్ఞం చూడడానికి వెడతాము. నువ్వూ కూడా మాతో వచ్చి, జనకుని దగ్గిర వున్న గొప్ప ధనుస్సు చూడాలి. దేవత లయినా ఆ ధనుస్సు ఎక్కుపెట్టలేరు. గంధర్వులూ, అసురులూ, రాక్షసులూ కూడా ఆపని చెయ్యలేరు. ఇక మనుష్యుల సంగతి చెప్పే దేమి వుంది? మహాబలవంతు లైన రాజపుత్రు లనేకులు ప్రయత్నించారు కాని ఏమీ చెయ్యలేకపోయారు. వెనకటి మిథిలాధిపతి అయిన దేవరాతు డొక యజ్ఞం చేసి దేవతలను మిక్కిలి ఆనందపరిచి, 'బల మైన ముష్టిబంధస్థానం గల గొప్ప ధనుస్సొకటి నాకు దయచెయ్యండి' అని కోరాడు. వెంటనే వారు అలాంటి ధనుస్సు అతని కిచ్చారు. అది శివధనుస్సు. దక్షయజ్ఞం ధ్వంసం చేసినప్పుడు వారి కది శివు డిచ్చి వుండినాడు. ధనురుత్సవాలలో పూజించబడే ధను స్సది!'

ఇలా చెప్పి విశ్వామిత్రుడు "మీకు క్షేమం అగుగాక. నేను సిద్ధి పొందాను; కనుక, యిక యీసిద్ధాశ్రమం విడిచి గంగానది ఉత్తరతీరాన గల హిమవత్పర్వతం దగ్గిరికి వెడతాను" అని వన దేవతలకు విన్నవించి, సిద్ధాశ్రమానికి ప్రదక్షిణ నమస్కారాలు చేసి, మునులతోనూ రామలక్ష్మణులతోనూ ఉత్తరంగా బయలుదేరాడు. నూరుబళ్లలో అగ్నిహోత్రాదిసంభారా లుంచుకుని బ్రహ్మవాదు లైన మునులు అతని వెంట బయలుదేరారు. సిద్ధాశ్రమంలో నివ సిస్తూ వుండిన మృగాలూ పక్షులూ కూడా వెంట బయలుదేరాయి. కొంత దూరం వెళ్లాక అతను సెలవిచ్చి వాటిని వెనక్కి పంపేశాడు.

పొద్దు వాలాటప్పటికి వా రందరూ శోణానది చేరుకున్నారు. వసతు లన్నీ యేర్పాటు చేసుకుని, సూర్యాస్తమయం కాగానే స్నానాలు చేసి అగ్నిహోత్రాలున్నూ చేసుకున్నారు. తరవాత అందరూ వొక చోట చేరుకున్నారు. రామలక్ష్మణులు అప్పుడు వారిమధ్య విశ్వా మిత్రునికి సమీపంగా కూచున్నారు. కొంత సంభాషణ జరిగాక రాముడు "మునిపుంగవా! సర్వసమృద్ధా లైన వనాలతో శోభి ల్లుతూ వుండిన యిది యేదేశం?" అని కుతూహలంతో అడగ్గా, అదంతా వివరంగా యిలా చెప్పాడు, విశ్వామిత్రుడు.

## ౨౧

## విశ్వామిత్రుని వంశచరిత్ర

"కుశు డనే బ్రహ్మపుత్రుడు ఒక డుండేవాడు. అతను మహాతపశ్శాలి దృఢవ్రతుడు. సకలధర్మాలూ తెలిసినవాడు. సజ్జనులను ఆదరించడం అంటే అతనికి చాలా ఆసక్తి. అతని భార్య విదర్భరాజపుత్రి. ఆమె కులీనురాలు. భర్తయే దైవం అని నమ్ముతున్నది ఆమె. ఆదంపతులకు

కుశాంబుడు కుశనాభుడు అధూర్తరజసుడు వసువు అని నలుగురు కొడుకులు పుట్టారు. వారు మహాతేజశ్శాలు లయినారు. ధర్మ నిరతులూ మహోత్సాహపరులూ కూడా అయినారు. అది గుర్తించి కుశలుడు 'పుత్రులారా! ప్రజలను పరిపాలించండి. దానివల్ల మీకు పుష్కలమైన ధర్మం లభిస్తుంది' అని చెప్పాడు.

వెంటనే వారిలో కుశాంబుడు కౌశాంబి అనే పట్నం నిర్మించుకుని రాజ్యపాలనం ప్రారంభించాడు. ధర్మాత్ముడైన కుశనాభుడు మహోదయం అనే పట్నం కట్టించి ప్రజాపాలనం సాగించాడు. అధూర్త రజసుడు ధర్మారణ్యం అనే పట్నమూ, వసువు గిరివ్రజ మనే పట్నమూ నిర్మించుకుని యేలుబడి ప్రారంభించారు.

మనం యిప్పుడు విశ్రమించి వుండిన యీప్రదేశం వసువు రాజ్యం లోది. అవిగో, అయిదు పర్వతాలు చూశావా? ఈశోణానది మగధ దేశంలో పుట్టి యీపర్వతాల మధ్య పూలదండ లాగ ప్రకాశిస్తోంది. ఈశోణానది తూర్పునుంచి పడమటికి ప్రవహిస్తోంది. దీనికి చేరివుండిన భూములు సుక్షేత్రాలు. ఈభూములలో సకలసస్యాలూ సమృద్ధిగా ఫలిస్తాయి.

రాజర్షి అయిన కుశనాభుడు ఘృతాచి అనే అప్సరసను చేపట్టాడు. వారికి మిక్కిలీ అందగత్తె లయిన నూరుగురు కూతుళ్లు పుట్టారు. దినదిన ప్రవర్ధమాన లయి యౌవనవతు లయిన ఆ కన్యలు ఒకనాడు చక్కగా అలంకరించుకుని ఉద్యానవనంలోకి వెళ్లి, పాడుకుంటూ, వీణలు వాయించుకుంటూ, నృత్యం చేస్తూ, వర్షాకాలంలో మెరుపుతీగల్లాగ ఆడుకుంటూ వుండగా సర్వాత్మకుడైన వాయుదేవుడు వాళ్లని చూసి 'నేను మిమ్మల్ని కామించాను. మీరందరూ నన్ను పెళ్లి చేసుకోవాలి. మనుష్యులను కోరకండి. నన్ను పెళ్లాడితే మీరు, మానవత్వం పోయి

చిరకాలం బతికి సుఖపడతారు. మనుష్యులకు యౌవనం స్థిరంగా వుండదు. కనక, మీరు నన్ను పెళ్లిచేసుకుంటే అక్షయ్యమైన పడుచుదనం పొందుతారు. మీకు అమరత్వమున్నా లభిస్తుంది' అని చెప్పాడు.

అది విని ఆకన్యలు నవ్వి 'సురశ్రేష్ఠుడా ! సర్వభూతాలలోనూ నువ్వు అంతశ్చరుడవయి ఉంటావు. నీప్రభావం మాకు తెలుసు. మమ్మల్ని ఎందు కవమానిస్తావూ ? మేము కుశనాభుని కూతుళ్లము. తలుచుకున్నామంటే మేము నిన్నూ నీప్రభు వయిన ఇంద్రుణ్ణి కూడా స్థానభ్రష్టులుగా చెయ్యగలం. కానీ అందుకోసం మేము మాతపస్సు వ్యర్థంచేసుకోము. మాతండ్రి అయిన కుశనాభుడు నీపాలిటికి యముడు కాకుండగాక. సత్యవాది అయిన మాతండ్రిని అవమానించకు. మాకు తండ్రే ప్రభువు. తండ్రే దైవతం. ఆయన మమ్మెవరి కిస్తాడో వారినే మేము పెళ్లిచేసుకుంటాము' అంటూ గట్టిగా మందలించారు.

అందుకు చాలా ఆగ్రహపడి వాయుదేవుడు వారి సర్వావయవాల్లోనూ ప్రవేశించి కీళ్లన్నీ పట్టు తప్పించి కుబ్జలనుగా చేశాడు. వెంటనే వాళ్లు అంతఃపురంలోకి వెళ్లి కూలబడి దుఃఖించసాగారు. అది చూసి కుశనాభుడు 'అమ్మాయిలూ! ఏమిటి ఇదంతా? ధర్మాతిక్రమణం చేసిన వాడెవడు ? ఎవరివల్ల మీ రిలా కుబ్జ లయి పోయా' రని అడిగాడు.

## ౨౯

## బ్ర హ్మ ద త్తు ని పె ళ్లి

అందుకా కన్యలు అతని పాదా లంటి 'తండ్రీ, సర్వాత్మకుడైన వాయుదేవుడు అధర్మపరుడై మమ్మల్ని అరికట్టాడు. నన్ను పెళ్లాడండి' అని కూడా పట్టుపట్టాడు. మాతండ్రి నడుగు ఆయన అంగీకరిస్తే

మేము పెళ్లాడతా మన్నాము. కాని ఆమాట వినిపించుకోక మమ్మల్నిలా చేశా' డని చెప్పారు.

మహాతేజశ్శాలి అయిన కుశనాభుడు అది విని 'బిడ్డలారా! మీరు మంచిపని చేశారు. క్షమావంతులు ఏదయినా అసందర్భం వచ్చినప్పుడు చూపించవలసింది క్షమే. మీరు ఒక్కమాటమీద వుండడమే కాకుండా నాకులం కూడా రక్షించారు. స్త్రీలకూ పురుషులకూ కూడా ఓర్పు అలంకారం. యాప్పైశ్వర్యసంపన్ను లైన దేవతలకున్నూ ఓర్పు దుష్కరం అయింది. అలాంటిది, ఇంతమంది మీరు ఏకకంఠంగా ఓర్పు చూపించడం సామాన్యమా? ఓర్పే దానం. ఓర్పే యజ్ఞం. ఓర్పే సత్యం. ఓర్పే కీర్తి. ఓర్పే ధర్మం. చరాచరాత్మకం అయిన జగత్తంతా ఓర్పువల్లనే నిలిచివుంది' అని వాళ్లని ప్రశంసించి, వాళ్ల వివాహం విషయమై మంత్రులతో ఆలోచించారు.

ఇక్కడ, యిది, యిలావుం గా, ఒకచోట చూళి అనే బ్రాహ్మణుడు అస్ఖలితబ్రహ్మచారి అయి గొప్ప తపస్సు చేస్తూ వుండినాడు. ఊర్మిళ కూతు రైన సోమద అనే గంధర్వకన్యక అతన్ని సేవిస్తూవుండింది. ఇలా చాలాకాలం గడిచాక చూళి "నీ సపర్యలకు చాలాసంతోషించాను. నావల్ల నీకు కావలసిం దేమయినా వుంటే కోరుకో" అన్నాడు.

సమయాసమయాలు చక్కగా గుర్తెరిగివుండిన ఆసోమద అందుకు చాలా కృతజ్ఞురా లయి 'మహాత్మా! నువ్వు బ్రహ్మవర్చస్కుడవై బ్రహ్మతో సమానుడవై ఉన్నావు. మహాతపశ్శాలి వయిన నువ్వు బ్రాహ్మం అయిన తప్పశక్తితో ప్రకాశించే కొడుకు నియ్యి. నేను భర్త లేనిదానను. ఇంతవరకూ నన్నెవ్వడూ పెళ్లాడి వుండలేదు. సర్వథా నేను బ్రాహ్మోపగతురాలను కనక, నువ్వు నాకు పుత్రదానం చెయ్యతగ్గవాడవు' అని విన్నవించుకుంది.

అందు కానందించి బ్రహ్మర్షి అయిన చూళి ఆమెకి మానసపుత్రు డైన బ్రహ్మదత్తుని ఇచ్చాడు. సోమద కొడుకైన ఆబ్రహ్మదత్తుడు సకలైశ్వర్యవంతుడై కాంపిల్యానగరంలో స్వర్గంలో దేవేంద్రుడు లాగ తేజరిల్లుతూ వున్నాడు. మంత్రుల ఆలోచన ననుసరించి కుశనాభుడు తన నూరుగురు కూతుళ్ళనూ బ్రహ్మదత్తున కివ్వడానికి స్థిరపరుచు కున్నాడు. మరిన్నీ మహారాజయిన బ్రహ్మదత్తుణ్ణి పిలిచి మంచి ముహూర్తాన పెళ్ళికూడా చేశాడు. బ్రహ్మదత్తుడు చేత్తో తాకినంతనే ఆ యువతులు నూరుగురూ కుబ్జత్వం పోయి యథాపూర్వంగా త్రిలోక సుందరు లయినారు. ఇలాగ తనకూతుళ్లు వాయువిముక్తలు కాగా కుశనాభుడు చాలా ఆనందించాడు. విలువగల కానుకలు బ్రహ్మదత్తునకూ, లెక్కలేనన్ని అరణపువస్తువులూ దాసదాసీలూ కూతుళ్ళకూ ఇచ్చి అతను వారిని పంపేశాడు.

గంధర్వాంగన అయిన సోమద తన కొడుక్కి తగిన భార్యలు దొరికినందుకు మిక్కిలీ సంతుష్టిచెంది మాటి మాటికీ కోడళ్ళను కౌగి లించుకుని ఆనందించింది. వియ్యంకు డైన కుశనాభుణ్ణి కూడా చాలా మెచ్చుకుంది.

## 30
## విశ్వామిత్రుడు కుశికవంశంవాడు

తనకూతుళ్ళను వెంటబెట్టుకుని అల్లుడైన బ్రహ్మదత్తుడు వెళ్లిపోయిన తరవాత, పుత్రసంతానం లేనందున కుశనాభుడు పుత్రకామేష్టి ప్రారం భించాడు. అది జరుగుతూ వుండగా, బ్రహ్మపుత్రుడూ, కుశనాభుని తండ్రీ అయిన కుశుడు 'నాయనా! నీకు తగిన కొడుకు పుడతాడు. అతను గాధి అనే పేరుగలవాడూ, సుధార్మికుడూ అవుతాడు. అతని వల్ల నీకు లోకంలో శాశ్వతం అయిన కీర్తి కలుగుతుంది' అని పరమో

దారంగా చెప్పి, ఆకాశమార్గాన బ్రహ్మలోకానికి వెళ్ళిపోయాడు. తరవాత కొంతకాలానికి కుశనాభునికి గాధి అనే కొడుకు పుట్టాడు. రామా ! పరమధార్మికుడైన ఆగాధి నాతండ్రి. కుశవంశంవాణ్ణి కనక నేను కౌశికు ణ్ణయినాను. సత్యవతి అని నా కొక్క అక్కవుండేది. ఆమె మిక్కిలీ సువ్రతురాలు. ఆమెభర్త ఋచకు డను మహాముని. ఆమె భర్తతో కూడా సశరీరంగా స్వర్గానికి వెళ్లిపోయి, మళ్లీ కౌశికి అనే నది అయి భూలోకంలో అవతరించింది. దివ్యరాలూ, పుణ్యోదకం కలదీ చక్కనిదీ అయిన నాఅక్క నదీరూపంగా హిమవంతుణ్ణి ఆశ్రయించి లోకానికి ఐహికాముష్మిక ఫలాలు సమకూరుస్తూ ప్రవహిస్తోంది. అంచేత నా అక్క అయిన కౌశికీనదిఒడ్డున నేను హిమవత్పర్వతం దగ్గిర నివసిస్తున్నాను. సత్యమునందూ, ధర్మమునందూ ప్రతిష్ఠితురాలు కావడం వల్ల ఆమెకి సత్యవతి అనే పేరు వచ్చింది. నేను యాగసిద్ధికోసం ఆమెని విడిచివచ్చి సిద్ధాశ్రమంలో సీధర్మమా అని సిద్ధు ణ్ణయినాను. ఇదీ యీ దేశచరిత్ర. ఇదీ నావంశ చరిత్ర. ఇదీ నా పుట్టు పూర్వోత్తరం. నువ్వు అడగడంవల్ల, ఇదంతా చెప్పవలసివచ్చింది. ఈకథలతో మనకి అర్ధరాత్రి దాటిపోయింది. నీకు శుభం అగుగాక, నిద్రాబద్ధకం లేకుండా రేపు మనం చాలాదూరం వెళ్ళవలసివుంది. ఆకు అల్లాడకుండా చెట్లు స్తిమితా లయినాయి. పక్షు లన్నీ నిద్రాముద్రితా లయినాయి. దిక్కు లన్నీ చీకట్లో మునిగిపోయాయి. సంధ్యాకాలం మెల్లిగా సమీపిస్తోంది. నక్షత్రాలతోనూ, గ్రహాలతోనూ అడవిలాగ నిబిడం అయివున్న ఆకాశం మెరిసిపోతోంది. అదే చల్లని కిరణాలతో చీకట్లు తరుముతూ, ప్రాణికోటికి ఆహ్లాదం కలిగిస్తూ చంద్రు డుదయించ బోతున్నాడు. గుడ్లగూబలు మున్న గు నిశాచరాలక్కడక్కడ తిరుగుతున్నాయి. యక్షులూ రాక్షసులూ మాంసాహారం కోసం ఇటూ అటూ తిరుగులాడుతున్నారు ” అన్నాడు.

అది విని మును లందరూ బాగుబా గని విశ్వామిత్రుని పూజించి "కుశికుల వంశం ధర్మపరాయణం. కుశవంశీయు లైన రాజు లందరూ బ్రహ్మతో సమాను లైన మహాత్ములు. మహర్షి ! వారిలో నువ్వు మణి పూసవు. కౌశికీనదికూడా వంశప్రతిష్ఠ పెంపు చేసింది " అని ప్రశంసించారు.

ఇలాగ ఆగొప్పమునులు ప్రశంసించాక శ్రీమంతు డైన విశ్వామిత్రుడు సూర్యు డ స్తమించునట్లు నిద్రించాడు. రామలక్ష్మణులున్నూ విశ్వామిత్రుని కొనియాడి నిద్రపోయారు.

## ३०

## గంగ దేవలోకానికి వెళ్ళడం

తెల్లవారింది. " రామా ! నీకు మంగళం అగుగాక. అదిగో, ఉదయం అయింది లే, బయలుదేరుదాం " అంటూ లేపగా, రాముడు లక్ష్మణునితో కూడా లేచి కాల్యకృత్యాలు తీర్చుకుని " ఈశోణానది జలం చాలా మంచిది. ఇసుకతిప్పలతో ఈనదిచాలా అందంగా వుంది. మనం యెలాగా వెళ్ళడం ? " అని అడుగుతూ బయలుదేరాడు. " అదిగో మునులు వెడుతున్నారు అదే దారి " అంటూ విశ్వామిత్రుడు ముందు బయలుదేరాడు. మునులున్నూ బయలుదేరారు.

దారిలో ఎన్నో విధా లయిన అరణ్యాలు చూస్తూ నడిచినడిచి వా రందరూ మధ్యాహ్నం అయేటప్పటికి నదులలో చాలా గొప్పదని పేరుపొందిన గంగానదిని చేరుకున్నారు. ఆగంగాజలం ఎలాంటి పాపాలయినా పోగొట్టగలదు. పుణ్యం కూడా ఇవ్వగలదు. ఆనదిలో హంసలూ బెగ్గురుపక్షులూ విలాసవిహారం చేస్తున్నాయి.

గంగ వొడ్డున వారు బస చేశారు. స్నానసంధ్యాద్యనుష్ఠాలున్నూ ముగించుకుని, పితృదేవతలను తృప్తిపరుచుకుని, అగ్నిహోత్రా

లున్నా చేసుకుని అమృతతుల్యం అయిన హవిస్సు పుచ్చుకున్నారు. తరవాత అందరూ విశ్వామిత్రునిచుట్టూ చేరారు.

అంతట రాముడు విశ్వామిత్రుణ్ణి చూసి "మహాత్మా! త్రిపథగామి అయిన ఈగంగ వృత్తాంతం వినాలని వుంది. ఇది ముల్లోకాలూ ఆక్రమించి నదాలనూ నదులనూ పతి అయిన సముద్రుణ్ణి ఎలా చేరు కుంది?" అని అడిగాడు.

విశ్వామిత్రుడిలా చెప్పాడు.

"రామా! ఇనుము, రాగి, బంగారం, వెండి మొదలయిన లోహాలకు ఉనికిపట్టయిన హిమవత్పర్వతానికి చక్కనిచుక్కలైన ఇద్దరు కూతుళ్ళున్నారు. అతని భార్య మనోరమ. ఆమె మేరుపర్వతం కూతురు. ఆమె చాలా చక్కనిది. ఆమె కూతుళ్ళే వారిద్దరూ. వారిలో గంగ పెద్దదీ ఉమాదేవి చిన్నదీనీ. దేవతలు వచ్చి 'దేవత లకు సకలార్థసాధనాలూ సమకూర్చగల గంగను మా కియ్యి' అని కోరారు. త్రిలోకహితం కోరి హిమవంతుడు 'సరే' అని స్వచ్ఛంద పథగామి అయిన గంగను వారి కిచ్చాడు. గంగను తీసుకుని దేవతలు వెళ్ళిపోయారు. రెండవపిల్ల ఉమాదేవి కఠినదీక్షతో ఉగ్రమైన తపస్సు చేసింది. అంచేత లోకనమస్కృతురా లయిన ఆమెను హిమ వంతుడు అనుకూలవరు డైన రుద్రుని కిచ్చి పెళ్ళిచేశాడు.

## ౩౭

## పార్వతి దేవతలను శపించడం

ఇదంతావిని రామలక్ష్మణులు "మహర్షీ! దివ్యమానుషసంభవం అయిన గంగ వృత్తాంతం మేమింకా వినవలసివుంది. గంగ మూడు మార్గాలుగా

ఎందుకు వెళ్ళింది. మూడు లోకాల్లోనూఆమె ఏమేమి చేసిందీ ?'' అని అడిగారు. దానికి విశ్వామిత్రు డిలా చెప్పాడు.

"రామా! మహాతపశ్శాలి అయిన నీలకంఠుడు పెళ్లిఅయిన తర వాత ఉమాదేవితో సంభోగం ప్రారంభించాడు. ఇలాగ వందలకొద్దీ సంవత్సరాలు గడిచాయి. కాని ఉమకు సంతానం కలగలేదు. అది తెలిసి దేవతలందరూ బ్రహ్మదేవునితో కలిసి 'ఉమకు పుట్టబోయే కొడుకు నెవరు భరించగలరూ ?' అని భయభ్రాంతులై ఈశ్వరుని దగ్గిరకే వెళ్లి సాష్టాంగపడి 'దేవదేవా! మహాదేవా! దేవతలమైన మమ్మందరినీ అనుగ్రహించు. సురోత్తమా! నీ తేజస్సువలన పుట్టే పుత్రుని లోకా లన్నీ కూడా భరించలేవు. కనక ఉమతో కూడా నువ్వు వేదోక్తమైన యోగం అవలంబించి తపస్సు చెయ్యి. ముల్లో కాలూ సుఖంగా వుండాలి కనక, నువ్వు నీ తేజస్సు నీలోనే వుంచుకో' అని ప్రార్థించారు.

అది విని సకలలోకాలకూ మహేశ్వరుడైన శివుడు 'సరే, తప్ప కుండా అలాగే చేస్తాను. నాలాగే ఉమాదేవి కూడా తన శోణితం తన యందే ధరించగలదు. మీరూ, భూమిన్నీ సుఖంగా వుండండి. అయితే నా రేతస్సు స్ఖలనం అయితే యెవరు ధరించగలరో అది చెప్పండి' అన్నాడు. దేవతలు 'ఈభూమి ధరిస్తుంది' అన్నారు. వెంటనే శివుడు రేతస్సు విడిచిపెట్టాడు. అరణ్యాలూ పర్వతాలూ నిండివుండిన భూమి అంతా ఆరేతస్సు వ్యాపించింది. అది చూసి దేవతలు 'వాయువుతో గలిసి నువ్వు శివతేజస్సు ప్రవేశించు' అని అగ్నితో చెప్పారు. అగ్ని అలాగే చెయ్యగా ఆరేతస్సు శ్వేతపర్వతం అయింది. తరవాత కాల క్రమాన అది రెల్లుగడ్డిన్నీ అయింది. మహా తేజశ్శాలి అయిన కుమారస్వామి ఆరెల్లువనంలోనే పుట్టాడు. అప్పుడు

దేవతలు మహర్షులతో కలిసి సుప్రీతులై ఉమాదేవినీ శివుణ్ణీ మిక్కిలీ పూజించారు.

కాని ఉమాదేవి చాలా కోపించి నిప్పులు కక్కుతూ చూస్తూ 'సంతానేచ్ఛతో జరుగుతూ వున్న సంభోగం మీరు నివారించారు; కనక, మీకు మీస్వభార్యలయందు సంతానం కలక్కుండా వుండు గాక' అని దేవతలనూ, 'భూమీ! నీకొక్క రూపం లేకుండుగాక. నువ్వు అనేకులకు భార్యవై పడివుందువుగాక. నాకు కొడుకు లేకుండా చేశావు కనక, కొడుకువల్ల కలిగే ఆనందం నీ కెప్పుడూ సంభవించ కుండా వుండుగాక' అని భూమినీ కఠినంగా శపించింది. అది విని దేవత లందరూ సిగ్గుపడిపోయివుండడంచూసి వరుణపాలితం అయిన పశ్చిమంగా బయలుదేరిపోయి హిమవత్పర్వత పార్శ్వమున గల ఒక పర్వతంమీద ఉమాదేవితో కూడా శివుడు తపస్సు ప్రారంభించాడు. రామా! ఇది ఉమాదేవి కథ. ఇక గంగాదేవి కథ చెబుతాను విను."

## 33

## కుమారస్వామి పుట్టడం

"దేవతలందరూ ఇంద్రునితోనూ అగ్నిహోత్రునితోనూ కలిసి బ్రహ్మ దగ్గిరికి వెళ్లి 'దేవా! నువ్వు మాకు శత్రుసంహారదక్షుడైన సేనాధి పతిని అనుగ్రహించావు; కాని అతను ఇంకా పుట్టనే లేదు. పైగా, భగవంతుడైన శివుడు హిమవచ్ఛిఖరంమీద ఉమాదేవితో కూడా గొప్ప తపస్సు చేస్తున్నాడు. అంచేత, ఇప్పుడు చెయ్యవలసిం దేమో ఆలోచించి లోకాలను రక్షించు. నువ్వే మాకు గతి' అని ప్రార్థిం చారు. దానిమీద బ్రహ్మ తియ్యనిమాటలతో వారిని ఓదార్చి 'ఉమాదేవి మిమ్ము శపించింది. కనక, మీభార్యలయందు మీకు

సంతానం కలగదు. ఉమాదేవి మాట జరిగితీరుతుంది కాని పొల్లు కాదు. ఇది సత్యం. ఇందులో సంశయం ఎంతమాత్రమూ లేదు. ఇదే, ఆకాశంలో ప్రవహించే గంగానది చూడండి. మీకు సేనాధిపతి కావలసిన మహావీరుణ్ణి అగ్నిహోత్రుడు ఆకాశగంగయందు పుట్టించగలడు. హిమవంతుని పెద్దకూతురైన గంగ అగ్నివల్ల తప్పకుండా కుమారుణ్ణి కంటుంది. ఉమాదేవికి అది ఇష్టమున్నూ అవుతుంది. సందేహం లేదు' అని చెప్పాడు.

అప్పుడు దేవతలందరూ బ్రహ్మను పూజించి ధాతుశోభితం అయిన కైలాసపర్వతానికి వెళ్లి 'దేవా! ఇది దేవకార్యం. కనక, యిది నెరవేర్చు. శైలపుత్రిక అయిన గంగాదేవియందు నువ్వు ధరించి వున్న మహాదేవుని రేతస్సు విడిచిపెట్టు' అని కోరారు.

వెంటనే అగ్ని గంగదగ్గిరికి వెళ్లి 'దేవీ! నువ్వు గర్భం ధరించు, ఇది దేవతలకు మిక్కిలి ప్రియమైనది' అని చెప్పాడు. ఆమాట విని గంగ చక్కని స్త్రీరూపం ధరించి రాగా అగ్ని ఆ సౌందర్యం చూసి అన్ని అవయవాలనుంచీ విడిచి గంగ స్రోతస్సులన్నీ శివరేతస్సుతో నింపాడు. కాని 'అగ్నీ, నే నీ తేజస్సు భరించలేను' అంది. అయితే, ఈ హిమవత్పర్వతపాదంమీద గర్భం ఉంచు' అని అగ్ని చెప్పాడు. ఆమాటమీద గంగాదేవి పరమభాస్వరం అయిన గర్భం స్రోతస్సులనుంచి విడిచిపెట్టింది. గంగ విడిచిన శివరేతస్సు భూమిమీద పడడంవల్ల బంగారమూ, వెండీ, రాగీ, ఉక్కూ, తగరమూ, సీసమూ పుట్టాయి. మరిన్నీ అశ్వేతపర్వతం అంతా రెల్లువనంతో కూడా బంగారం అయిపోయింది. బంగారం అదిమొదలు అగ్ని లాగ మెరుస్తూ జాతరూపం అని పేరుపొందింది.

ఇంద్రాది దేవతలు, కుమారుడు పుట్టగానే పాలిచ్చి పెంచాడనికి షట్కృత్తికలనూ ఏర్పాటుచేశారు. 'ఈబిడ్డ మా ఆరుగురికీ కొడుకే' అని సమయం చేసుకుని కృత్తికలు అతన్ని పెంచడాని కున్ముఖు లయి నారు. అదిచూసి దేవతలు 'కుమారుడు కార్తికేయు డనిన్నీ పేరు పొందుతాడు. త్రిలోకాలయందూ విఖ్యాతుడున్నూ అవుతా' డన్నారు. అప్పుడు గర్భపరిస్రావం కాగా స్కన్ను డైన బాలుణ్ణి కృత్తికలు స్నానం చేయించారు. అగ్నిహోత్రం లాగ ప్రకాశిస్తున్న ఆ కుమా రుడు స్కన్ను డైనాడు కనక దేవతలు స్కందు డనిన్నీ పేరుపెట్టారు. వెంటనే కృత్తికలకు పాలు పుట్టాయి. కుమారుడు ఆరు మొగాలు కలవాడై ఏకకాలంలో ఆరుగురి పాలూ తాగి, సుకుమారదేహుడే అయినా తన అఖండపరాక్రమం వల్ల రాక్షససేనల నన్నిటినీ జయిం చాడు. అగ్నిని పురస్కరించుకుని దేవత లందరూ కుమారుణ్ణి దేవ సేనాధిపత్యం యిచ్చి అభిషేకించారు. రామా! గంగ వృత్తాంతం యిదీ. పుణ్యప్రదమైన కుమారస్వామి జననం ఈవిధంగా జరిగింది. ఇక్ష్వాకు వంశవర్ధనా! కార్తికేయు డైన కుమారస్వామి యెడల భక్తి గల మానవుడు ఇహలోకంలో దీర్ఘాయువూ అష్టైశ్వర్యాలూ అనుభవించి చివరికి స్కందసాలోక్యసిద్ధి పొందుతాడు."

## 38

## సగరునికి అరవైవేలమంది కొడుకులు పుట్టడం

విశ్వామిత్రుడు గంగా వృత్తాంతమూ కుమారస్వామి జనన విధమూ చెప్పి యింకా ఇలా చెప్పాడు.

"రామా! పూర్వం సగరు డనే రాజు అయోధ్యాధిపతి అయి ప్రజాపాలనం చేస్తూ వుండేవాడు. అతను గొప్పశూరుడు. ధర్మా

త్ముడు ; కాని అతనికి సంతానం లేకపోయింది. అతని కిద్దరు భార్యలు. విదర్భరాజు కూతు రైన కేశిని పెద్దభార్య. ఆమె ధర్మాత్మురాలు. సత్యవాదిని. అరిష్టనేమి కూతురు డైన అరిష్టనేమి కూతురు సుమతి రెండో భార్య. ఆమె చాలా చక్కనిది. అంత చక్కని స్త్రీ భూమి మీద మరి లేదు. వారిద్దరితోనూ కలిసి సగరుడు హిమవత్పర్వతానికి వెళ్ళి భృగుమహర్షి నివసిస్తున్న ప్రత్యంతపర్వతం అయిన ప్రస్రవణగిరిమీద తపస్సు చేశాడు. అతిదీక్షతో అతను వందసంవత్సరాలు తపస్సు చెయ్యగా, సత్యవంతులలో ఉత్తము డైన భృగుమహర్షి చాలా ఆనందించి 'రాజా! నీకు గొప్ప సంతానం కలుగుతుంది. లోకంలో సాటిలేని యశస్సుకూడా నీకు లభిస్తుంది. అయితే, నీభార్యలలో ఒకామె వంశకరు డైన ఒక్క కొడుకును కంటుంది. ఇంకొకామె అరవై వేలమంది కొడుకులను కంటుంది' అని అనుగ్రహించాడు.

ఆమాట విని రాజు భార్యలు చాలా సంతోషించి దోసిలి యొగ్గి 'మహాత్మా, మాలో, ఒక్కకొడు కెవరికి పుడతాడు, అరవై వేలమంది యెవరికి పుడతారు ?' అని అడిగారు. దానిమీద పరమధార్మికు డైన భృగుమహర్షి 'అది మీ ఇష్టం. వంశకరు డైన వొక్క కొడు కెవరికి కావాలో, మహాబలవంతులూ కీర్తిమంతులూ మహోత్సాహులూ అయిన అనేక వేలమంది యెవరికి కావాలో మీలో మీరే నిర్ణయించుకుని చెప్పండి' అన్నాడు. సగరుని మొదట పెద్దభార్య అయిన కేశిని 'అయితే నాకు వంశకరు డైన ఒక్క కొడుకే కావాలి' అంది. చిన్నభార్య అయిన సుమతి 'అరవై వేలమంది కొడుకులే కావా' లంది.

అంతట సగరుడు భార్యలతో గూడా భృగుమహర్షికి ప్రదక్షిణ సాష్టాంగనమస్కారాలు చేసి, అనుజ్ఞ పొంది తన పట్నానికి వెళ్ళి పోయాడు. కొంతకాలానికి పెద్దభార్య ఒక్క కొడుకును కన్నది.

ఆబాలునికి అసమంజుడు అని పేరుపెట్టారు. చిన్నభార్య ఆనపకాయ వలె గుండ్రని గర్భపిండం కన్నది. ఆపిండం బద్దలుచెయ్యగా అందులో నుంచి అరవై వేలమంది కొడుకులు పుట్టుకువచ్చారు. దాదులు ఆ బాలురను నేతికుండలలో వుంచి పెంచారు. కాలక్రమాన వారందరూ యౌవనవంతు లయినారు. జ్యేష్ఠు డైన అసమంజుడు సుమతి కొడుకుల నందర్నీ సరయూనదికి తీసుకుపోయి బలవంతాన వాళ్ళని ముంచి ఏడిపిస్తూ నవ్వుతూ వుండేవాడు. తమ్ములనే కాక సజ్జను లైన పౌరులను కూడా అనేకమందిని పీడిస్తూ వుండేవాడు. అది చూసి సగరుడు భరించలేక అసమంజుణ్ణి పట్నాన్నుంచి తరిమివేశాడు. అసమంజుని కొడుకు అంశుమంతుడు. అతను బలపరాక్రమశాలి. అందరికీ యిష్టుడై అందరితోనూ ప్రీతిగా మాట్లాడేవాడు.

తరవాత చాలా కాలానికి యజ్ఞం చెయ్యాలని సగరునికి కోరిక పుట్టింది. ఋత్విక్కుల నందరినీ చేర్చుకుని అతను యాగం ప్రారంభించాడు.

## 3X

## సగరపుత్రులు యజ్ఞీయాశ్వంకోసం భూమండలం తవ్వడం

“మహాత్మా! సగరుడు మా వంశానికి కూటస్థుడు. అతను చేసిన యజ్ఞం సంగతి వింటాము సవిస్తరంగా వివరించు” అని రాముడు కోరగా విశ్వామిత్రుడు వికసితవదనుడై యిలా చెప్పాడు.

“రామా! శివుని మామ అయిన హిమవత్పర్వతమూ వింధ్య పర్వతమూ ఒకదానొకటి చూసుకుంటున్నాయి. ఆ రెండు పర్వతాలకూ మధ్య వుండే భూమే యజ్ఞాలు చెయ్యడానికి తగినది కనక సగరుని యజ్ఞం అక్కడే జరిగింది. గొప్ప ధానుష్కుడూ మహారథుడూ అయిన అంశుమంతుడు తాత ఆజ్ఞ ననుస

రించి గుర్రంతో కూడా దేశం అంతా తిరిగివచ్చాడు. అశ్వమేధ యాగంలో అంతర్భాగం అయిన ఉక్థ్యం అనే పర్వ జరుగుతూ వుండగా దేవేంద్రుడు రాక్షసరూపంతో వచ్చి ఆగుర్రం తీసుకు పోయాడు. అది చూసి ఋత్విక్కులు ' రాజా గుర్రం దొంగిలించ బడ్డది. ఆగుర్రం లేకపోతే యజ్ఞం భంగపడిపోతుంది. ఇది నీకూ మాకూ కూడా మంచిది కాదు. కనక, దొంగను పట్టుకుని గుర్రాన్ని మళ్ళీ రప్పించు ' అని చెప్పారు.

అది విని సగరుడు తన అరవై వేలమంది కొడుకులనూ చూసి ' మహా నుభావులైన ఋత్విజులు నడిపిస్తున్న యీ యజ్ఞంలో రాక్షసులకు ప్రవేశం లేదు. కనక, మీ రంతా బయలుదేరిపోయి గుర్రాన్ని దొంగిలించుకుపోయిన వాణ్ణి వెదికి పట్టుకోండి. సముద్రమధ్యస్థ మైన భూమండలం అంతా వెదకండి. ఒక్కొక్క ఆమడ వెడల్పుగల భూభా గానికి ఒక్కొక్కడు చొప్పున బయలుదేరిపోయి మీరందరూ గుర్రం కనపడేదాకా భూమి త్రవ్విపారవెయ్యండి. గుర్రంవచ్చేదాకా పౌత్రు డైన అంశుమంతునితోనూ ఋత్విక్కులతోనూ నే నిక్కడే వుంటాను, పోయిరండి. మీకు భద్రం అగుగాక ! ' అని చెప్పాడు.

సాగరు లందరూ తండ్రి ఆజ్ఞ ననుసరించి బయలుదేరి వజ్రాలవంటి గోళ్ళతోనూ, పిడుగులవంటి శూలాలతోనూ దారుణా లైన నాగళ్ళ తోనూ తవ్వసాగారు. ఆ దెబ్బలతో భూమి మోగిపో సాగడమే కాకుండా నాగులూ, రాక్షసులూ, మానవులూ కూడా గోలపెట్ట సాగారు. ఇలాగ సాగరులు అరవై వేల ఆమడల భూమి పాతా ళందాకా తవ్వారు. మొత్తానికి పర్వతాలతో నిండివుండిన జంబూ ద్వీపం అంతా వారు తవ్వుకుపోతూ తిరిగారు.

అంతట దేవతలు గంధర్వులతోనూ, అసురులతోనూ, పన్నగుల తోనూ, భయభ్రాంతు లయి బ్రహ్మదగ్గిరికి పోయి ' దేవా ! సగరుని

కొడుకులు భూమి అంతా తవ్వుకుంటూ పోతున్నారు. వారి చేతిలో బడి మహాత్ము లనేకులు చచ్చిపోతున్నారు. 'వీడే మా యజ్ఞం భంగపరిచిన వాడు. వీడే మాయజ్ఞియాశ్వం దొంగిలించిన వాడు' అంటూ 'కనపడ్డ వారి నందరినీ చంపుకుంటూ పోతు న్నారు' అని గోలపెట్టారు."

## ౩౬

## సగరపుత్రులు భస్మం అయిపోడం

ఆమాటలు విని బ్రహ్మదేవుడువారిని ఆశ్వాసించి 'ఈభూమి అంతా వాసుదేవునిది. ఆవాసుదేవుడు కపిలావతారం ధరించి భూమిని భరిస్తు న్నాడు. సగర పుత్రులు కపిలుని కోపాగ్నివల్ల దగ్ధం అయిపోతారు. ఇది కల్పాంతం. ఇలాంటి సమయాలలో భూమికి ఈఅవస్థతప్పనిదే. సగరపుత్రుల వినాశం కూడా తప్పనిదే' అని చెప్పాడు. ఎనమండు గురు వసువులూ, ఏకాదశరుద్రులూ, ద్వాదశాదిత్యులూ, అశ్వినీ దేవత లిద్దరూ – మొత్తం ఈముప్పయి ముగ్గురు దేవతలూ ఈ మాటలు విని ఓరిమిపట్టి అనుచరులతో కూడా వచ్చినవారు వచ్చి నట్టే వెళ్లిపోయారు.

సగరపుత్రులు భూమి తవ్వుతూ వుండగా ఉత్పాతం వచ్చినట్టు పెద్ద ధ్వని వినిపించింది. అయినా, వారు చేతనైనంతవరకూ ప్రదక్షి ణంగా భూమి త్రవ్వి, తండ్రి దగ్గిరకి పోయి 'తండ్రీ! భూమి అంతా తిరిగాము. దేవతలలోనూ దానవులలోనూ రాక్షసులలోనూ పిశాచాల లోనూ ఉరగులలోనూ కిన్నరులలోనూ గుర్రాన్ని తీసుకు పోతగ్గ వాళ్ళని మాకు తోచిన బలవంతుల నందరినీ సంహారించాము; కాని గుర్రమూ, గుర్రపుదొంగా కూడా కనపడలేదు. ఇక మే మేమి

చెయ్యమూ ?' అని అడిగారు. అది విని సగరుడు మండిపడ్డాడు. 'భూమి అంతా మళ్ళీ తవ్వండి. దొంగా గుర్రమూ దొరికి తేనే తిరిగి రండి, పొండి' అని కఠినంగా చెప్పాడు.

సగరపుత్రులు తవ్వపని మళ్లీ అందుకున్నారు. తవ్వగా తవ్వగా పాతాళంలో వారికి పర్వతం అంత యేనుగొకటి కనపడింది. అది దిగ్గజం. దాని పేరు విరూపాక్షం. పర్వతాలూ నదులూ అడవులూ మొదలైన అన్నిటితోనూ నిండివున్న భూమిని మోస్తూ వుంది ఆ దిగ్గజం. ఉండివుండి చాలాకాలాని కొక్కొక్కమాటు అది శ్రమతీర్చుకోడానికి తల వూపుకుంటూ వుంటుంది. అలాంటప్పుడు భూకంపం తటస్థించుతూ వుంటుంది. సగరపుత్రులు దానికి భక్తితో ప్రదక్షిణనమస్కారాలు చేసి పాతాళం దాకా తవ్వకుంటూ దక్షిణంగా వెళ్లారు. అక్కడ కూడా వారికి అలాంటిదే మరో యేనుగు కనపడింది. అది దక్షిణ దిగ్గజం. దాని పేరు మహాపద్మం. అదిన్నీ భూమిని మోస్తూ వుంది. దానికిన్నీ భక్తితో ప్రదక్షిణనమస్కారాలు చేసి వారు మళ్లీ తవ్వకుంటూ పడమరగా వెళ్లారు. అక్కడ కూడా వారి కలాంటి యేనుగు కనపడింది. అది పశ్చిమదిగ్గజం. దాని పేరు సౌమనసం. అదిన్నీ భూభారం వహిస్తోంది. వారు దానికిన్నీ ప్రదక్షిణనమస్కారాలు చేసి 'క్షేమమే కదా ?' అని కుశలం అడిగి తట్టి మళ్లీ తవ్వకుంటూ ఉత్తరంగా వెళ్లారు. అక్కడ కూడా వారికి పర్వతంవంటిదే బంగారం లాగ మెరుస్తున్న దిగ్గజం కనపడింది. దాని పేరు భద్రం. అదిన్నీ భూభారం వహిస్తోంది. దానినిన్నీ తట్టి వారు ప్రదక్షిణనమస్కారాలు కూడా చేసి భూమి తవ్వకుంటూ ఈశాన్యంగా వెళ్లారు.

ఏదిశగా వెళ్లినా గుర్రం అయినా కనబడకుండా వుండడంవల్ల వారు క్రోధంవచ్చి భీమబలులూ మహావేగులూ కనక తవ్వపని అతిదారు

ణంగా సాగించారు. చివరికి అక్కడ వాసుదేవుని సనాతనావతారం అయిన కపిలుడు కనపడ్డాడు. అతనికి దగ్గిరదగ్గిరగా తిరుగుతూ గడ్డి మేస్తూ సగరుని యజ్ఞీయాశ్వం కూడా కనపడింది. వెంటనే వారు కపిలుడే దొంగ అని నిర్ధారణ చేసుకుని క్రోధపరవశులై గునపాలూ నాగళ్లూ రాళ్లూ రప్పలూ పుచ్చుకుని 'నిలునిలు, మాగుర్రాన్ని దొంగిలించిన దుర్బుద్ధివి నువ్వే. నువ్వు దొరికిపోయావు. మేమెవర మనుకున్నావో సగరపుత్రులం' అని పెడబొబ్బలుపెట్టుతూ కొట్ట బోయారు. అదంతా చూసీ వినీ అతిరోషావిష్టుడై కపిలుడు 'ఆ' అంటూ హుంకరించాడు. దాంతో సగరపుత్రు లందరూ చూస్తూ వుండగా బూడిదరాసు లయి పడిపోయారు."

## 32

## అశ్వమేధం - సగరుడు స్వర్గానికి పోవడం

"ఎన్నాళ్లకీ కొడుకులు తిరిగీ రాకపోవడం చూసి, సగరుడు, దివ్య తేజోభిరాముడూ మనమడూ అయిన అంశుమంతుణ్ణి 'నాయనా! నువ్వు మహాశూరుడవు. శస్త్రాస్త్రవిద్యలు క్షుణ్ణంగా తెలిసినవాడవు. బలపరాక్రమాలలో మన పూర్వీకులకు సాటివస్తావు. నీపినతండ్రులు వెళ్లి చాలాకాలం అయింది. వెళ్లి వెదికి వారినీ తీసుకురా. గుర్రపు దొంగనిన్నీ పట్టుకుతీసుకురా. పాతాళంలో వుండే సత్వాలు చాలా బలం కలవి. వాటిని జయించవలసివస్తుంది కనక అస్త్రశస్త్రాలు ధరించి మరీ వెళ్లు. నమస్కరించతగ్గవారికి నమస్కారం చెయ్యి. విఘ్నం చెయ్యబోయేవాళ్లని నరికిపారవెయ్యి. వెళ్లినపని చక్కగా నెరవేర్చు కుని నాయజ్ఞం పూర్తి అయేటట్టు తిరిగిరా' అని ఆజ్ఞాపించాడు.

తాత యిలా చెప్పగా, అంశుమంతుడు ధనుస్సూ బాణాలూ ఖడ్గమూ ధరించి వెళ్లి తండ్రులు తవ్విన గోతులలోనుంచి పాతాళాని కి చేరుకున్నాడు. అక్కడ దిగ్గజం కనపడింది. దైత్యులూ దానవులూ రాక్షసులూ పిశాచాలూ పక్షులూ పన్నగులూ ఆ దిగ్గజాన్ని పూజిస్తున్నారు. తానున్నూ దానికి ప్రదక్షిణ నమస్కారాలు చేసి, కుశలమున్నూ అడిగి, అంశుమంతుడు తన తండ్రుల సంగతీ గుర్రపువాంగ సంగతీ చెప్పమని కోరాడు. దానికి ఆదిగ్గజం 'అంశుమంతుడా! నువ్వు కృతార్థుడవు అవుతావు. గుర్రాన్ని కూడా తీసుకువెళతావు' అని చెప్పింది. ఆమాట విని తక్కిన దిగ్గజాలను కూడా అలాగే పూజించి అతను వాటినన్నీ అలాగే అడిగాడు. అవి కూడా 'నువ్వు కృతార్థుడవు అవుతావు. గుర్రాన్ని తీసుకువెడతావు' అని చెప్పాయి.

తరవాత, అంశుమంతుడు తన పినతండ్రు లందరూ బూడిద అయి పడివుండిన చోటికి వెళ్లాడు. ఆ భస్మరాసులు చూసి అతను చాలా దుఃఖించాడు. అలా దుఃఖిస్తూనే — శోకిస్తూనే అతను సమీపంగానే అటూ యిటూ తిరుగుతూ వున్న గుర్రాన్ని చూశాడు. తన పినతండ్రులకందరికీ తర్పణం చేద్దామని అతను ప్రత్నించాడు; కాని అతనికి జలాశయం ఏదీ కనబడలేదు. దాంతో అతను దిగులుపడిపోయి అటూ యిటూ చురుగ్గా చూశాడు. సాగరులకు మేనమామా, ఖగపతీ అయిన గరుడుడు అంశుమంతుణ్ణి చూసి 'పురుషవ్యాఘ్రా! విచారించకు. నీపినతండ్రుల మరణం లోకశాంతికి అగత్యం అయింది. మహాబలవంతులైన సాగరు లందరూ అప్రమేయు డైన కపిలునివల్ల భస్మం అయిపోయారు. వీరికి నువ్వు లౌకికజలంతో తర్పణంచెయ్యగూడదు. హిమవంతుని పెద్దకూతు రైన గంగానదిలో వారికి తర్పణం చెయ్యి. లోకపావని అయిన గంగాదేవి వీరిని తడపగలదు. ఈభస్మరాసులు గంగాజలంతో తడిస్తే నీ పినతండ్రులు స్వర్గసుఖం పొందుతారు.

ఇప్పటికి నువ్వు గుర్రాన్ని తీసుకువెళ్ళి మీ తాతగారి యజ్ఞం పూర్తి చేయించు' అని చెప్పాడు.

ఆమాటమీద అంశుమంతుడు గుర్రాన్ని తీసుకువెళ్ళి సగరునికి అప్పగించి జరిగిన సంగతీ, గరుడుడు చెప్పినమాటలూ విన్నవించాడు. కొడుకులు పోయినందుకు చాలా విచారించినా సగరుడు యథా శాస్త్రంగా అశ్వమేధం నిర్వర్తించుకొని పట్నం ప్రవేశించాడు. గంగను తీసుకురావా లంటే అతని కుపాయం తోచలేదు. తరవాత అతను ముప్ఫయివేల సంవత్సరాలు రాజ్యం చేశాడు. బతికివుండినంత కాలమూ అతను ఉపాయాలు వెతుక్కుంటూనే వుండినాడు; కాని ఏమీ చెయ్యలేక చివరికి కాలంచేశాడు.

## ౩౮

## భగీరథుడు గంగకోసం తపస్సు చెయ్యడం

సగరుడు చనిపోగా మంత్రులు ధార్మికుడైన అంశుమంతునికి పట్టాభిషేకం చేశారు. అంశుమంతుడు గొప్పరాజని ప్రఖ్యాతిపొందాడు. అతని కొడుకు దిలీపుడు. దిలీపునికి పట్టాభిషేకం చేసి అంశుమంతుడు హిమవత్పర్వతానికి వెళ్ళి పన్నెండువేల సంవత్సరాలు ఘోరతపస్సుచేసి స్వర్గానికి వెళ్ళిపోయాడు. తాతల దుర్మరణం సంగతి తెలుసుకుని దిలీపుడు చాలా విచారించాడు. 'గంగను తీసుకురావడం యెలాగ ? వారికి గంగా జలంతో తర్పణం చెయ్యడం యెలాగ ? వారినెలాగ తరింప చెయ్యడం' అని అతను చాలాఆలోచించాడు; కాని ఉపాయం తోచలేదు. ఇలా విచారణచేస్తూ వుండగానే అతనికొక కొడుకు పుట్టాడు. అతనే పరమ ధార్మికుడైన భగీరథుడు. దిలీపుడు ఎన్నో యజ్ఞాలు చేశాడు. ముప్ఫయి వేల సంవత్సరాలు రాజ్యం కూడా చేశాడు, అయినా తాతల నుద్ధరించ

డాని కతనికి దారి దొరకలేదు. ఇంతలో జబ్బుచేసి అతను కాలధర్మం పొందాడు. తాను చేసిన పుణ్యకార్యాలవల్ల అతను స్వర్గలోకానికి వెళ్ళిపోయాడు. జబ్బు చెయ్యక పూర్వమే అతను భగీరథునికి రాజ్యాభిషేకం చేశాడు. భగీరథునికి సంతానం లేదు. ఎన్ని ఉపాయాలు పన్నినా అతనికి సంతానవాంఛ తీరలేదు. చివరికి అతను గంగ నయినా తీసుకురావా లని దృఢనిశ్చయం చేసుకుని తపస్సు ప్రారంభించాడు. తపస్సుకోసం అతను గోకర్ణం అనే క్షేత్రానికి వెళ్ళాడు. జితేంద్రియుడై ఊర్ధ్వబాహుడై నెలకొక్క పూటే భోజనం చేస్తూ పంచాగ్ని మధ్యంలో వెయ్యి సంవత్సరాలు తపస్సు చేశాడు.

అందు కానందించి బ్రహ్మ సురసమూహాలతో కూడా వచ్చి 'రాజా! నీ నిష్ఠకు మెచ్చుకున్నాను. నీకేమి కావాలో కోరుకో' అన్నాడు. అప్పుడు భగీరథుడు వినయవినమ్రుడై దోసిలొగ్గి 'దేవ దేవా! నీకు నామీద అనుగ్రహం వున్నట్టయితే — నేను చేసిన తపస్సుకు ఫలం వుండేటట్టయితే సగరుని కొడుకులు అరవై వేలమందీ నావల్ల ఇన్ని నీళ్లు పొందినవాళ్లు కావాలి. గంగాజలంతో తమ భస్మరాసులు తడిస్తే వారు స్వర్గానికి వెళ్లిపోతారు. మరిన్నీ నేను సంతానరహితుణ్ణి. ఇక్ష్వాకువంశ వృద్ధికోసం నాకు సంతానమున్నూ దయచెయ్యి' అని కోరాడు.

అందు కానందించి బ్రహ్మదేవుడు 'భగీరథుడా! నీకోరిక చాలా గొప్పది. నీకు భద్రం అగుగాక. నీకోరికలు నెరవేరుగాక. హిమవంతుని పెద్దకూతురైన గంగను భరించగలవాడు శివుడు తప్ప మరొకడు లేడు. గంగ ఆకాశంనుంచి పడితే' భూమి భరించలేదు; కనక, అందుకు ఈశ్వరుణ్ణి నియోగించు' అని భగీరథునితో చెప్పి 'భగీరథుడు ఎప్పుడు కోరితే అప్పుడు నువ్వు అతనితో భూలోకానికి

వెళ్లు ' అని గంగకున్నూ ఆజ్ఞాపించి దేవగణాలతో తన లోకానికి వెళ్లిపోయాడు.

## ౩౮

## గంగానది భూలోకంలో ప్రవహించడం

"ఇలా చెప్పి బ్రహ్మదేవుడు వెళ్ళిపోయాక, భగీరథుడు, రాత్రింబగళ్లు కుడికాలి బొటనవేలిమీద నిలిచివుండి గాలిమాత్రమే భక్షిస్తూ ఊర్ధ్వ బాహుడై స్థాణువు లాగ కదలకండా ఒక్క సంవత్సరం ఘోరతపస్సు చేశాడు. అప్పటికి పరమప్రీతుడై సర్వలోకనమస్కృతుడూ ఉమా పతీ అయిన మహేశ్వరుడు సాక్షాత్కరించి 'రాజా! నీ ఘోర తపస్సువల్ల ప్రీతుణ్ణయినాను. నీకోరిక చొప్పున గంగను శిరసావహిస్తా ' నని చెప్పాడు.

వెంటనే, హైమవతి అయిన గంగాదేవి మహారూపం ధరించి, దుస్సహావేగంతో ఆకాశంనుంచి పరిశుద్ధమైన శివుని శిరస్సున ఉరికింది; మరిన్నీ ఆగంగ 'ప్రవాహంలో పడగొట్టి అతివేగంగా శంకరుణ్ణి పాతా ళానికి తీసుకుపోతాను ' అనిన్నీ అనుకుంది; కాని ఆగర్వం గుర్తించి శివుడు క్రుద్ధుడై 'గంగను మాయంచేసేస్తా' నని నిశ్చయించు కున్నాడు.

హిమవత్పర్వతం లాగ మహోన్నతమైన శివశిరస్సున జటామండ లంలో వురికింది గంగ కాని భూమిమీద కురకలేక ఆజటామండ లంలోనే నిలిచిపోయింది. మరిన్నీ గంగ ఎన్నో సంవత్సరాలు గిరగిర తిరుగుతూ అక్కడే వుండిపోయింది.

గంగ ఆకాశంనుంచి వురికింది; కాని భూమిమీద కనపడదయ్యె. అంచేత భగీరథుడు మళ్ళీ ఘోరతపస్సు చేశాడు. శివుడు మళ్ళీ

ప్రీతుడై హిమవత్పర్వతం మీద బ్రహ్మనిర్మించిన బిందు సరస్సున గంగను విడిచిపెట్టాడు. అప్పుడే గంగ యేడుపాయలయింది. హ్లాదిని పావని నళిని అనే పేళ్ళుగల మూడుపాయలు తూర్పుగా ప్రవహించాయి. సుచక్షువు సీత సింధు అనేపేళ్ళు గల మూడుపాయలు పశ్చిమంగా ప్రవహించాయి. ఏడోపాయ భగీరథుని వెంట బయలుదేరింది.

భగీరథుడు దివ్యమైన రథం యెక్కి అతివడిగా బయలుదేరాడు. ఆకాశంనుంచి శివుని శిరస్సుమీదా, శివుని శిరస్సునుంచి భూమిమీదా పడేటప్పుడు గొప్ప ధ్వని చేసుకుంటూ బయలుదేరిన గంగ ఉరుకు పరుగులతో భగీరథునివెంట బయలు దేరింది. గంగతో కింద పడుతూ వున్న చేపల గుంపులతోనూ, తాబేటిగుంపులతోనూ, నీటి యేనుగుల గుంపులతోనూ ఇతర జంతువులతోనూ వ్యాప్తమై భూమి ప్రకాశించింది.

గంగావతరణం చూడడానికి ఎందరో దేవతలు వచ్చి మేఘాలు లేని ఆకాశం అంతా నిండిపోయారు. యక్షులూ సిద్ధులూ కూడా చాలామంది వచ్చారు. వారిలో కొందరు పెద్దపెద్ద నగరం అంతేసి విమానాలమీద వచ్చారు. కొందరు ఏనుగులమీదా కొందరు గుఱ్ఱాలమీదా వచ్చారు. వారు ధరించివుండిన ఆభరణాల కాంతులతోనిండి ఆకాశం నూరుగురు సూర్యులొక్కమాటు ఉదయించినట్టు తేజరిల్లింది. మరిన్నీ ఆకాశం అంతా చెదిరిపడిన చేపలతోనూ తాబేళ్ళతోనూ నీటిఏనుగులతోనూ నురగలతోనూ నిండి మేఘాలు కమ్మినట్టూ మెరుపులు మెరుస్తున్నట్టూ వుంది.

ఆకాశంనుంచి శివశిరస్సుమీదా, శివశిరస్సునుంచి భూమిమీదా పడి ప్రవహించడంలో కొంతదూరం అతివడిగా నడుస్తూ వుంది. కొంతమేర మెల్లిగా నడుస్తూవుంది. కొంతదూరం వంకరటింకర్లుగానూ

కొంతదూరం నిదానంగానూ, కొంతదూరం గిరగిర తిరిగుతూనూ నడుస్తూవుంది. నీటిమీద నీరుపడి కొట్టుకుంటోంది. మెరక యెక్కి పల్లంలో పడుతోంది. ఆకాశంనుంచి పడినా శంకరశిరస్సునుంచి పడినా గంగ అతినిర్మలంగా వుంది. ఆకాశంలో వున్న దేవతలూ గంధర్వులూ మహర్షులూ తక్కినవారున్నూ భూతలవాసు లైన మానవులున్నూ శివశిరస్సునుంచి పడడంవల్ల పవిత్రం అయిందని భావించి గంగను ముట్టుకోసాగారు. శాపంవల్ల ఆకాశంనుంచి భూమిమీద పడి దుఃఖపడుతున్న వారందరూ ఆగంగలో స్నానాలు చేసి శాపవిముక్తి పొంది ఆకాశాని కెగిరి తమతమ లోకాలకు వెళ్ళిపోతున్నారు. మెరిసిపోతున్న గంగాజలంలో మునిగి పాపాత్ము లందరూ పరిశుద్ధు లవుతున్నారు.

దివ్యమైనరథం యెక్కి ముందు భగీరథుడూ అతనివెనక గంగా అతివడిగా వెడుతూ వుండగా గంధర్వులూ యక్షులూ దేవతలూ మహర్షులూ దైత్యులూ దానవులూ రాక్షసులూ కిన్నరులూ పన్నగులూ అప్సరసలూ జలజంతువులూ గంగ వెనక బయలుదేరారు. భగీరథు డెలా వెడితే సర్వపాపాలూ హరించే గంగ అలా వెళ్ళింది.

ఒక చోట అద్భుతకర్ము డైన జహ్నుమహాముని యజ్ఞం చేస్తున్నాడు. దుర్దాంత మైన ప్రవాహంతో వెళ్ళి ఆయజ్ఞశాల అంతా ముంచివేసింది. అందుకు మిక్కిలీ క్రుద్ధుడై ఆజహ్నుమహర్షి గంగాజలం అంతా పానం చేసివేశాడు. అది చూసి దేవతలూ గంధర్వులూ మహర్షులూ ఆశ్చర్యచకితులై జహ్నుమహర్షిని పూజించి, గంగానదిని అతనికి కూతురుగా చేశారు. అందుకు సంతోషించి ఆమహర్షి గంగను తనచెవులలోనుంచి విడిచిపెట్టాడు. అందువల్లనే గంగకు జహ్నుపుత్రిక అనీ, జాహ్నవి అని పేళ్లు వచ్చాయి.

తరవాత, నదులలో ఉత్తమురాలైన గంగ మళ్ళీ భగీరథుని వెంట వెనక బయలుదేరి సముద్రంలో కలిసి భగీరథుని కోరిక నెరవేరడం కోసం పాతాళానికి కూడా వెళ్ళింది. రాజర్షి అయిన భగీరథుడున్నూ గంగను తీసుకువెళ్ళి భస్మీకృతులై దీనులై పడివుండిన తన తాతలను చూశాడు. అప్పుడు గంగ ఆభస్మరాసులమీద ప్రవహించింది. వెంటనే సగరపుత్రులు అరవై వేలమందీ కృతార్థులై స్వర్గానికి వెళ్ళిపోయారు.

## ౪౦

## భగీరథుడు తాతలకు గంగాజలంతో తర్పణం చెయ్యడం

"రామా! అలాగ గంగను వెంటబెట్టుకుని భగీరథుడు సముద్రానికి వెళ్ళి పాతాళం చేరుకున్నాడు. గంగానది సగరపుత్రుల భస్మరాసుల మీద ప్రవహింపగానే సర్వలోకప్రభు వైన బ్రహ్మదేవుడు సాక్షాత్కరించి, భగీరథునితో 'పురుషశార్దూలా! సగరపుత్రులు అరవై వేల మందీ తరించి దేవతల లాగ స్వర్గానికి వెళ్ళిపోయారు. భూమిమీద సాగరజలం యెంతకాలం వుంటుందో సగరపుత్రులు అంతకాలమూ స్వర్గంలో వుంటారు. ఈగంగ నీకు పెద్దకూతురై నీపేరుగా భాగీరథి అని విఖ్యాతి పొంది స్థిరంగా లోకంలో వుండిపోతుంది. ఆకాశం లోనూ భూమిమీదా పాతాళంలోనూ ప్రవహిస్తోంది కనక ఈగంగ త్రిపథగ అయింది. తాతల కందరికీ నీళ్ళు విడిచిపెట్టి నీప్రతిజ్ఞ నెరవేర్చుకో. ధర్మాత్ములలో ముఖ్యుడూ మిక్కిలి కీర్తి కలవాడున్నూ అయిన నీముత్తాత సగరుడు ఈపనిచెయ్యలేకపోయాడు. నీతాత అంశుమంతుడు అతిపరాక్రమశాలి. లోకవిఖ్యాతుడు. గంగను తీసుకు రావాలనిన్నీ అనుకుంటూ వుండేవాడు; కాని అతను కూడా ఈపని చెయ్యలేకపోయాడు. ఇక నీతండ్రి దిలీపునిమాట. అతను రాజర్షి. సుగుణవంతుడు. మహర్షులతో సమానుడు, నాయంత

తపశ్శాలి. క్షత్రియధర్మం బాగా నిర్వర్తించినవాడు. మహా పరాక్రమశాలి. అతను కూడా గంగను తీసుకురావా లని అను కున్నాడే గాని ఈపని చెయ్యలేకపోయాడు. వారి కందరికీ దుస్తరం అయిన ప్రతిజ్ఞ నువ్వు నెరవేర్చుకున్నావు. లోకంలో గొప్ప యశశ్శాలి విన్ని అయినావు. గంగను తీసుకురావడంవల్ల నువ్వు ధర్మాత్ములలో శ్రేష్ఠుడ వైనావు. భగీరథుడా, మధుర మైన గంగాజలంలో స్నానం చెయ్యి. దానివల్ల నీకు పరిశుద్ధీ పుణ్యమూ లభిస్తాయి. తాతల కందరికీ కూడా తర్పణం చెయ్యి. ఇక నేను నాలోకానికి వెళ్ళిపోతాను' అని చెప్పాడు.

ఇలాచెప్పి బ్రహ్మదేవుడు యెలా వచ్చాడో అలా వెళ్ళిపోయాడు. భగీరథుడున్నూ తాతలకందరికీ యథాక్రమంగానూ యథాశాస్త్రం గానూ తర్పణాలు చేసి శుచి అయి తన పట్నం చేరుకున్నాడు. సర్వ సంపత్సమృద్ధుడై చిరకాలం అతను స్వరాజ్యం పరిపాలించాడు. అతని యేల్బడిలో జను లందరూ చాలా సుఖించారు.

రామా! గంగ కథాక్రమం యిదీ. నీకు శుభం అగుగాక. సంధ్యాకాలం అయింది, ఈగంగావతరణకథ విన్నవారికి ధనధాన్య సమృద్ధి కలిగిస్తుంది. దీర్ఘాయువూ కీర్తిప్రతిష్ఠలూ సంతానసమృద్ధీ కలుగుతాయి. చివరికి స్వర్గం కూడా ప్రాప్తిస్తుంది. పితృదేవతలు తరిస్తారు. దేవతలు అనుగ్రహిస్తారు. కోరిక లన్నీ సిద్ధిస్తాయి. సర్వ పాపాలూ నశిస్తాయి.''

## ४౧

## క్షీ ర సా గ ర మ థ న ం

విశ్వామిత్రుడు చెప్పిన అత్యద్భుత మైన గంగావతరణకథను గురించి రామలక్ష్మణులు ఆలోచించుకుంటూ వుండగానే రాత్రిగడిచిపోయింది,

తెల్లవారిన తరవాత రాముడు విశ్వామిత్రుడితో "మహర్షీ ! చక్కని రాత్రి గడిచింది. వినతగ్గది చక్కగా విన్నాము. మేము ఈకథను గురించి ఆలోచించుకుంటూ వుండగానే రాత్రికి రాత్రి అంతా క్షణం లాగ గడిచిపోయింది. నీరాక తెలిసి మహర్షులకుతగ్గ పడవ ఇక్కడే వచ్చింది. పడవలో కూచోడానికి తగ్గ మెత్తని ఆసనాలు సిద్ధంగా వున్నాయి. దయచెయ్యి. పవిత్రమైన గంగానది దాటుదాము" అన్నాడు. రాముడిలా చెప్పగా విశ్వామిత్రుడు రామలక్ష్మణుల తోనూ మహర్షులతోనూ పడవయెక్కి గంగదాటాడు. అవతలిగట్టు చేరాక అక్కడ విడిసి, వారు, నది దాటించడానికి వచ్చిన మునులను పూజించి పంపివేసి దగ్గిరగా వున్న విశాల అనే నగరం ప్రవేశించారు.

అప్పుడు రాముడు "మహర్షీ ! ఈవిశాలానగర వృత్తాంతం యెట్టిది ? ఇక్కడ ప్రజాపాలనం చేస్తున్న రాజు వంశం యెలాంటిది?" అని దోసిలి వొగ్గి అడగ్గా విశ్వామిత్రుడు ఇలా చెప్పకువచ్చాడు.

"రామా ! నేను ఇంద్రుని కథ చెబుతాను విను. ఈదేశంలో యేమి జరిగిందో అది కూడా చెబుతాను విను. పూర్వం, అంటే కృతయుగంలో, దితి కొడుకులు మహాబలవంతులు మాత్రమే అయి వుండినారు. అదితి కొడుకులు మహాబలవంతులే కాక ధార్మికులున్నూ అయి వుండినారు. ఇలా వుంటూండగా ఆ వుభయవర్గాలవారికీ కూడా 'మనం రోగాలు లేకుండానూ ముసలితనం రాకుండానూ, చావు మూడకుండానూ వుండా లంటే యేమిటి దారి ?' అని ఆలోచన కలిగింది. ఆలోచించగా ఆలోచించగా 'పాలసముద్రం మథించి అమృతం సంపాదించుకుందాం ?' అని స్థిరనిశ్చయమున్నూ కలిగింది.

దానిమీద అమితౌజస్కులైన దైత్యులూ ఆదిత్యులూ కలిసి మందరపర్వతం కవ్వంగానూ సర్పరాజైన వాసుకి తాడుగానూ చేసు

కాని పాలసముద్రం చిలికారు. ఇలాగ వెయ్యి సంవత్సరాలు జరిగా టప్పటికి వాసుకి తలలు ఘోర మైన విషం కక్కాయి. పర్వతంమీద వున్న రాతిఖండాలను పళ్ళతో కొరికాయి. ఆరాతిఖండాలే దావానలంకంటేనూ దారుణ మైన హాలాహలం అనే విషం అయి పుట్టుకు వచ్చాయి. దేవాసురమానుషాక్రాంత మైన జగత్తంతా ఆవిషం వల్ల తగులబడిపోయింది. అప్పుడు దేవత లందరూ మహాదేవు డైన శివుణ్ణి 'రక్షించు రక్షించు' అని ఆక్రోశిస్తూ శరణుచొచ్చారు. వెంటనే దేవదేవేశ్వరు డైన శివుడూ అతని వెనకనే శంఖచక్రగదాధరు డై విష్ణువూ సాక్షాత్కరించారు. అప్పుడు విష్ణువు చిరునవ్వు నవ్వుతూ శివుణ్ణి చూసి 'సురశ్రేష్ఠా! దేవతల కందరికీ నువ్వే మొదటివాడవు. కనక, సముద్రమథనంలో మొదట పుట్టినది నీవంతు. ప్రభో! అగ్ర పూజగా భావించి నువ్వు ఈవిషం స్వీకరించు' అని చెప్పి అంతర్ధానం అయినాడు. దేవత లందరూ భయభ్రాంతు లై వుండడం చూసీ, విష్ణువు కోరడంవల్లా దేవదేవు డైన శివుడు ఆవిషం అమృతం లాగ భక్షించి తానున్నూ అంతర్హితు డైనాడు.

తరవాత దైత్యులూ ఆదిత్యులూ సముద్రం మళ్ళీ మథించారు; కాని మందరపర్వతం పాతాళానికి మునిగిపోయింది. అప్పుడు దేవతలూ గంధర్వులూ 'మహాబాహూ! సర్వభూతాలకూ నువ్వే ఆధారం. ముఖ్యంగా, దేవతలకు నువ్వే రక్షకుడవు. కనక, ఈపర్వతం లేవనెత్తి మమ్మల్ని రక్షించు' అని విష్ణుమూర్తిని ప్రార్థించారు.

దేవత లిలా ప్రార్థించగా, విష్ణుమూర్తి తాబేలయి మందరపర్వతం తన వీపుమీద ఉంచుకుని, తన చేతులతో పర్వతశిఖరం పట్టుకుని దేవతలతో పాటు తానున్నూ సముద్రం మథించాడు. ఇలాగ వేయి సంవత్సరాలు మథించాటప్పటికి దండమూ కమండలమూ పట్టుకుని ముందు ధన్వంతరి పుట్టుకువచ్చాడు. తరవాత అప్సరసలు పుట్టుక

వచ్చారు. వాళ్లి వర్చస్సంత వర్చస్సు ప్రపంచంలో మరేస్త్రీలకూ లేదు. అబ్ధిర్మథనంవల్ల రసం పుట్టి దాన్ని మధించడంవల్ల పుట్టిన వాళ్లు కనక, వాళ్లకి అప్సరసలని పేరువచ్చింది. వాళ్లు ఆరుకోట్ల మంది పుట్టారు. వాళ్ల పరిచారికలు కూడా లెక్కలేనంతమంది పుట్టుకువచ్చారు. అంత చక్కనివాళ్లయినా దేవతలూ దానవులూ కూడా వాళ్లని భార్యలుగా స్వీకరించలేదు. అంచేత వాళ్లు సామాన్యలయి వేశ్య లనిపించుకున్నారు. తరవాత 'నన్నెవరు పెళ్లాడతారా?' అని వెదుక్కుంటూ వారుణి పుట్టుకువచ్చింది. వారుణి అంటే సుర. అది వరుణుని కూతురయి పుట్టింది. దితి కొడుకులు దాన్ని చూసే యేవగించుకున్నారు. అదితి కొడుకులు మాత్రం అనిందితురా లని చెబుతూ దాన్ని పరిగ్రహించారు. అంచేత దైత్యులు అసురలూ దేవతలు సురలూ అయినారు. వారుణి పరిగ్రహించడంవల్ల దేవతలు ఉత్సాహవంతులూ ఉల్లాసవంతులూ అయినారు. తరవాత గుర్రాలలో వన్నెకెక్కిన ఉచ్చైశ్శ్రవమూ, మణులలో శ్రేష్ఠమైన కౌస్తుభమూ వాటి వెనకనే అమృతమూ పుట్టుకువచ్చాయి. ఆయమృతం కోసం దేవతలూ దానవులూ కూడా అనేకులు నశించారు. దానికోసం వారి కుభయులకూ ఘోరయుద్ధం జరిగింది. దేవతలు దానవులను చాలా మందిని చంపేశారు. అసురలు రాక్షసులతో కలిసి మీదపడ్డారు. అంచేత త్రిలోకాలూ రిచ్చపడిపోయేటంతటి మహాఘోరయుద్ధం జరిగిపోయింది. అంతా అయిపోయిన తరవాత మహాబలు డైన విష్ణువు మోహిని అవతారం ఎత్తివచ్చి అమృతం పట్టుకుపోయాడు. ఆ యుద్ధంలో విష్ణువు నెదిరించినవా రందరూ — అనగా రాక్షసు లందరూ విష్ణువుచేతిలో చచ్చిపోయారు. ఆమహాఘోరయుద్ధంలో వీరు లైన ఆదిత్యులు దైత్యులను నాశనంచేశారు. ఇలాగ దితిపుత్రులను సంహరించి ఇంద్రుడు రాజ్యం పొంది లోకాలను పరిపాలించాడు.

४७

## దేవేంద్రుడు దితిగర్భస్థుడైన శిశువును చంపడం

ఇలాగ తన కొడుకు లందరూ నశించగా, దితి మరీచుని కొడుకూ తన భర్తా అయిన కాశ్యపుని దగ్గిరికి వెళ్లి 'మహాత్మా! నీకొడుకులు నాకొడుకుల నందరినీ చంపివేశారు. నేను కొడుకులు లేనిదాన్నయి పోయాను. నాకీకడుపుచిచ్చు ఇంద్రుడు తెచ్చిపెట్టాడు కనక, ఇంద్రుణ్ణి సంహరించే కొడుకు నాకు కావాలి. అందుకోసం నేను చిరకాలం తపస్సు చేస్తాను. కనక, నువ్వు గర్భం అనుగ్రహించాలి' అని కోరింది. దానిమీాద, మిక్కిలీ దుఃఖిస్తూ వున్న దితిని ఆశ్వాసించి కాశ్యపుడు 'అలాగే కానియ్యి. నీకు భద్రం అగుగాక. తపస్సు చేసి నువ్వు పరిశుద్ధురాల వయి రా. నువ్వు ఇంద్రహంత అయే కొడుకుని కందువుగాని. నువ్వు శుచి వయినట్లయితే వెయ్యిసంవత్సరాల తరవాత నావల్ల త్రిలోకాధిపతి కాదగ్గ కొడుకును కంటావు, సందేహం లేదు' అని చెప్పి మహాతేజశ్శాలి అయిన కాశ్యపుడు దితిని చేతితో తట్టి ఊరడించి తపస్సు చేసుకోడానికి వెళ్లిపోయాడు.

రామా! తరవాత దితి పరమానందభరితురాలై విశాలానగరం ఇప్పుడెక్కడ వున్నదో కుశప్లవనం అని పేరుగలిగివుండిన ఆస్థలంలో దారుణమైన తపస్సుచేసింది. ఆమె తపస్సు కాలంలో సహస్రాక్షుడైన యింద్రుడు తన గుణసంపదవల్ల ఆమెని మెప్పిస్తూ ఆమెకి సేవచేశాడు. అగ్ని కుశలు కట్టెలు నీళ్లు పళ్లు కందమూలాలు ఇంకా ఆమె కోరినవీ ఇంద్రుడు ఆమెకి తెచ్చియిస్తూవుండినాడు. ఇంతేకాక ఇంద్రుడు ఆమెకి కాళ్లు పట్టేవాడు. విసనకర్రతో విసిరి శ్రమ పోగొట్టేవాడు. ఇలాగ పది తక్కువగా వెయ్యి సంవత్సరాలు గడిచాక దితి పరమసంప్రీతురాలై ఇంద్రునితో 'సురశ్రేష్ఠా! నీతండ్రి అయిన

కాశ్యపుడు నేను ప్రార్థించగా వెయ్యిసంవత్సరాల తరవాత నాకు కొడుకు పుట్టేటట్టు అనుగ్రహించాడు. ఇక మిగిలిన పది సంవత్స రాలూ నేను తపస్సు చేశాక నువ్వు నీతమ్ముణ్ణి చూస్తావు. జయో త్సుఖుడైన అతన్ని నీకోసం నేను సమధానపరుస్తాను. అప్పుడు నువ్వు చింతతక్క అతనితో కలిసి త్రైలోక్యవిజయం అనుభవిస్తావు' అని చెప్పింది.

ఇలా చెప్పి ఆమె మిట్టమధ్యాహ్నసమయంలో నిద్ర ముంచుకు రాగా కాళ్లదిక్కున శిరస్సూ శిరస్సు దిక్కున కాళ్లూ వుంచుకుని పడుకుంది. కాశ్యపుడు తపస్సు చేసే వెయ్యిసంవత్సరాలూ 'శుచిగా వుండాలి' అని ఆమెకి శపథంగా చెప్పాడు. ఆమె అశుచిగా వుండే సమయం దొరక్కపోతుందా అనే ఇంద్రుడు సేవనెపంగా ఆమెని కనిపెట్టుకుని వుండినాడు; కనక, ఆమె యిలాగ అశాస్త్రీయంగా పడుకోడం చూసి అశుచి కావడంవల్ల నవ్వి, సమయం దొరికినందుకు చాలా సంతోషించాడు. మరిన్నీ, అతను మహాధైర్య వంతుడై యోనిద్వారాన ఆమె గర్భంలో ప్రవేసించి శిశువును ఏడు ముక్క లుగా నరికాడు. ఇంద్రుడు వజ్రాయుధంతో తనను నరుకుతూ వుండగా ఆశిశువు ఏడ్చాడు. దాంతో దితి మేల్కొంది. 'మారుద - మారుద' అంటే 'ఏడవకు, ఏడవకు' అని చెబుతూనే మహాతే జశ్శాలి అయిన ఆశిశువును చంపివేశాడు. దితి 'చంపకు చంపకు' అంటూ వుండగా వజ్రపాణి అయి బయటికి వచ్చి ఇంద్రుడు దోసిలి వొగ్గి 'దేవీ! కాళ్లదిక్కున శిరస్సు ఉంచుకుని — ఈవిధంగా నువ్వు అశుచి వయినిద్రపోయావు. కనక, ఈవిధంగా నాకు అవకాశం దొర కడంవల్ల నన్ను చంపడానికి పుట్టబోయే శిశువును ఏడు తుండ్లుగా నరికివేశాను. క్షమించు' అన్నాడు.

## ౪౩

## విశాలాధిపతి అయిన సుమతి విశ్వామిత్రుణ్ణి పూజించడం

తన గర్భం యిలాగ ఏడుతుండా లయిపోగా దితి మిక్కిలీ దుఃఖించి, దురాధర్షుడైన ఇంద్రుణ్ణి చూసి 'నాపొరపాటువల్లనే నాగర్భం విచ్ఛిన్నం అయిపోయింది. ఇందులో నీదోషం లేశమూలేదు. నాగర్భం యిలా చెడిపోవడంవల్ల నేనొక పని చేస్తే బాగుంటుం దనుకున్నాను. ఈతుండా లేడూ సప్తమారుతాలకూ క్షేత్రపాలకు లగుదురుగాక. ఇవి యేడున్నూ మారుతాలు అని పేరుపొంది దివ్యరూపాలైన వాత స్కంధాలై దేవలోకంలో చరించుగాక. ఒకడు బ్రహ్మలోకంలోనూ, ఇంకొకడు ఇంద్రలోకంలోనూ, మరొకడు స్వర్గంలోనూ సంచరిస్తూ వుండాలి. తక్కిన నలుగురూ నాలుగు దిక్కులలోనూ నీయాజ్ఞాను వర్తులై సంచరిస్తూ వుండాలి. నువ్వు 'మారుద మారుద' అన్నావు కనక, కొద్దిపాటి వర్ణవ్యత్యయం పొంది 'మారుతాలు' అని పేరు పొందాలి' అని జాలిగా అడిగింది.

ఆమాట విని సహస్రాక్షుడైన దేవేంద్రుడు దోసిలి వొగ్గి 'నువ్వు కోరిం దంతా జరుగుతుంది. నీకొడుకులు దేవతలయి సంచరిస్తారు. నీకు భద్రం అగుగాక!' అన్నాడు. ఇలాగ తల్లీ కొడుకు లిద్దరూ కూడపలుక్కుని, కృతార్థులై దేవలోకానికి వెళ్ళిపోరు.

" రామా! మునుపు మహేంద్రుడు ఎక్కడ వుండి తపస్సిద్ధురా లయిన దితికి పరిచర్య చేశాడో ఆకుశప్లవనమే యీస్థలం. ఇక్ష్వాకునకు అలంబుస అనే భార్యయందు పరమధార్మికుడైన విశాలుడు పుట్టాడు. ఆవిశాలుడే విశాల అనే యీపట్నం నిర్మించాడు. ఆవిశాలునకు మహాబలుడైన హేమచంద్రుడు పుట్టాడు. హేమ చంద్రుని తర వాత ప్రఖ్యాతిపొందినవాడు సుచంద్రుడు. సుచంద్రుని కొడుకు ధూమ్రాశ్వ

శ్వుడు. ధూమ్రాశ్వుని కొడుకు సృంజయుడు, సృంజయుని కొడుకు ప్రతాపశాలి అయిన సహదేవుడు. సహదేవుని కొడుకు కుశాశ్వుడు. పరమధార్మికుడైన కుశాశ్వుని కొడుకు మహాతేజశ్శాలి అయిన సోమదత్తుడు. సోమదత్తుని కొడుకు కాకుత్స్థుడు. అతని కొడుకే ఇప్పుడు విశాలాపట్నం యేలుతున్న రాజు. అతనిపేరు సుమతి. సుమతి మహా పరాక్రమవంతుడు. దేవతలతో సాటిఅయినవాడు. దుర్జయుడు. ఇక్ష్వాకుని అనుగ్రహం వల్ల విశాలాధిపతులైన రాజులందరూ దీర్ఘాయుష్మంతులూ బలపరాక్రమవంతులూ మహాత్ములూ అయి వుంటారు.

మనం యీరాత్రి యీవిశాలానగరంలో సుఖంగా వుండి తెల్లవారాక జనకమహారాజును చూడబోదాము."

ఇక్కడ వీరిలా వుండగా, అక్కడ, సుమతి, విశ్వామిత్రుడు వచ్చి వున్నాడని విని ఎదురువెళ్ళి పట్నానికి తీసుకువెళ్ళి సకలబంధుమిత్రులతోనూ పురోహితులతోనూ కలిసి పూజించాడు. ప్రాంజలి అయి కుశలవార్తలున్నా అడిగి, "నువ్వు నాపట్నానికి రావడంవల్ల నేను ధన్యుణ్ణయినాను. అనుగ్రహంవుంచి కనక దయచేశావు. నాయంత ధన్యుడు మరొకడు లేడు" అని చాలాచాలా స్తోత్రంచేశాడు.

## ౪౮

## గౌతముడు అహల్యనూ ఇంద్రుణ్ణీ శపించడం

ఇదంతా ముగిసిన తరవాత, సుమతి "మహాత్మా! ఈయువకులు దేవతలతో సమానమైన బలపరాక్రమవంతులుగా కనపడుతున్నారు. వీరిలో పెద్దవాడు శార్దూలంలాగ ఉన్నాడు. ఏనుగులా నడుస్తున్నాడు. చిన్నవాడు వృషభంలాగ కనపడుతున్నాడు సింహంలాగ నడుస్తు

న్నాడు. వీరి నేత్రాలు తామరపువ్వు రేకల్లాగ విశాలంగా వున్నాయి. యౌవనవంతులై అశ్వనీదేవతల కంటే సుందరులయి వున్నారు. ఖడ్గతూణీరధనుర్ధరులై విలాసార్థం భూమండలానికి వచ్చిన దేవకుమారుల్లాగ కనపడుతున్నారు. వీ రెందుకు పాదచారులైనారు? ఎవరివారు? ఎందుకు వచ్చారు? ప్రమాణంలోనూ ఇంగితాకారాల్లోనూ చేష్టలలోనూ ఒకరికొకరు సమానులై ఆకాశాన్ని సూర్యచంద్రుల్లాగ నాదేశాన్ని ప్రకాశింపచేస్తున్నారు. ఎవరికీ చొరరాని మార్గాన వీరెందుకు రావలసివచ్చిందీ?" అని అడిగాడు.

విశ్వామిత్రుడు అతనికి జరిగిన దంతా చెప్పాడు.

దానిమీద సుమతి తమ్ము అనేకవిధాల సమ్మానించగా రామలక్ష్మణులు ఆరాత్రి విశాలాపురంలో ఆతిథ్యం స్వీకరించి, తెల్లవారాక మిథిలకు బయలుదేరారు.

అదిగో మిథిల అనగా వారికొక మున్యాశ్రమం కనపడింది. కాని అది శూన్యంగా వుంది. రమ్యంగానే వుంది; కాని చాలా పాతదిలాగ కనపడుతోంది. అది చూసి రాముడు "మహాత్మా!" ఇది ఆశ్రమం అని తోస్తోంది! కాని మునులు కనపడరు. ఇది యెవరిదీ?" అని అడగ్గా, విశ్వామిత్రుడు ఇలా చెప్పాడు.

"అయ్యో! ఈయాశ్రమం శాపదగ్ధం అయిపోయింది. రామా! ఆకథ అంతా చెబుతాను విను. ఇది మహర్షి అయిన గౌతముని ఆశ్రమం. దేవతలు కూడా దీన్ని పూజిస్తూ వుండేవారు. ఆగౌతముడు తపస్సు చేసుకుంటూ భార్య అయిన అహల్యతో కూడా ఇక్కడ అనేక సంవత్సరాలు నివసించాడు. ఒకప్పుడు అతను ఆశ్రమంలో లేకపోవడం చూసి దేవేంద్రుడు గౌతమరూపమే ధరించి వచ్చి అహల్యను చూసి 'సుందరీ! కాముకులు ఋతుకాలంకోసం చూడరు. నీతో

సంగమమే నాకు కావాలి' అన్నాడు. అహల్య అదివరకే ఇంద్రునితో క్రీడించా లనుకుంటున్నది కనక, ఆవచ్చిన మునిరూపధారి ఇంద్రుడే అని నిశ్చయించుకుని అందు కంగీకరించింది.

ఉభయులూ కృతకృత్యు లయినారు. 'ఇంద్రా! ప్రభూ! నేను కృతార్థురాల నైనాను. ఇక వెళ్ళిపో. నీక్షేమమూ నాక్షేమమూ కూడా గుర్తించుకో' అని అహల్య చెప్పగా 'ప్రియురాలా! నాకున్నూ సంతుష్టి అయింది. ఇదిగో వెళ్లిపోతున్నా' నని చెప్పి గౌతముడువచ్చి పోతాడేమో అని భయపడుతూ ఇంద్రుడు కుటీరం విడిచి బయటికి వచ్చాడు; కాని అప్పటికప్పుడే గౌతముడు వచ్చివేశాడు. దేవత లకూ దానవులకూ కూడా చూడ శక్యం కానివాడూ, మహాతపో ధనవంతుడూ అయిన గౌతముడు నదిలో స్నానంచేసి, అగ్నిలాగ మెరిసిపోతూ, సమిధలూ కుశలూ పట్టుకుని వచ్చివేశాడు.

గౌతముణ్ణిచూచి ఇంద్రుడు భయభ్రాంతుడై కొయ్యబారిపోయాడు. గౌతముడున్నూ, మునివేషధరుడై వచ్చి దుష్కార్యం చేసిన ఇంద్రుణ్ణి గుర్తించి, అతిరోషంతో 'దుర్మతీ! నావేషం వేసుకువచ్చి చెయ్య రాని పని చేశావు కనక, నువ్వు అఫలుడ వయిపో' అని కఠినంగా శపించాడు. వెంటనే ఇంద్రుని వృషణాలు డుల్లిపడిపోయాయి. గౌత ముడు ఇంద్రుణ్ణి అలా శపించి అహల్యను చూసి 'అనేకవేల సం వత్సరాలు నువ్వు యీ ఆశ్రమంలోనే వుంటావు; కాని ఆహారం లేక వాయుభక్షణం మాత్రం చేస్తూ దుమ్ములోనూ ధూళిలోనూ పొర లాడుతూ ఎవరికీ కనపడకుండా పడివుండు' అని శపించాడు. మరిన్నీ గౌతముడు 'దుర్ధర్షుడైన దశరథపుత్రుడు రాముడు ఎప్పుడు ఇక్కడికి వస్తాడో అప్పుడు నువ్వు శాపవిముక్తి పొంది పవిత్రురాల వవుతావు. శ్రీరామునికి ఆతిథ్యం యిచ్చి నువ్వు లోభమోహాలు విడిచి, స్వశరీరం

ధరించి నాతో సుఖంగా వుంటావు' అని శాపాంతం కూడా అను గ్రహించి దుష్టచారిణి అయిన అహల్యనూ ఈ ఆశ్రమమూ విడిచిపెట్టి సిద్ధచారణసేవితమైన హిమవత్పర్వతశిఖరానికి వెళ్ళిపోయి తపస్సు ప్రారంభించాడు.

## ౪౯

## అ హ ల్యా శా ప వి ము క్తు రా లు కా వ డ ం

మొగం వేలవేసుకుని వెళ్ళి ఇంద్రుడు అగ్నిప్రభృతులైన దేవతలను చూసి 'అయ్యా, వినండి. గౌతముడు మహాతపస్సు ప్రారంభించాడు. అది భగ్నం చెయ్యడానికి వెళ్లి నేను అతనికి చాలా కోపం తెప్పించాను. దాంతో అతని తపస్సు చెడిపోయింది. ఈవిధంగా నేను అతిదుర్లభమైన దేవకార్యం చేసుకుని వచ్చాను; కాని క్రోధంవల్ల అతను నన్ను 'అఫలుడవయిపో' అని శపించాడు. అహల్యనున్నూ నిరాకరించి శపించివేశాడు. మొత్తానికి అతని తపస్సంతా భగ్నం అయిపోయింది. ఇంతకంటే మనకి కావలసినది యేమిటి? కనక, దేవతలూ ఋషులూ చారణులూ మొదలైన మీరందరూ దేవతలకు సాహాయ్యభూతుణ్ణయిన నన్ను మళ్ళీ సఫలుణ్ణి చెయ్యాలి' అన్నాడు.

అది విని వారందరూ పితృదేవతల దగ్గిరికి వెళ్ళారు. అప్పుడు పితృదేవత లొక యజ్ఞం చేస్తున్నారు. 'అగ్నిపితృదేవతలారా! మీ యజ్ఞం నిమిత్తం సిద్ధపరిచివున్న యీమేకకు వృషణం వుంది. ఇంద్రుడు వృషణహీనుడై వున్నాడు; కనక, మేక ఫలాలు తీసి ఇంద్రుని కివ్వండి. మేక అఫలం అయినా మీకు యజ్ఞఫలం ఇస్తుంది. మిమ్మ సంతోష పెట్టడాని కికముందు మానవులున్నూ ఫలాలు లేని మేకలనే యిస్తారు' అని చెప్పాడు. ఆమాటమీద పితృదేవతలు మేకఫలాలు తీసి ఇంద్రుని కిచ్చివేశారు. అదిమొదలు పితృదేవతలు అఫలాలైన

మేకలనే భుజిస్తున్నారు. యజ్వలకు, వారు, సఫలమేషా లిచ్చినట్టే ఆనందించి యజ్ఞఫలం కలిగిస్తున్నారు. అది మొదలు ఇంద్రుడు గౌతముని తపోమహిమవల్ల మేష వృషణుడై వున్నాడు.

కనక, రామా! పుణ్యకర్ముడైన గౌతముని ఆశ్రమానికి వెడదాం రా. దేవరూపిణీ మహాభాగురాలూ అయిన అహల్యను తరింపచెయ్యి" అని విశ్వామిత్రుడు చెప్పగా, రాముడు లక్ష్మణునితో కలిసి మహర్షి వెంట ఆశ్రమం ప్రవేశించాడు.

అహల్య ఒకచోట పడివుంది. తపస్సువల్ల కలిగిన కాంతితో ఆమె ధగధగ మెరుస్తోంది. దేవదానవులు కూడా తేరిచూడరానంతటి తేజస్సుతో మిరుమిట్లు గొలుపుతోంది. బ్రహ్మదేవుడు చాలా ప్రయత్నం చేసి సృష్టించిన మాయామయిలా వుంది. అసలే శరన్మేఘ శకలాల మధ్య వుండి, పైగా మంచుతెర ఆవరించి వుండిన పూర్ణచంద్ర బింబంలా వుంది. పొగతో నిండిపోయిన అగ్నిజ్వాలలా వుంది. నీటిలో ప్రతిఫలిస్తున్న సూర్యబింబంలాగ చూడశక్యం కాకుండా వుంది. రాముడు అహల్యను చూశాడు.

గౌతమశాపంవల్ల రాము డక్కడికి వచ్చేదాకా త్రిలోకాలవారికీ కూడా ఆమె అదృశ్య అయివుంది. ఇప్పుడు శాపం తొలగిపోడంవల్ల వచ్చినవారి కందరికీ కనపడింది. రామలక్ష్మణులు వెంటనే ఆమె పాదాలు పట్టుకున్నారు. గౌతముడు చెప్పిన శాపాంతం స్మరించుకుంటూ ఆమె కూడా వారి పాదాలు పట్టుకుంది. మరిన్నీ, ఆమె వారికి పాద్యమూ అర్ఘ్యమూ ఆతిథ్యమూ ఇచ్చింది. చాలా భక్తితో యథాశాస్త్రంగా ఆమె వారిని పూజించింది. రాము డానందించి ఆ పూజలు పరిగ్రహించాడు.

అప్పుడు ఆకాశంనుంచి పూలవాన కురిసింది. దేవదుందుభులు మోగాయి. గంధర్వులు పాడారు. అప్సరసలు ఆడారు. అప్పటి కప్పుడే గౌతముడు వచ్చి ఆమెని స్వీకరించాడు. ‘సాధు సాధు’ అని కీర్తిస్తూ దేవత లామెను పూజించారు. గౌతముడున్నూ అహల్యతో కలిసి రాముణ్ణి విధివిధానంగా పూజించాడు. రాముడానందించి అప్పుడు మిథిలకు ప్రయాణ మైనాడు.

## ౨౬

## రాముడు జనకుని యజ్ఞశాల ప్రవేశించడం

అప్పటికి జనకుడు యజ్ఞం చేస్తున్నాడు. దేశదేశాలనుంచీ వేదవేదాంగ వేత్తలైన బ్రాహ్మణులు అనేకవేలమంది వచ్చివుండినారు. వందల కొద్దీ బళ్లతో వచ్చి మహర్షులు తమకోసం నిర్దేశించబడ్డ భాగం నిండి వున్నారు. రాముని మాట మీద విశ్వామిత్రుడు జనసమ్మర్దం తక్కు వగా వున్న చోట జలసమృద్ధిగల బసలో ప్రవేశించాడు.

జనకునికి విశ్వామిత్రుని రాక తెలిసింది. వెంటనే అతను పురో హితుడైన శతానందుణ్ణి మున్నిడుకుని సవినయంగా వచ్చాడు. ఋత్విక్కులును వడిగా వచ్చి విశ్వామిత్రునికి సమంత్రకంగా అర్ఘ్యం యిచ్చారు. ఆపూజ లందుకుని విశ్వామిత్రుడు “నీకు క్షేమమా? యజ్ఞం నిర్విఘ్నంగా సాగుతోందా?” అని జనకుణ్ణి ప్రశ్నించాడు. మరిన్నీ, విశ్వామిత్రుడు మునులనూ ఋత్విక్కులనూ పురోహితులనూ కూడా యథాశాస్త్రంగా కుశలప్రశ్న లడిగి ఆనందంగా వుండినాడు.

అప్పుడు జనకుడు “విశ్వామిత్రమహర్షీ! ఈ మునిపుంగవులతో కూడా ఆసనం స్వీకరించు” అని కోరగా, అందు విశ్వామిత్రుడూ

తరవాత తక్కినవారూ కూచున్నారు. రాజూ మంత్రులూ కూడా యథార్హ్హంగా కూచున్నారు. జనకుడు "విశ్వామిత్రా! నువ్వు నాయజ్ఞశాలకు దయచెయ్యడంవల్ల ఇప్పుడు నాయజ్ఞం సమగ్రం అయింది. దేవతలు నాయజ్ఞం సఫలం చేశారు. ఇప్పుడే నాకు యజ్ఞ ఫలం లభించింది. ధన్యుణ్ణయినాను. అనుగ్రహం వుంది కనక, నన్ను మరిచిపోకుండా మునులతో దయచేశావు. యజ్ఞం యిక పన్నెండు దినాలే తరవాయి వుంది. చివరదాకావుండి హవిర్భాగాలకోసం వచ్చే దేవతలను నువ్వు చూడాలి" అని వినమ్రుడై దోసిలి వొగ్గి కోరాడు.

"అయితే, మహర్షి! సూర్యచంద్రుల్లా వెలుగుతున్న మహావీరులు ఈకుమారు లెవరూ? ఖడ్గతూణీరధనుర్ధరులైన యీకుమారులు అశ్వినీ దేవతలా అనిపిస్తున్నారు. భూమండలం చూడా లన్న కుతూహలంతో దేవలోకంనుంచి పాదచారు లయివచ్చిన దేవకుమారులా వీరు? వీ రెవరి కుమాళ్లు?" అని జనకుడు రామలక్ష్మణులను చూపించి అడిగాడు.

విశ్వామిత్రుడు వారు దశరథమహారాజు కుమాళ్లనీ, రాముడూ లక్ష్మణుడూ అనీ వారు తన కోరికమీద సిద్ధాశ్రమానికి రావడమూ, రాక్షసులను సంహరించడమూ, రాక్షసపరివ్యాప్తమైన అరణ్యం మీదుగా తాము నిర్భయంగా రావడమూ, విశాలనగరం చూడడమూ, అహల్యను చూడడమూ, గౌతమ మహర్షిని కలుసుకోడమూ, శివ ధనుస్సు చూడడానికి మిథిలకు రావడమూ సవిస్తరంగా చెప్పాడు.

## ౪౨

## శతానందుడు రామునికి విశ్వామిత్ర చరిత్ర చెప్పడం

జనకుని పురోహితుడైన శతానందుడు అహల్యకొడుకు. అతను మహాతపశ్శాలీ, మహాతేజశ్శాలీని. తపస్సంబంధమైన వర్చస్సుతో

అతను మెరిసిపోతూ వుంటాడు. అతను విశ్వామిత్రుడు చెప్పిన దంతా విన్నాడు. రాముణ్ణి చూసినందువల్ల పరమాశ్చర్య భరితు డైనాడు.

అతను సుఖాసీనులై వుండిన దశరథమహారాజపుత్రులు రామ లక్ష్మణులను చూసి విశ్వామిత్రునితో యిలా అన్నాడు.

"మహర్షీ! దీర్ఘకాలం మహాతపస్సు చేసిన యశస్విని నాతల్లి. ఆమెను నువ్వు రామునికి చూపించావా? మహాతేజశ్శాలిని అయిన మా అమ్మ సమస్తదేహులకూ పూజార్హు డైన రాముణ్ణి వన్యాలైన కందమూలఫలాదులతో లెస్సగా పూజించిందా? మాతల్లికి ఇంద్రునివల్ల సంభవించిన దురవస్థారూప మైన పాతకథ అంతా నువ్వు రామునికి చెప్పావా? కౌశికమహర్షీ! నీకు భద్రం అగుగాక. రాముణ్ణి చూడడం, పూజించడం, ఆతిథ్యం యివ్వడం మొదలైన పనులవల్ల మళ్లీ నాతండ్రి అయిన గౌతమమహర్షిని పొందగలిగిందా? నాతండ్రి రాముని పూజించాడా? హిమవత్పర్వతప్రాంతాలనుంచి ఆశ్రమానికి వచ్చిన నాతండ్రిని రాముడున్నూ పూజించాడా? మా ఆశ్రమానికి దయచేసిన రాముడు ప్రశాంతమనస్సుతో నమస్కారాలు చేశాడా?"

ఇదంతా విని విశ్వామిత్రుడు శతానందునితో, "మునిపుంగవా! నే నేమీ మరిచిపోలేదు. చెయ్యవలసిం దంతా చక్కగా చేశాను. పరశురాముని తల్లి అయిన రేణుక తన భర్త అయిన జమదగ్ని మహర్షిని మళ్ళీ పొందినట్టే నీతల్లి అహల్యకూడా నీతండ్రిని కలుసుకుంది" అని చెప్పాడు.

మహాతేజశ్శాలి అయిన శతానందుడు అప్పుడు రామునితో ఇలా అన్నాడు.

"రామా! అప్రతిహతప్రభావు డైన విశ్వామిత్రునితో కలిసి దైవవశాన నువ్విక్కడికి వచ్చావు. నీకు స్వాగతం. విశ్వామిత్రుడు, ఊహకు కూడా అందని గొప్పపనులు చేసినవాడు. తాను రాజర్షి అయివుండిన్నీ ఉగ్రతపస్సు చేసి బ్రహ్మర్షి అయినాడు. ఇంతటి వర్చస్వి మరొకడు లేడు. ఇతని మహాత్వం నువ్వెరుగుదువా? మహా తపశ్శాలి అయిన విశ్వామిత్రుడు నీకు రక్షకుడయి వున్నాడు. నీకంటే ధన్యుడు మరొకడు లేడు. విశ్వామిత్రుని తపోబలమూ చరిత్రా నేను చెబుతాను విను.

విశ్వామిత్రుడు సకలవిద్యలూ నేర్చి సకలధర్మాలూ తెలుసుకుని ధర్మాత్ముడై శత్రుభీకరుడై ప్రజల శ్రేయస్సే కోరుతూ చిరకాలం రాజ్యపాలనం చేశాడు. బ్రహ్మ కొడుకు కుశుడు. కుశుని కొడుకు కుశనాభుడు, అతను మహాబలపరాక్రమశాలి, ధార్మికుడు. కుశనాభుని కొడుకు గాధి. అతను విశ్వవిఖ్యాతుడు. ఆ గాధి కొడుకే ఈ విశ్వామిత్రుడు. అనేక వేల సంవత్సరాలు ఈ విశ్వామిత్రుడు మహారాజై ప్రజాపాలనం చేసాడు.

ఒకమాటు ఈ మహాత్ముడు అక్షోహిణీపరిమిత మైన చతురంగ బలంతో బయలుదేరి భూమి అంతా తిరిగాడు. రాష్ట్రా లెన్నో, నగరా లెన్నో, నదు లెన్నో, పర్వతా లెన్నో, మున్యాశ్రమా లెన్నో తిరిగితిరిగి చూసిచూసి చివరికి వసిష్ఠమహర్షి ఆశ్రమం చేరుకున్నాడు.

వసిష్ఠాశ్రమం అంటే సామాన్యమా? అక్కడ నానాజాతి వృక్షాలూ వున్నాయి. నానామృగాలూ వున్నాయి. సిద్ధులూ చారణులూ దేవతలూ దానవులూ గంధర్వులూ, కిన్నరులూ తరుచు వచ్చి చూసిపోతూ వుంటారు. అక్కడ ఎన్నో హరిణాలూ, మెన్నో జాతుల పక్షులూ వున్నాయి. బ్రహ్మర్షులూ దేవర్షులూ

ఎందరో వున్నారు. అగ్నికల్పులైన తపస్సిద్ధులూ, జలాహారులూ, వాయుభక్షులూ, రాలిపోయిన ఆకులు మాత్రమే భక్షించేవారూ, కందమూలఫలాలు భక్షించేవారూ, దాంతులూ దోషరహితులూ జితేంద్రియులూ అయిన వాలఖిల్యాది మహర్షులూ, జపమహోమపరాయణులైన వైఖానసాదులూ అక్కడ లెక్కలేనంతమంది వున్నారు. అది రెండో బ్రహ్మలోకం వంటిది. సాటిలేని జయశీలి అయిన విశ్వామిత్రుడు చివరికి ఆయాశ్రమం చూశాడు.

## ౪౭
## వసిష్ఠుని విందు

వీరాధివీరుడూ మహాబలపరాక్రమవంతుడూ అయిన విశ్వామిత్రుడు పరమప్రీతుడై మునిపుంగవుడైన వసిష్ఠునకు ప్రణతుడైనాడు. వసిష్ఠుడు స్వాగతం నివేదించి ఆసనం యిచ్చి యథాన్యాయంగా విశ్వామిత్రునికి ఫలాలూ మూలాలూ సమర్పించాడు. ఆసపర్యలు స్వీకరించి విశ్వామిత్ర మహారాజు వసిష్ఠుణ్ణీ తక్కినవారినీ కుశలం అడిగాడు. తరవాత వసిష్ఠుడు సుఖాసీనుడై వుండిన విశ్వామిత్రుణ్ణి ' రాజా! నీకు కుశలమే కదా ? రాజనీతి ననుసరించి రాజ్యం ఏలుతూ ప్రజలను సుఖపెడుతున్నావు గదా ? నీ భృత్యులు భయభక్తులతో మెలగుతున్నారు గదా ? నీ శత్రువులందరూ అణగారిపోయారు కదా ? నీ సేనలూ, బొక్కసమూ, మిత్రమండలీ సమృద్ధిగా వుంది కదా ? నీ పుత్ర పౌత్రులున్నూ కుశలంకదా ? ' అని అడిగాడు. వినయ వినమితుడై విశ్వామిత్రుడు ' అందరూ కుశలం అంతా లెస్సగా వుంది ' అని విన్నవించాడు.

తరవాత, వారు చాలాసేపు సంతోషంగా ఆమాటా యీమాటా చెప్పుకుని ఆనందించారు. ఇదంతా ముగిశాక వసిష్ఠుడు చిరునవ్వు

నవ్వుతూ 'రాజా! నీచతురంగబలానికీ, పరివారానికీ నీకూ ఆతిథ్యం యివ్వాలని కోరుతున్నాను. నాప్రార్థన నువ్వు అంగీకరించాలి. నువ్వు మహారాజవు. అతిథులలో శ్రేష్ఠుడవు. పూజనీయుడవు' అని విన్నవించాడు. అందుకు విశ్వామిత్రుడు 'ప్రీతితో మాట్లాడి నీఆశ్రమంలో వుండిన ఫలమూలాలాలూ పాద్యమూ ఆచమనీయమూ — విశేషించి భగవంతుడ వైన నీదివ్యదర్శనమూ ఇచ్చి పూజార్హుడ వయ్యుండిన్నీ నన్ను పూజించనే పూజించావు. లోటేమీ చెయ్యలేదు. నమస్కారం. ఇక నాకు సెలవు దయచెయ్యి. అనుగ్రహం వుంచు' అని బదులు చెప్పాడు.

వసిష్ఠుడు 'అలా కాదు, నా కోరిక తీర్చాలి' అని మళ్లీ మళ్లీ దృఢంగా కోరాడు. దానిమీద విశ్వామిత్రుడు 'మునిపుంగవా! సరే! నీ ఆజ్ఞ జవదాటడం మంచిది కాదు, అలాగే కానియ్యి. నీ కెలా యిష్టమో అలాచెయ్యి' అని చివరికి అంగీకరించాడు.

అప్పుడు వసిష్ఠుడు చిత్రవర్ణం అయిన హోమధేనువును పిలిచి 'శబళా! సబలపరివారంగా యీరాజర్షికి నేను సత్కారం చెయ్యదలుచుకున్నాను. గొప్పవారికి తగిన భోజనపదార్థాలన్నీ నువ్వు సమకూర్చాలి. షడ్రసాలలోనూ వీరిలో యెవరి కేది యిష్టమో అదల్లావారికి వడ్డించు. రసాలూ, భక్ష్యాలూ, పానకాలూ, లేహ్యాలూ, చోష్యాలూ, అన్నరాసులూ సమృద్ధిగా సిద్ధం చెయ్యి' అనిఆదేశించాడు.

## ౪౯

## కామధేనువు

వసిష్ఠుడు ఇలా చెప్పగా శబళ ఎవరి కేది యిష్టమో అదల్లా వడ్డించింది. ఇక్షువులూ తేనే పేలాలూ మైరేయం అనే మద్యమూ ఆసవం

అనే మత్స్యమూ గొప్పగొప్ప పానీయాలూ అనేకవిధా లైన పిండి వంటలూ వేడివేడి అన్నమూ ఎన్నో విధా లైన పాయసాలూ పెరుగూ పాడబాలూ బెల్లంతో సిద్ధపరిచిన మద్యమూ కొల్లలుగా సిద్ధపరిచింది. ఇలాంటి విందుభోజనాలతో వసిష్ఠుడు విశ్వామిత్రమహా రాజునూ, అతని అంతఃపురస్త్రీలనూ, పురోహితులనూ, పండితు లనూ, అమాత్యులనూ, మంత్రులనూ, భృత్యులనూ, చతురంగబలా లనూ పూజించాడు.

ఇదంతా అనుభవించి పరమానందం పొంది విశ్వామిత్రుడు 'నువ్వు నన్ను చాలా గొప్పగా సత్కరించావు. ఇక వొక్కమాట చెబుతా విను. బ్రహ్మర్షీ? నీకు లక్ష గోవుల నిస్తాను, ఈ శబళను నాకిచ్చెయ్యి. ఇది రత్నం. రాజు రత్నహారి. న్యాయంగా చూస్తే ఇది రాజు నైన నాది' అన్నాడు.

ధర్మాత్ము డైన వసిష్ఠు డిది విని 'రాజా! లక్ష కాదు, నూరు కోట్ల ఆవు లిచ్చినా వెండీ బంగారమూ కూడా రాసులకొద్దీ యిచ్చినా ఈశబళ నివ్వను. ఇది నాదగ్గిరనుంచి వెళ్లవలసింది కాదు. మనస్వికి కీర్తి యెట్టిదో నా కిది అలాంటిది. నేను చెయ్యవలసిన హావ్యమూ కవ్యమూ ప్రాణయాత్రా దీనియందే ఆయత్తమై వున్నాయి. అగ్ని హోత్రాలూ జపహోమాలూ స్వాహాకారవషట్కారాలూ వివిధా లైన విద్యలూ దీనియందే ఆయత్తమై వున్నాయి. నాసర్వస్వమూ ఇదే. నన్ను సంతుష్టిపరిచేది యిదె. ఇంకా అనేక కారణాలవల్ల నేను దీనిని నీకివ్వను' అని దృఢంగా చెప్పేశాడు.

దీనిమీద విశ్వామిత్రునికి చాలా పట్టుదల కలిగింది. వెంటనే అతనిలా చెప్పాడు. 'బంగారపు కక్ష్యలూ బంగారపు గ్రైవేయాలూ బంగారపుఅంకుశాలూ బంగారపు ఆభరణాలూ వున్న ఏనుగులు

పద్మాలుగు వేలిస్తాను. బంగారపు చిరుగంటలతో అలంకరించి నాలుగేసి తెల్లని గుర్రాలు కట్టిన బంగారపు రథాలు ఎనిమిది వంద లిస్తాను. మంచిమంచి దేశాలలో పుట్టిన కులంగల గుర్రాలు పదకొండు వేలిస్తాను. చిత్రవిచిత్రా లైన రంగులు గలిగి మంచి వయస్సులో వున్న ఆవు లొక కోటి యిస్తాను. శబళను నా కిచ్చెయ్యి. బంగారం ఎంత కావా లంటావో చెప్పు, రత్నాలున్నూ యెన్ని కావా లంటావో కూడా చెప్పు అంతా అన్నీ యిచ్చేస్తాను, నాకు శబళను ఇచ్చెయ్యి"

అయినా వసిష్ఠుడు అంగీకరించలేదు. 'నే నివ్వను' అనే మళ్లీ చెప్పేశాడు. 'ఇదే నారత్నం. ఇదే నాధనం. ఇదే నాసర్వస్వమూనూ. ఇదే నా జీవితమున్నూ. దర్శపూర్ణమాస, యజ్ఞాలు, దక్షిణలు, నానాక్రియలూ నాకిదే. నేను చేసే కర్మల కన్నిటికీ యిదే ఇక ఆధారం. వెయ్యి మాట లెందుకూ వాగడం? ఈ కామధేనువును నే నివ్వను' అని గట్టిగా చెప్పేశాడు.

## ౫౦

## శ బ ళా వి శ్వా మి త్రు ల సం కు ల స మ రం

వసిష్ఠుడు అంగీకరించి యివ్వనందున విశ్వామిత్రుడు శబళను బలవంతంగా లాగాడు. విశ్వామిత్రు డలా లాగుతూ వుండగా శబళ దుఃఖించి 'మహాత్ము డైన వసిష్ఠుడు నన్ను విడిచిపెట్టాడా? రాజభటులు నన్నెందు కీడ్చుకుపోతున్నారూ? భావితాత్ము డైన వసిష్ఠ మహర్షికి నే నేమి అపకారం చేశానూ? భక్తురాల నైన నన్ను అపరాధం చెయ్యకపోయినా వసిష్ఠుడు విడిచిపెట్టేశాడా?' అని చాలా చింతించి, దుఃఖించి, నిట్టూర్పులు విడిచి వందలకొద్దీ భటులను కూలగొట్టి వాయువేగంతో వసిష్ఠుని పాదాల దగ్గిరికి వెళ్ళి కూడింది.

వెళ్ళి, శబళ, ఏడుస్తూ ‘ బ్రహ్మపుత్రుడా ? నన్ను విడిచిపెట్టే శావా ? రాజభటులు నన్ను లాక్కుపోతున్నారు, నువ్వు చూడ లేదా ? ’ అని అడిగింది. అది విని శోకసంతప్తహృదయురాలై కన్న కూతురులాగ గోడుగోడున దుఃఖిస్తున్న శబళను చూసి వసిష్ఠుడు ‘ శబళా నిన్ను నేను విడిచిపెడతానా ? నాకు నువ్వేమి అపకారం చేశావు ? బలవంతుడైన యీ రాజు నాకూ నీకూ ఎడబంధాలు కలిగించి నిన్ను లాక్కుపోతున్నాడు. ఈరాజు సేనల నెదిరించడానికి నాకు సైన్యంలేదు. ఇతను బలవంతుడు. క్షత్రియుడు. పైగా పృథివీపతి. ఇతనికి రథగజతురంగపదాతులతో నిండిన అక్షౌహిణి సేన వుంది. అంచేత, ఇతను చాలా బలవంతుడు ’ అని బదులు చెప్పాడు.

దానిమీద శబళ అమితతేజశ్శాలి అయిన వసిష్ఠుణ్ణి చూసి ‘ మహాత్మా ! క్షత్రియునిబలం బలం కాదు. బ్రాహ్మణుడే బల వంతుడు. బ్రహ్మబలం దివ్యమైనది. అది క్షత్రియబలంకంటే గొప్పది. నువ్వు అప్రమేయబలశాలివి. అతను నీకంటే బలవంతుడు కాడు. విశ్వామిత్రుడు మహాబలవంతుడే ; కాని నీ తేజస్సు అతనికి సాధ్యమైనది కాదు. నీబ్రహ్మబలంతో నిండివున్న నన్ను నియోగించు, ఆ దురాత్ముని దర్పమూ బలమూ నాశనం చేసేస్తాను ’ అంది. వసిష్ఠుడు ‘ అయితే, పరబలవినాశకమైన బలం సృష్టించు ’ అన్నాడు.

తన ప్రభువు అయిన మహర్షి ఇలా అనగానే శబళ “ హుంభా ” అని అరిచింది. వెంటనే ఆ అరుపు వల్ల పహ్లవు లనే మ్లేచ్ఛులు వందల కొద్దీ పుట్టుకువచ్చి విశ్వామిత్రుడు చూస్తూ వుండగానే అతని సైన్యం నాశనం చేశారు. అది చూసి క్రోధపరవశుడై విశ్వామిత్రుడు రథా రూఢుడై విజృంభించి అనేక విధాలైన శస్త్రాలు ప్రయోగించి పహ్లవుల నందరినీ నాశనం చేశాడు. అది చూసి శబళ పరమక్రుద్ధ అయి యవను

లనూ శకులనూ సృష్టించింది. ఆ శకయవనులతో భూమి అంతా నిండి పోయింది. వారు మహాబలపరాక్రమాలు కలవారు. సంపంగి రేకల లాగ మెరుస్తున్న దీర్ఘకరవాలాలు ధరించివున్నారు. జలతారు బట్టలు ధరించి అగ్నికణాల్లాగ వెలుగుతున్న ఆ శకయవనులు మళ్ళీ విశ్వామిత్రుని బలం అంతా భస్మం చేసేశారు. అప్పుడు విశ్వామిత్రుడు అస్త్రాలు ప్రయోగించాడు. వాటివల్ల ఆ శకయవనులు కాంభోజులూ వ్యాకులపడిపోయారు.

## ౫౧

## వసిష్ఠుడు విశ్వామిత్రుని కొడుకులను భస్మం చెయ్యడం

అది చూసి వసిష్ఠుడు 'ఇంకా చాలామందిని సృష్టించు' అని శబళను హెచ్చరించాడు. శబళ మళ్ళీ హుంకారవం చేసింది. ఆధ్వనివల్ల సూర్యునితో సాటివచ్చే కాంభోజులు పుట్టుకువచ్చారు. పొదుగునుంచి శస్త్రపాణు లైన పహ్లవులూ, యోనినుంచి యవనులూ, శకృత్తునుంచి శకులూ, రోమకూపాలనుంచి మ్లేచ్ఛులూ హారీతులూ కీచకులూ పుట్టుకువచ్చారు. వారందరూ నిమిషంలో విశ్వామిత్రుని చతురంగ బలం అంతా దుమ్ము చేసేశారు.

విశ్వామిత్రునికి నూరుగురు కొడుకులు. వారు నానా విధా లైన ఆయుధాలూ ధరించి తపోధనుడైన వసిష్ఠునిమీద విరుచుకు పడ్డారు; కాని భగవంతుడైన వసిష్ఠుడు హుంకారం మాత్రంచేసి వారి నందరినీ బూడిదచేశాడు. వారితో చతురంగబలమున్నూ బుగ్గి అయిపోయింది.

విశ్వామిత్రుడు అది చూశాడు. సిగ్గుపడ్డాడు. చింతావిష్టుడున్నూ అయిపోయాడు. చలనం లేని సముద్రంలాగా కోర లూడిపోయిన తాచుపాములాగా రాహుగ్రస్తు డైన సూర్యుడు లాగా తేజోహీను

డై పోయాడు. రెక్కలు తెగిన పక్షిలాగ దర్పం అంతా పోయి, ఉత్సాహమున్నూ నశించి విసిగిపోయాడు. చివరికి అతను రాజ్యం యేలడానికి ఒక్క కొడుకును నియమించి పట్నానికి పంపి తా నరణ్యానికి వెళ్ళిపోయాడు. వెళ్ళి వెళ్ళి కిన్నరులూ ఉరగులూ నివసించివుండే హిమవత్పర్వతం పార్శ్వభూమికి పోయి ఈశ్వరానుగ్రహంకోసం అక్కడ గొప్ప తపస్సు ప్రారంభించాడు.

కొంతకాలానికి వృషభధ్వజుడైన మహాదేవుడు సాక్షాత్కరించి 'రాజా! నీతపస్సుకు మెచ్చాను. నీకేమి కావాలో కోరుకో యిస్తా' నన్నాడు. విశ్వామిత్రుడు సాష్టాంగనమస్కారాలు చేసి 'మహాదేవా నీకు అనుగ్రహం కలిగితే నాకు సాంగోపాంగంగానూ సోపనిషదంగానూ రహస్యాలన్నిటితోనూ ధనుర్వేదం దయచెయ్యి. దేవతలు వాడే అస్త్రాలూ, దానవులు ప్రయోగించే అస్త్రాలూ, గంధర్వులూ యక్షులూ మహర్షులూ ప్రయోగించే సకలాస్త్రాలూ నాకు దయచెయ్యి' అని కోరాడు. 'సరే యిచ్చా' నని చెప్పి శివుడు అంతర్ధానం అయిపోయాడు.

వెంటనే విశ్వామిత్రుడు క్షత్రియదర్పం పెంచుకుని పర్వసమయంలో సముద్రంలాగ మహావీర్యోత్సాహవంతుడై "వసిష్ఠుని పని అయిపోయిం" దనుకుంటూ మనోవేగంతో వెళ్లి వసిష్ఠాశ్రమంమీద మహాస్త్రాలు ప్రయోగించాడు. వెంటనే అస్త్రాల తేజస్సువల్ల ఆశ్రమం దగ్ధం అయిపోయింది. ఆశ్రమవాసులైన మును లందరూ వందలు వందలుగా పారిపోయారు. వసిష్ఠుని మృగాలూ పక్షులూ శిష్యులూ వేలు వేలుగా సకల దిక్కులకూ పారిపోయారు. క్షణంలో వసిష్ఠాశ్రమం శూన్యం అయిపోయింది. చవుటిపఱ్ఱే అయిపోయింది. 'మీా రేమీా భయపడవద్దు. సూర్యభగవానుడు మంచును నాశనం చేసేటట్టు నేను

విశ్వామిత్రుణ్ణి నాశనం చేస్తాను నిలవండి' అని మాటిమాటికీ వసిష్ఠుడు గొంతెత్తి చెబుతూవున్నా నిలవలేక అందరూ పారిపోయారు. వసిష్ఠుడు ఇలాగ స్వజనంతో చెబుతూనే విశ్వామిత్రుణ్ణి చూసి మహాకోపంతో 'చిరకాలంనుంచీ వృద్ధిచెయ్యబడ్డ ఆశ్రమం నాశనంచేసి దురాచారుడవైనావు. కనక మూఢుడా? ఇక నువ్వు బతకవు' అని చెప్పి మిక్కిలి క్రుద్ధుడై పొగలేని కాలాగ్నిలాగా, రెండో యమదండంలాగా ప్రకాసిస్తున్న బ్రహ్మదండం పట్టుకు నిలవబడ్డాడు.

## ౫౬

## వసిష్ఠుని బ్రహ్మదండం విశ్వామిత్రుణ్ణి నిస్తేజుణ్ణి చెయ్యడం

'నిలు, నిలు' అంటూ విశ్వామిత్రుడు ఆగ్నేయాస్త్రం ప్రయోగించాడు. అది చూసి వసిష్ఠుడు 'క్షత్రియాధమా! ఇదిగో నుంచునేవున్నాను. నీబలం యేమాత్రమో చూపించు. నీక్షత్రియదర్పం అంతా నాశనం చేసేస్తాను చూసుకో. నీక్షత్రియబలం యెక్కడ, నాబ్రహ్మబలం యెక్కడ? దివ్యమైన నాబ్రహ్మబలం చూసుకో' అని ఉరిమాడు. వెంటనే ఘోరమైన విశ్వామిత్రుని ఆగ్నేయాస్త్రం నీళ్లుపోస్తే నిప్పు చల్లారినట్టు బ్రహ్మదండంవల్ల చల్లబడిపోయింది.

దాంతో విశ్వామిత్రునికి చాలా కోపం వచ్చింది. వెంటనే అతను వారుణాస్త్రమూ, రౌద్రాస్త్రమూ, ఇంద్రాస్త్రమూ, పాశుపతాస్త్రమూ, ఐషీకాస్త్రమూ, మానవాస్త్రమూ, సమ్మోహనాస్త్రమూ, గాంధర్వాస్త్రమూ, శ్వాపనమూ, జృంభణమూ, మాదనమూ, సంతాపమూ, విలాపనమూ, శోషనమూ, దారణమూ, వజ్రమూ, బ్రహ్మపాశమూ, కాలపాశమూ. వరుణపాశమూ, పైనాకమూ, దయితమూ, శుష్కాశనీ, ఆర్ద్రాశనీ, పైశాచమూ, క్రౌంచమూ,

దండమూ, ధర్మచక్రమూ, కాలచక్రమూ, విష్ణుచక్రమూ, వాయవ్యమూ, మథనమూ, హయశిరస్సూ, కంకాళమూ, కాళమూ, ముసలమూ, విద్యాధరమూ, కాలమూ, త్రిశూలమూ, కాపాలమూ, కంకణమూ, — మొదలైన ఘోరాస్త్రా లొక్కొక్కటే వెంట వెంటనే ప్రయోగించాడు: కాని వసిష్ఠుని బ్రహ్మదండం వాటిని అన్నిటినీ మింగివేసింది.

వాటివల్ల లాభం లేకపోగా, విశ్వామిత్రుడు బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు. అది చూసి సకలదేవతలూ, దేవర్షులూ, గంధర్వులూ, అప్సరసలూ ఉరగులూ భయభ్రాంతు లయిపోయారు. త్రిలోకాలూ అట్లుడికిన ట్లుడికిపోయాయి; కాని మహాఘోరమైన ఆయస్త్రం కూడా వసిష్ఠుని బ్రహ్మదండం మింగివేసింది. ఆసమయంలో వసిష్ఠుని రూపం చాలా రౌద్రం అయింది. వసిష్ఠుని రోమకూపాలనుంచి అగ్నిజ్వాలలలాగ మహాతేజోమరీచులు బయలుదేరాయి. వసిష్ఠుని చేతిలో వుండిన బ్రహ్మదండమున్నూ కాలాగ్నిలాగా, యమదండం లాగా ప్రకాశించింది. అప్పుడు మును లందరూ 'మహాత్మా! నీబలం అమోఘం. విశ్వామిత్రుని బ్రహ్మాస్త్రతేజస్సును బ్రహ్మతేజస్సుతో చల్లబరుచు. విశ్వామిత్రుడు నీచేతిలో ఓడిపోయాడు. ఇక శాంతించు. లోకాలను రక్షించు' అని ప్రార్థించారు. ఇది విని వసిష్ఠుడు శాంతించాడు.

పరాభూతు డైన విశ్వామిత్రుడు నిట్టూర్పులు విడిచి 'ఒక్క బ్రహ్మదండం దగ్గిర నా సర్వాస్త్రాలూ నిష్ఫలం అయిపోయాయి. ఛీ! క్షత్రియబలం యేమి బలమూ? బ్రాహ్మణబలమే బలం. ఈసంగతి నాకిప్పటికి బాగా తెలిసింది. కనక, ఇక నేను శాంతించి ప్రసన్నేంద్రియు డ్డాయి బ్రహ్మత్వం సిద్ధించే టట్టు గొప్ప తపస్సు చేస్తాను' అనుకున్నాడు.

## ౫౩

## విశ్వామిత్రుడు రాజర్షి కావడం

తరవాత, సంతప్తహృదయుడైన విశ్వామిత్రుడు మనస్సును నిగ్రహించుకుంటూ, నిట్టూర్పులమీద నిట్టూర్పులు విడుస్తూ, భార్యతో కూడా శరావతీనదికి దక్షిణంగా బయలుదేరి వెళ్ళి, పళ్ళూ, దుంపలూ మాత్రమే భుజిస్తూ దాంతుడై మహత్తరమైన తపస్సు ప్రారంభించాడు. ఈస్థితిలో అతనికి సత్యధర్మపరాయణులైన నలుగురు కొడుకులు పుట్టారు. వారి పేళ్ళు వరసగా హవిష్యందుడూ, మధుష్యందుడూ, దృఢనేత్రుడూ, మహారథుడూ అని.

ఇలాగ, వెయ్యి సంవత్సరాలు గడిచాక బ్రహ్మదేవుడు దేవతలతో కలిసి వచ్చి 'విశ్వామిత్రా! ఈ తపస్సువల్ల నువ్వు రాజర్షుల సంపదనీ జయించావు. నువ్విప్పుడు రాజర్షివి అయినావు' అని చెప్పాడు. వెంటనే బ్రహ్మదేవుడు తన లోకానికీ, దేవతలు త్రివిష్టపానికీ వెళ్ళిపోయారు.

ఇది విని విశ్వామిత్రుడు చాలా సిగ్గుపడిపోయాడు. మొగం వంచుకుని అతను చాలా దుఃఖించి, కోపంతో 'నేను చాలా గొప్ప తపస్సు చేశాను; కాని దేవతలూ ఋషులూ నన్ను రాజర్షిగా మాత్రమే నిశ్చయించారు. నా తపస్సుకి ఇదా ఫలం?' అనుకుని, అతిప్రయత్నంతో మళ్ళీ ఘోరతపస్సు ప్రారంభించాడు.

## వసిష్ఠుడు త్రిశంకుణ్ణి తిరస్కరించడం

త్రిశంకుమహారాజు ఇక్ష్వాకువంశీయుడు. సత్యవాది. జితేంద్రియుడు. అయితే, అతను బొందితో స్వర్గానికి వెళ్ళాలనుకున్నాడు. అందుకు తగ్గ యజ్ఞం చెయ్యాలనికూడా నిశ్చయించుకున్నాడు.

ఈనిశ్చయంతో అతను వసిష్ఠుణ్ణి రావించుకుని తన కోరిక తెలియపరిచాడు; కాని వసిష్ఠుడు ‘ అసంభవం ’ అని మొగమాటం లేకుండా చెప్పేశాడు. అయినా, నిరుత్సాహపడక త్రిశంకుమహారాజు ఎలాగయినా తనకోరిక నెరవేర్చుకోవా లని దక్షిణంగా బయలుదేరి వెళ్ళి వసిష్ఠుని కొడుకులను కలుసుకున్నాడు. వారు నూరుగురు. గొప్ప తపోధనులు. ఒకచోట వారు పరమదీక్షతో తపస్సు చేసుకుంటున్నారు. వినయవినమితుడై, సిగ్గుతో తలవంచుకుని, జ్యేష్ఠానుక్రమంగా పాదాభివందనాలు చేసి దోసిలివొగ్గి ‘ మహాభాగులారా! శరణాగతులను రక్షించే మిమ్ము శరణు పొందుతున్నాను. మహాత్ముడైన మీతండ్రి నన్ను ప్రత్యాఖ్యానంచేసి పంపేశాడు. నాకు యజ్ఞం చెయ్యాలని వుంది. మీ రందుకు అనుజ్ఞ యివ్వవలసినవారు. బ్రహ్మవిదులూ తపోధనులూ అయిన మిమ్ము శిరసా నమస్కరించి కోరుతున్నాను. బొందితో స్వర్గానికి వెళ్ళా లని నాకోరిక. కనక, నాకోరిక తీరడానికి మీరు యజ్ఞం చేయించాలి. మీతండ్రిచే తిరస్కరించబడ్డ నాకు మీరు తప్ప మరి గతిలేదు. ఇక్ష్వాకువంశీయులకు అందరికీ పురోహితులే పరమగతి. విద్వాంసు లైన పురోహితులే రాజులను తరింపచేస్తారు. మీతండ్రి తరవాత మీరే నాకు భగవంతులు ’ అని మళ్ళీ మళ్ళీ నమస్కరిస్తూ చెప్పాడు.

## ౫౮

## త్రిశంకుమహారాజు చండాలుడై విశ్వామిత్రుని ఆశ్రయించడం

త్రిశంకుమహారాజు కోరిక విని వసిష్ఠపుత్రులు మండిపడ్డారు. ‘ దుర్బుద్ధీ! సత్యవాది అయిన మాతండ్రి నిన్ను ప్రత్యాఖ్యానం చేశాడు. ఆయనను కాదని నువ్వు మరొకళ్ళ నెలా ఆశ్రయించగలిగావూ? మాఇక్ష్వాకు వంశీయుల కందరికీ మాతండ్రే పరమగురువు. ఆయన మాట జరిగితీర

వలసిందే. మాతండ్రి అంతవాడు అసంభవం అని కచ్చితంగా చెప్పి నప్పుడు ఆయజ్ఞం మే మెలా చేయించగలమూ ? నువ్వొ మూర్ఖుడవు. వచ్చినదారినే నీపట్నానికి పో. యజ్ఞంచేయించడానికి త్రిలోకాలలోనూ ఒక్క మాతండ్రి మాత్రమే సమర్థుడు. ఆయనకు మేము అవమానం చెయ్యగలమా ? ' అని వారు కూడా నిరాకరించేశారు.

దాని మీద రాజు ' తపోధనులారా ! నాయనగారు నన్ను నిరాక రించారు. మీరున్నూ నిరాకరించారు. మీకు భద్రం అగుగాక. నేను మాత్రం మరొక పురోహితుణ్ణి సంపాదించుకుంటా ' నన్నాడు. అది విని వసిష్ఠపుత్రులు ' నీవుద్దేశం చాలా ఘోరంగా వుంది. కనక, నువ్వు చండాలుడ వయిపో ' అని శపించి తమ ఆశ్రమంలోలికి వెళ్ళి పోయారు.

ఆరాత్రి గడిచిపోయింది. తెల్లవారేటప్పటికి రాజు చండాలు డయిపోయాడు. చూసుకోగా శరీరం నల్లగా వుంది. కట్టుకున్న బట్టలు నల్లని వయిపోయాయి. శిరోజాలుపొట్టివయి రుప్పలా వున్నాయి. వల్లకాటిబూడిద కప్పి శరీరం గరుకయిపోయింది. ధరించిన ఆభరణాలన్నీ యినపవి అయిపోయాయి. అదంతా చూసి మంత్రులు విడిచివెళ్ళిపోయారు. వెంటవచ్చిన అనుచరులూ పౌరులూ పారిపోయారు. ఏకాకి అయిపోయాడు. అయినా ధైర్యం విడిచిపెట్టక రాత్రింబగళ్ళు దుఃఖాగ్నితో దగ్ధం అయిపోతూనే తపో ధనుడైన విశ్వామిత్రుణ్ణి వెదుక్కుంటూ వెళ్లి ఆశ్రయించాడు.

కోరిక నెరవేరకపోడమే కాక చండాలత్వం కూడా తటస్థించి దీను డయిపోయిన త్రిశంకువును చూసి విశ్వామిత్రుడు జాలిపడ్డాడు. మరిన్నీ ' రాజా ! నీకు మంగళం అగుగాక. ఎందుకోసం ఇలా వచ్చావూ? అయోధ్యాప్రభుడవు, నీకీ చండాలరూపం యెలా వచ్చింది? '

అనిన్నీ సానునయంగా అడిగాడు. దానిమీద త్రిశంకువు నమ్రుడై దోసిలివొగ్గి 'సౌమ్యుడా ! గురువైన వసిష్ఠుడు నన్ను తిరస్కరించాడు. గురుపుత్రులు శపించారు. కోరిక తీరలేదు ; గాని వికృతరూపం వచ్చింది. బొందితో స్వర్గానికి వెళ్లా లని నా అభిలాష. నేను వంద యజ్ఞాలు చేశాను. అయినా నాకేమీ ఫలం కలగలేదు. నేనిదివరలో ఎప్పుడూ అసత్యం పలకలేదు. ఇకముందున్నూ అబద్ధ మాడ దలచుకోలేదు. ఎలాంటి దురవస్థలు వచ్చినా నే నీ వ్రతం విడిచి పెట్టను. ఇది నా శపథం. అనేకవిధాలైన యజ్ఞాలు చేశాను. క్షత్రియ ధర్మం తప్పకుండా ప్రజాపాలనం చేశాను. సద్గుణాలవల్లా సదా చారాలవల్లా గురువులను సంతుష్టిపరిచాను. ధర్మమార్గం తప్ప కుండా ఇలాగ యజ్ఞం చెయ్యాలనుకుంటే నాగురువులు అంగీకరించ రాయె ; కనక, పూర్వజన్మలో చేసుకున్న మంచిచెడ్డలే బలీయా లనీ, యిప్పుడింత ధర్మంగా ప్రవర్తించినా ప్రయోజనం లేదనీ తోస్తోంది. ప్రారబ్ధాని కంతా లొక్కు. ఈకారణంవల్ల నీఅనుగ్రహం కోరుతు న్నాను. నాకు నువ్వే గతి. నీకు శుభం అగుగాక. నాకోరిక నెరవేర్చతగ్గవాడవు నువ్వే. నాకు మరో గతి లేదు. మరో శరణం లేదు. నీపురుషకారంతో నాప్రారబ్ధం జయించడానికి నీకే శక్తి వుంది.'

## XX

## విశ్వామిత్రుడు వసిష్ఠపుత్రులను ఘోరంగా శపించడం

త్రిశంకువు ఇలా చెప్పగా విశ్వామిత్రుడు కృపాళువు అయి 'ఇక్ష్వాకు వంశతిలకా ! నీకు స్వాగతం. నువ్వు బహుధార్మికుడ వని నాకు తెలుసు. భయపడకు. నిన్ను నేను కృతార్థుణ్ణి చేస్తాను. నీయజ్ఞం నిర్వహించడానికి పుణ్యకర్ములైన మహర్షుల నందరినీ నేను పిలుస్తాను.

నువ్వు తప్పకుండా యజ్ఞం చెయ్య గలవు. గురుశాపంవల్ల నీ కీరూపం వచ్చింది కదా? బెంగపెట్టుకోకు. ఈ రూపంతోనే నువ్వు బొందితో స్వర్గానికి వెళ్ళగలవు. స్వర్గం నీకు కరతలామలకమే. సందేహం లేదు. కౌశికుణ్ణి శరణుపొందిన నీకు కోరిక నెరవేరితీరుతుంది' అని ఊరడించి, పరమధార్మికులూ మహాప్రాజ్ఞులూ అయిన తన కొడుకులతో 'మీరు యజ్ఞసంభారా లన్నీ సమకూర్చండి' అని చెప్పాడు.

మరిన్నీ అతను శిష్యుల నందరినీ రావించి 'మహర్షుల కందరికీ నానమస్కారాలు విన్నవించి శిష్యు లందరితోనూ స్నేహితులతోనూ, బహుశ్రుతు లైన ఋత్విజులతోనూ నా ఆజ్ఞ అని చెప్పి తీసుకురండి. నా ప్రయత్నాలు విని యెవడేనా యేమయినా అంటే అదంతా నాకు సవిస్తరంగా చెప్పాలి. వెళ్ళండి' అని ఆజ్ఞాపించాడు. వా రందరూ వెంటనే తలో దిక్కుకీ వెళ్ళిపోయారు.

దేశదేశాలనుంచీ బ్రహ్మవాదు లైన మహర్షులు వచ్చారు. వారిని పిలవడానికి వెళ్ళివుండిన శిష్యులు వచ్చి మహాతేజశ్శాలి అయిన విశ్వామిత్రునితో "మహాత్మా! నీమాట విని బ్రహ్మవాదు లనేకులు దయచేశారు. ఇంకా దయచేస్తున్నారు. ఒక్క మహోదయమహర్షి మాత్రం రావడం లేదు. వసిష్ఠమహర్షి కొడుకులు నూరుగురూ, మహోదయమహర్షిన్నీ క్రోధంవల్ల మాటలు తడబడుతూ 'క్షత్రియుడు యజ్ఞం చేయిస్తాడా! చేసేవాడు చండాలుడా? ఆయజ్ఞానికి వచ్చి దేవతలు హవిర్భాగా లెలా పరిగ్రహిస్తారూ? మిగిలిన హవిస్సు మహర్షులు ఎలా భుజిస్తారూ? చండాలుని అన్నం తిని బ్రాహ్మణు లెలా స్వర్గానికి వెడతారూ? విశ్వామిత్రు డేమి వూహిస్తున్నాడా?' అని కళ్ళెర్రజేశారు" అని చెప్పారు.

అది విని విశ్వామిత్రుడు క్రోధతామ్రాక్షుడై 'మహాతపశ్శాలి నయిన నన్ను దూషించిన దురాత్ములు భస్మం అయిపోతారు. ఇప్పుడే

వాళ్లు కాలుని వాతబడతారు. ఏడువందల జన్మలవరకూ వాళ్లు పీనుగు లను పీక్కుని తింటూ వుంటారు. కుక్కమాంసమే వాళ్లకి నియత మైన ఆహారం. ముష్టికు లనే హీనజాతిలో పుడతారు. వికృతులూ కురూపులూ అయి దేశాలు తిరుగుతూ వుంటారు. దుర్బుద్ధి అయి, దూషించరాని నన్ను దూషించిన మహోదయుడు కిరాతు డయి పోతాడు. ఎప్పటికప్పుడే ప్రాణం తీసుకోడానికి ప్రయత్నిస్తూ ఆమహో దయుడు నాక్రోధంవల్ల ' అయ్యో ' అనేవాడు లేకుండా దీర్ఘకాలం దుర్గతి అనుభవిస్తాడు ' అని మహర్షుల మధ్య నుంచుని పలికాడు.

## ౫౬

## త్రిశంకుడు బొందితో స్వర్గానికి వెళ్లిపోడం

వసిష్ఠపుత్రులనూ మహోదయుణ్ణీ ఇలాగ శపించి విశ్వామిత్రుడు మహ ర్షులను చూసి " ఇతను ఇక్ష్వాకువంశీయుడు. ఇతని పేరు త్రిశంకుడు. చాలా ప్రఖ్యాతి పొందిన మహారాజు. ధర్మాత్ముడు. గొప్ప దాత. ప్రస్తుతం నన్ను శరణు పొందాడు. బొందితో స్వర్గానికి వెళ్లా లని యితని కోరిక. ఇతని కోరిక నెరవేరేటట్టు మీరూ నేనూ కలిసి ఇతని చేత యజ్ఞం చేయించాలి " అని చెప్పాడు.

ఇది విని ధర్మజ్ఞు లైన ఆమహర్షు లందరూ ఒకచోట చేరి ఈకౌశిక మహర్షి పరమకోపిష్ఠి. కనక, ఇతను చెప్పిన పని చేసితీరాలి. అణు మాత్రమూ సందేహించడానికి వీలులేదు. అగ్నికల్పు డైన యితను, కోపం వచ్చిందంటే మనలనుకూడా శపించేస్తాడు. కనక, విశ్వామిత్రుని ప్రభావంవల్ల త్రిశంకును సశరీరంగా స్వర్గానికి వెళ్లేటట్టు యజ్ఞం నెరవేరు ద్దాం' అని కూడబలుక్కుని చెయ్యవలసిన పను లన్నీ చేశారు. మహా తేజశ్శాలి అయిన విశ్వామిత్రుడు అధ్వర్యు డయి యజ్ఞారంభంచేశాడు.

ఋత్విజు లందరూ యాజ్ఞికులుగానూ యథాశాస్త్రంగానూ కార్య లన్నీ సమంత్రకంగా జరిపేశారు.

విశ్వామిత్రుడు హవిర్భాగాలు పుచ్చుకోడానికి దేవతల నందరినీ ఆవాహనం చేశాడు; కాని యెవరూ రాలేదు. దానిమీద క్రోధా విష్టుడై విశ్వామిత్రుడు స్రువం చేతబట్టి 'రాజా! ఇదే నిన్ను సశరీరంగా స్వర్గానికి పంపుతున్నాను, నా తపశ్శక్తి చూసుకో. దుర్లభం అయిన స్వర్గానికి బొందితో వెళ్ళిపో.' అని దృఢంగా పలికాడు.

వెంటనే, మునులు చూస్తూ వుండగా త్రిశంకుడు బొందితో స్వర్గానికి వెళ్ళిపోయాడు. కాని, అక్కడ దేవలోకంలో సురగణా లతో కొలువుతీరి వుండిన ఇంద్రుడు త్రిశంకుణ్ణి చూసి 'ఓరీ, మూఢా! నువ్వు గురుశాపం పొందావు. నువ్వు స్వర్గంలో వుండతగ్గవాడవు కావు. కనక, మళ్ళీ భూలోకానికి తలకిందులుగా పడిపో' అన్నాడు. అనగానే త్రిశంకుడు 'విశ్వామిత్రమహర్షీ! నన్ను రక్షించు, రక్షించు' అని గోలపెడుతూ పడిపోయాడు.

అదిచూసి విశ్వామిత్రుడు మిక్కిలీ రుష్టుడై ఇంకా పడుతున్న త్రిశంకుణ్ణి 'అక్కడే వుండిపో' అని పలికి, అలాగే ఆమునుల మధ్యే నుంచుని, ఉత్తరధ్రువం చుట్టూ సప్తర్షు లున్నారు కనక, త్రిశంకుని చుట్టూ మరో సప్తర్షి మండలమూ, అశ్విన్యాదిగా మరో యిరవయ్యేడు నక్షత్రాలూ నక్షత్రమండలమూ సృష్టించాడు. మరిన్నీ, అక్కడే వుండి మరీక్రోధం వహించి 'ఈకొత్త స్వర్గంలో మరో యింద్రుణ్ణి సృజిస్తాను. లేక ఇంద్రుడే లేకపోవుగాక. దేవతలను కూడా యిక్కడ సృజిస్తాను' అంటూ పూనుకున్నాడు. అదిచూసి సురాసురలూ మహర్షులూ భయభ్రాంతు లయిపోయి పరుగుపరుగున వచ్చి 'విశ్వా మిత్ర మహర్షీ! ఈ త్రిశంకుమహారాజు గురుశాపం పొంది వున్నాడు.

ఏమయినా యితను సశరీరంగా స్వర్గసుఖం పొందడాని కర్హుడు కాడు. ఆలోచించు ' అని జతిమాలుతూ అన్నారు.

అందుకు విశ్వామిత్రుడు దేవతలను చూసి ' మీకు భద్రం అగుగాక. కాని, త్రిశంకుమహారాజుని బొందితో స్వర్గానికి పంపుతా నని నేను ప్రతిజ్ఞ చేశాను. ఈమాట అబద్ధం కాకూడదు, చెల్లితీరాలి. ఇతనికి సశరీరంగా శాశ్వతస్వర్గసుఖం అనుభూతం కావలసిందే. నేను సృష్టించిన యీనక్షత్రాలున్నూ శాశ్వతంగా వుండిపోవలసిందే. లోకాలన్నీ వున్నంతకాలమూ నా సృష్టిన్నీ వుండాలి తప్పదు. మీ రిందు కంగీకరించితీరాలి. ' చేసేది లేక దేవతలు అప్పుడు విశ్వామిత్రుణ్ణి చూసి ' మహర్షీ ! నీకు భద్రం అగుగాక. నీ సృష్టి అంతా వైశ్వానరపథానికి బయట శాశ్వతంగానే వుండుగాక. త్రిశంకుడున్నూ అమరులతో సమానుడై—కాని—తలకిందులుగా ఆనక్షత్రాలమధ్య జాజ్వల్యమానుడై వుండుగాక. ఈ నక్షత్రా లన్నీ అతన్ని అనుసరించి వుంటాయి. ఇతను కృతార్థు డైనాడు. కీర్తిమంతు డైనాడు, స్వర్గ వాసి అయినాడు ' అని అంగీకరించి విశ్వామిత్రుణ్ణి అనేకవిధాల స్తుతిచేశారు.

యజ్ఞం పూర్తి అయింది. వచ్చినవా రందరూ సత్కృతులై వెళ్ళి పోయారు.

## ౫౭

## అంబరీషుడు శునశ్శేఫుణ్ణి యజ్ఞపశువుగా కొనడం

మహర్షు లంతా వెళ్ళిపోయాక, విశ్వామిత్రుడు తన ఆశ్రమంలో వుండే మునులతో ' ఈదక్షిణదిక్కు మంచిది కాదు. ఇక్కడ మన కన్నీ విఘ్నాలే తటస్థించాయి. మరో దిక్కు చూసుకుని అక్కడ తపస్సు చేసుకుందాం. పడమట పుష్కరతీర్థం చాలా ప్రశస్తం. అక్కడ

సుఖంగా కాలం గడపవచ్చు పదండి' అని చెప్పి బయలుదేరిపోయి ఫలమూలాలు మాత్రమే భుజిస్తూ అత్యుగ్రంగా తపస్సు ప్రారంభించాడు.

ఇక్కడ యిదిలా వుండగా, అక్కడ అయోధ్యాధిపతి అయిన అంబరీషుడు యజ్ఞం ప్రారంభించాడు. యజ్ఞం జరుగుతూ వుండగా ఇంద్రుడు వచ్చి పశువును హరించుకునిపోయాడు. 'రాజా! దుర్నయులై యెవరో పశువును తీసుకుపోయారు. పశువును భద్రపరుచుకోలేని రాజును దోషాలు చెరుస్తాయి. ఇప్పుడు ఇక్కడ జరగవలసిన ప్రాయశ్చిత్తం చాలా గొప్పది. వెదికి యెలాగో వోకలాగ ఆపశువునే తీసుకురావాలి. లేకపోతే నరపశువునే ఉపయోగించాలి; కాని మరి వేరే దారి లేదు' అని ఋత్విక్కులు చెప్పారు.

దానిమీద అంబరీషుడు నరపశువుకోసం బయలుదేరాడు. దేశదేశాలు తిరిగాడు. నగరాలు—పట్నాలు—పల్లెలు—మున్యాశ్రమాలు చూశాడు. నరపశువును ఇచ్చినవారికి వేలకొద్దీ ఆవు లిస్తా నన్నాడు; కాని యెక్కడా యెవరూ అంగీకరించలేదు. తిరగ్గా తిరగ్గా భృగుతుంగం అనే స్థలంలో ఋచీకు డనే మహర్షి కనపడ్డాడు. అతనికి భార్యా ముగ్గురు కొడుకులూ వున్నారు. అమితప్రభుడైన అంబరీషుడు ఋచీకుణ్ణి కుశలప్రశ్నాదికం చేసి గొప్పగా పూజించి, తన సంగతి అంతా చెప్పి 'లక్ష ఆవు లిస్తాను, యాగపశువుగా నీకొడుకు నివ్వగలవా? అలా చేస్తే నేను కృతార్థుణ్ణవుతాను' అని విన్నవించుకున్నాడు. 'దేశా లన్నీ తిరిగి విసిగిపోయాను. అనుగ్రహించు' అని ప్రార్థించాడు.

దానికి ఋచీకుడు 'రాజా! నీమాట బాగానే వుంది. ఏవిధంగానూ కూడా నేను నాపెద్దకొడుకుని మాత్రం అమ్మలేను" అన్నాడు.

ఆమాట విని తపస్విని అయిన అతని భార్య ‘ భార్గవు డైన నాభర్త మాపెద్దబ్బాయిని ఇవ్వలేనన్నారు. నాకడసారపుఅబ్బాయిని నేనివ్వ లేను. రాజా! తండ్రులకు జ్యేష్ఠపుత్రులమీాదా తల్లులకు కడసారపు కొడుకులమీాదా ప్రేమ ఎక్కువగా వుంటుంది. నీకిది తెలవనిది కన కనా ’ అంది.

వారి రెండో కొడుకు పేరు శునశ్శేపుడు. అతను అంబరీశుణ్ణి చూసి ‘ రాజా! ఇకిక సందేహం యెందుకూ? మాఅన్నను మానా యన అమ్మడు. మాతమ్ముణ్ణి మా అమ్మ అమ్మదు. ఇక మిగిలినవాణ్ణి, నన్ను వారు విక్రయించినట్టే. కనక క్రయధనం వారి కిచ్చివేసి నన్ను తీసుకుపో ’ అన్నాడు. తరవాత చెప్పవలసింది చెప్పి, చెయ్యాదివలసిందిన్నీ చేసి, శునశ్శేపుణ్ణి రథం యెక్కించుకుని అంబరీషుడు బయలుదేరాడు.”

## ౫౮

## తన కొడుకులను శపించి విశ్వామిత్రుడు శునశ్శేపుణ్ణి రక్షించటం

ఇలాగ శునశ్శేపుణ్ణి రథం యెక్కించుకుని బయలుదేరిన అంబరీషుడు మధ్యాహ్నం అయ్యేటప్పటికి పుష్కరతీర్థం దగ్గిరికి వచ్చి విశ్రమించడా నికి అక్కడ బసచేశాడు. అక్కడ నివసించి తన మేనమామ అయిన విశ్వామిత్రుడు ఆశ్రమం నిర్మించుకుని తపస్సు చేసుకుంటున్నాడని శున శ్శేపుడికి తెలిసింది. వెంటనే, మొగం వాడిపోయి దీనుడై వుండిన శున శ్శేపుడు గబగబా వెళ్లి విశ్వామిత్రుని వొడిలో పడి ‘మహర్షి పుంగవా! నాకు తల్లిలేదు. తండ్రీ లేదు. ఇక బాంధవులూ జ్ఞాతులూ యెక్కడ వుంటారూ? ధర్మం గుర్తించి నువ్వు నన్ను రక్షించు. అంద రికీ నువ్వే మేలుచేసేవాడవు. అటు అంబరీషుని కార్యం నెరవేరాలి, ఇటు నాకు దీర్ఘాయువూ సిద్ధించాలి. అత్యుత్తమంగా తపస్సు చేసుకుని

నేను స్వర్గసుఖా లందుకోవాలి. అనాథుణ్ణయిన నాకు నువ్వే నాథుడవు. తండ్రివయి ధర్మాత్ముడైన పుత్రుణ్ణి రక్షించేటట్టు నన్ను రక్షించు' అంటూ ప్రార్థించాడు.

అది విని మహాతపశ్శాలి అయిన విశ్వామిత్రుడు అతణ్ణి అనేక విధాల ఓదార్చి, తన కొడుకులను చూసి 'ఎందుకోసం పురుషులు కొడుకులను కంటారో! మీకూ నాకూ కూడా పరలోకంలో హితం కలిగించే అందుకు ఇప్పుడు సమయం వచ్చింది. ఇతను కుర్రవాడు. పైగా, మునిపుత్రుడు. నన్ను శరణుపొందాడు. నాయనలారా! ఇతణ్ణి, జీవితదానం చేసి రక్షించండి. మీలో ప్రతీవాడూ సుకృతం చేసినవాడే. ప్రతీవాడూ ధర్మపరాయణుడే. కనక అంబరీషుని యజ్ఞంలో మీలో వొకడు పశుత్వం అంగీకరించి ఇతనికి అగ్ని దేవునికి తృప్తి కలిగించండి. దానివల్ల ఇతను దిక్కున్నవాడూ అవుతాడు. అంబరీషుని యజ్ఞమూ నిర్విఘ్నంగా నెరవేరుతుంది. దేవతలు తృప్తీ పడతారు. నామాటా చెల్లుబడి అవుతుంది' అని చెప్పాడు; కాని మధుష్యందుడూ మొదలైన అతని కొడుకులు అది విని గర్వంగానూ పరిహాసంగానూ 'విభూ! నీకొడుకులను విడిచిపెట్టి అన్యులకొడుకుని నువ్వెలా రక్షిస్తావూ? ఇది అన్నానికి బదులు కుక్కమాంసం లాగ అకార్యం అని మేము తలుస్తాము' అన్నారు.

విశ్వామిత్రు డీమాటలు విని క్రోధరక్తాక్షుడై 'మీరు తండ్రినైన నామాట పరిహాసించారు. ఇది ధర్మవిరుద్ధం. చాలా దారుణమైనది. సత్పురుషులను స్తబ్ధులను చేసేమాట అన్నారు మీరు. ఇందుకు ఫలంగా వసిష్ఠుని కొడుకుల్లాగ మీరు ముష్టికజాతియందు పుట్టి కుక్కమాంసం తింటూ భూమిమీద వెయ్యేళ్లు బతకండి' అని కొడుకులను శపించి ఆర్తుడైన శునశ్శేఫుణ్ణి చూసి, ముందు మంత్రించిన విభూతితో రక్షచేసి 'నీకు ఎర్రని గంధం పూసి ఎర్రని పూల

దండలు వేసి దర్భతాళ్లతో నిన్ను వైష్ణవయూపానికి కడతారు. అప్పుడు నువ్వు అగ్నిని ఆగ్నేయాలైన ఋక్కులతో స్తోత్రం చెయ్యి. మరిన్నీ, నేను నీకు ఇప్పుడు ఇంద్రునికి సంబంధించిన గాథనూ ఉపేంద్రునికి సంబంధించిన గాథనూ వుపదేశిస్తాను. అప్పుడు ఈవిద్యలు ఉపాసన చెయ్యి. అలా చేస్తే నీకు ఈగండం గడుస్తుంది.' అని చెప్పి ఆ గాథలు వుపదేశించాడు. వెంటనే శునశ్శేఫుడు 'రాజా! మనం ఇక పోదాము. యజ్ఞదీక్ష వహించు' అన్నాడు. రాజందు కానందించి బయలుదేరివెళ్లి, యజ్ఞశాల ప్రవేశించాడు. ఋత్విక్కులు ఎర్రని బట్టలు కట్టించి ఎర్రని గంధం పూయించి ఎర్రని పూలదండలు వేయించి శునశ్శేఫుణ్ణి యూపానికి కట్టారు. వెంటనే విశ్వామిత్రుడు చెప్పిన ప్రకారం శునశ్శేఫుడు ఆరెండు గాథలూ యథావిధిగా ఉపాసించి దేవతలను ఆనందపెట్టాడు.

అంతట, దేవేంద్రుడు, శునశ్శేఫుడు రహస్యంగా చేసిన స్తోత్రానికి మెచ్చి అతనికి దీర్ఘాయుర్దాయం ఇచ్చాడు. అంబరీషునికి యజ్ఞఫలమున్నూ ఇచ్చాడు. తరవాత మరో వెయ్యిసంవత్సరాలు విశ్వామిత్రుడు పుష్కరతీర్థంలో ఉగ్రమైన తపస్సు చేశాడు.

## ౫౬

## మేనక విశ్వామిత్రుని తపస్సు భంగపరచడం

వెయ్యిసంవత్సరాలూ పూర్తి కాగానే దేవతలు తపఃఫలం ఇవ్వడానికి విశ్వామిత్రుని దగ్గిరికి వచ్చారు. మహాతేజశ్శాలి అయిన బ్రహ్మ 'విశ్వామిత్రా! నువ్వు చేసిన శుభకర్మలవల్ల నువ్వు ఋషివి అయినావు' అని చక్కగా చెప్పాడు.

ఇదయినాక దేవత లందరూ వెళ్ళిపోయారు ; కాని అంతటితో తృప్తిపడక విశ్వామిత్రుడు మళ్లీ గొప్ప తపస్సు ప్రారంభించాడు.

తరవాత చాలా కాలం గడిచాక పేరుపొందిన అప్సరస అయిన మేనక, ఒకనాడు పుష్కరతీర్థంలో స్నానం చేస్తూ వుండింది. నీల మేఘంలో మెరుపులాగ నీటిలో త్రిలోకసుందరి అయి వుండిన ఆమెని చూసి విశ్వామిత్రుడు మన్మథవశుడై 'సుందరీ ! నీకు స్వాగతం, నాతో వచ్చి నాఆశ్రమంలో నివసించు. మన్మథవశు ణ్ణయివున్న నన్ను అనుగ్రహించు ' అని కోరాడు. ఆమె అందు కంగీకరించింది.

ఆమె విశ్వామిత్రుని దగ్గిర వుండగా సుఖంగా పదిసంవత్సరాలు గడిచిపోయాయి. అప్పుడు విశ్వామిత్రుడు సిగ్గుపడి తనలో తనని అసహ్యించుకుని 'ఇదంతా నా తపస్సు హరించడానికి దేవతలు చేసిన పని. ఈ పదిసంవత్సరాలూ ఒక్క పగలూ రాత్రీ లాగ గడిచిపోయాయి. కామమోహావశు ణ్ణయిపోవడంవల్ల నాకీ గొప్ప విఘ్నం తటస్థించింది ' అని నిట్టూర్పులు విడుస్తూ చాలా దుఃఖించాడు.

అది చూసి భయభ్రాంతురాలై మేనక వొణికిపోతూ, మాటరాక 'రక్షించు ' అన్నట్టు దోసిలివొగ్గి నిలిచిపోయింది. అందుకు ఆమెని తియ్యనిమాటలతో ధైర్యం చెప్పి వెళ్ళిపో అని పంపివేసి, అతను, హిమవత్పర్వతానికి పోయి కౌశికీనది వొడ్డున ఇంద్రియాలను నిగ్రహించడానికి దృఢనిష్ఠతో దారుణ మైన తపస్సు ప్రారంభించాడు. ఇలాగ అతను వెయ్యి సంవత్సరాలు తపస్సు చేశాటప్పటికి దేవతలకు భయం పట్టుకుంది. అంతట దేవత లందరూ మహర్షులతో కలిసివెళ్ళి 'దేవా ! విశ్వామిత్రుడు గొప్ప తపస్సు చేశాడు. అతను మహర్షి పదవి పొందతగ్గవాడు ' అని చెప్పారు. ఆమాట విని వచ్చి బ్రహ్మ

' విశ్వామిత్రమహర్షీ ! నీకు స్వాగతం. నీతపస్సు నాకు మెప్పు కలిగించింది. నీకు మహర్షి పదవి యిచ్చాను ' అన్నాడు; కాని దానికి విశ్వామిత్రుడు విచారించనూలేదు, సంతోషించనూలేదు. ప్రాంజలి అయి ప్రణతుడున్నూ అయి ' భగవన్ ! నేను స్వార్జితాలైన శుభకర్మలవల్ల మహర్షి పదవి పొందా నని నువ్వంటే, నేను విజితేంద్రియు ణ్ణయినట్టే కాదూ ? ' అని అడిగాడు. దానికి బ్రహ్మ ' ఎన్ని కారణాలు వచ్చినా నువ్వు ఇంద్రియవికారం పొందకుండా వుండగలిగేటంతవరకూ నువ్వు ప్రయత్నించు ' అని బదులు చెప్పి దేవలోకానికి వెళ్ళిపోయాడు.

దేవతలు వెళ్ళిపోయాక విశ్వామిత్రుడు ఊర్ధ్వబాహు డయి నిరాలంబుడున్నూ అయి వాయుభక్షణం మాత్రం చేస్తూ, వేసవికాలంలో పంచాగ్నిహోత్రాల మధ్యా, వర్షాకాలంలో ఆరుబయటా శీతాకాలంలో రాత్రింబగళ్ళు నీళ్ళల్లోనూ వుంటూ వెయ్యి సంవత్సరాలు ఘోరతపస్సు చేశాడు. దానివల్ల దేవత లందరూ తహతహ లాడిపోయారు. అప్పుడు దేవేంద్రుడు, దేవతలందరూ పరివేష్టించివుండగా సుధర్మాసీనుడై రంభను చూసి తనకు మేలూ, విశ్వామిత్రునికి కీడూ కలిగేటట్టు ఇలా అన్నాడు.

## ౬౦

## వి శ్వా మి త్రు డు ర ం భ ను శ పి ం చ డ ం

' రంభా ! ఇది దేవకార్యం. కనక నువ్వు అతిజాగ్రత్తగా చెయ్యాలి. విశ్వామిత్రుణ్ణి నువ్వు మన్మథతంత్రంలోకి దింపాలి. ఇది దేవకార్యం,

ఇంద్రు డిలా చెప్పగా రంభ సిగ్గుపడి చివరికి ధైర్యం తెచ్చుకుని ఇంద్రునితో ' విశ్వామిత్రముని ఘోర మైన కోపం కలవాడు. నన్ను చూశా డంటే మండిపడతాడు, సంశయం లేదు. అతణ్ణి చూడ్డం

అంటే నాకు మహాభయం కనక, నన్నునుగ్రహించు' అని బతిమా లింది; కాని అందు కంగీకరించక ఇంద్రుడు 'రంభా! భయపడకు. నీకు భద్రం అగుగాక, నేను చెప్పినట్టు చెయ్యి. వసంతఋతువు రాగానే నేను మధురంగా పాడే కోవిలపిట్ట నయి, నీకు సమీపాన మన్మథునితో కూడా ఒక చక్కని చెట్టుమీద వుంటాను. నువ్వు చాలా చక్కగా అలంకరించుకుని వెళ్ళి విశ్వామిత్రుని మనస్సు చలించేటట్టు నడుచుకో' అని మళ్ళీ చెప్పాడు.

తప్పనిసరి కావడంవల్ల సరే అని రంభ చక్కగా అలంకరించు కుని వెళ్లి విశ్వామిత్రుని యెదట నుంచుంది. అప్పుడు కోయిల కమ్మగా కూసింది. రంభకూడా పాడింది. వెంటనే అతనికి ఉల్లాసం కలిగింది. రంభను చూశాడు. వెంటనే అతనికి సందేహం కలిగింది. పరకాయించాడు. ఇదంతా ఇంద్రుడు చేసిన కుట్ర అని తెలిసి పోయింది. అంతట మండిపడి విశ్వామిత్రుడు పళ్లు పటపట్లాడిస్తూ 'కామక్రోధాలు జయించ బూనుకున్న నన్ను నువ్వు చెరపడానికి వచ్చావు; కనక, నల్లరాయి వయిపోయి నువ్వు పదివేలసంవత్స రాలు పడివుండు' అని శపించేశాడు. మరిన్నీ 'రంభా! తపో బలసంపన్నుడూ మహాతేజశ్శాలీ అయిన బ్రాహ్మణు డొకడు నిన్నుద్ధరిస్తాడు' అని శాపాంతం అనుగ్రహించాడు: కాని తాను క్రోధం జయించలేనందుకు చాలా దుఃఖించాడు. వెంటనే రంభ నల్ల రాయి అయిపోయింది. ఈశాపం వినీ వినగానే ఇంద్రుడూ మన్మథుడు పారిపోయారు.

ఇలాగ కోపం తగ్గించుకోలేక ఈవిధంగా ఇంద్రియాలను నిగ్రహించు కోలేక పోయినందుకు విశ్వామిత్రుడు చాలా విచారించి 'యేది యే మయినా ఇక కోపం రానివ్వను. మాటే ఆడను. ఎన్ని వందల సంవత్స రాలయినా నిట్టూర్పులు కూడా రాకుండా జాగ్రత్తపడతాను. ఇలాగ

విజితేంద్రియుణ్ణయి తపస్సు చేసి బ్రాహ్మణ్యం సిద్ధించేదాకా నన్ను నేనే శోషింపచేసుకుంటాను. అన్నం ముట్టను. తపోనిష్ఠుణ్ణయి వుంటాను కనక, నా శరీరం చెడిపోదు' అని ప్రతిజ్ఞ పట్టి వెయ్యి సంవత్సరాలు దీక్షగా ప్రతిజ్ఞ నిలుపుకున్నాడు.

## ౬౧

## బ్రహ్మర్షి వయినావని వసిష్ఠుడే విశ్వామిత్రునితో చెప్పడం

ఇలా ప్రతిజ్ఞపట్టి విశ్వామిత్రుడు ఉత్తరదిక్కు విడిచిపెట్టి తూర్పుదిక్కుకు వెళ్ళి మౌనం వహించి ఘోరమైన తపస్సు చేశాడు. వెయ్యి సంవత్సరాలు గడిచినా కొయ్యలాగ స్థిరంగా వుండడంవల్ల ఎన్ని విఘ్నాలు వచ్చినా అతను క్రోధం అనేదాన్ని దగ్గిరికి రానివ్వలేదు. వెయ్యి సంవత్సరాలూ గడిచాక అతను ఒకనాడు భోజనానికి కూచున్నాడు; కాని ఎలాగేనా అతనికి వ్రతభంగం కలిగించాలని నిశ్చయించుకుని ఇంద్రుడు బ్రాహ్మణుడయి వచ్చి "ఆ అన్నం నాకు పెట్టు" అని అడిగాడు. విశ్వామిత్రుడు నిశ్చింతగా అన్నం అంతా బ్రాహ్మణునికి ఇచ్చేశాడు. బ్రాహ్మణుడొక్క మెతుకయినా మిగల్చకుండా తిన్నా అతను చలించక ఈషత్తయినా కోపించక పోవడమే కాక, ఒక్క మాటయినా ఆడకుండా మౌనవ్రతం కూడా నిలుపుకున్నాడు.

తరవాత విశ్వామిత్రుడు నిట్టూర్పు అయినా విడవకుండా మరో వెయ్యి సంవత్సరాలు ఉగ్రతపస్సు చేశాడు. దాంతో మూడు లోకాలూ మాడిపోయేటట్టు అతని శిరస్సునుంచి అపారంగా పొగ పుట్టింది. అప్పుడు దేవతలూ గంధర్వులూ పన్నగులూ అసురులూ రాక్షసులూ అతని తేజస్సువల్ల మూర్ఛిల్లి తేజోహీనులయి పోయి బ్రహ్మదగ్గిరికి వెళ్ళి 'దేవా! అనేక కారణాలు కల్పించి ఎంత లోభ

పెట్టినా ఏమిచేసినా చలించక మహోగ్రతపోనిష్ఠ డయ్యే వున్నాడు. అతనికి రాగద్వేషాలు లేశమూ లేవు. అతను కోరిన కోరిక నువ్వు తీర్చకపోతే తపస్సుతో చరాచరాత్మక మైన జగత్తంతా దగ్ధం చేసేస్తాడు. దిక్కు లన్నీ కలతపడి వున్నాయి. సముద్రా లన్నీ కంపించిపోతున్నాయి. పర్వతాలు కదలిపోతున్నాయి. భూమండలం అల్లల్లాడిపోతోంది. గాలి వీచడం లేదు. త్రిలోకాలూ క్షుభితా లయిపోతున్నాయి. సూర్యుడు కూడా తేజోహీను డయిపోతున్నాడు. అతను జగత్తంతా నాశనం చేసెయ్యా లనుకోక ముందే అతను ఏమి కోరితే అది — దేవరాజ్యం కావా లన్నా యిచ్చెయ్యి' అని విన్నవించారు.

ఇక చేసేది లేక బ్రహ్మ వారినందరినీ వెంట బెట్టుకువెళ్లి 'బ్రహ్మర్షీ! నీకు స్వాగతం. నీతపస్సుకి మేమందరమూ చాలా సంతోషించాము. ఉగ్రమైన తపస్సు చేసి నువ్వు బ్రాహ్మణ్యం సంపాదించుకున్నావు. నీకు దీర్ఘాయుం కూడా యిచ్చాను. నీకు శుభం అగుగాక, ఇక నువ్వు స్వేచ్ఛగా వెళ్లిపోవచ్చు' నని చెప్పాడు.

ఇలాగ బ్రహ్మ దేవతలూ చెప్పిన మాట లన్నీ విని విశ్వామిత్రుడు సంతోషించి నమస్కారాలు అర్పించి 'బ్రాహ్మణ్యమూ దీర్ఘాయువూ నాకు సిద్ధించి నట్టయితే అధ్యయనాధ్యాపనాధికారమూ, యజన యాజనాధికారమూ గూడా నాకు సిద్ధించాలి. మరిన్నీ, క్షత్రవేద విదుడూ బ్రహ్మవేదవిదుడూ బ్రహ్మ పుత్రుడూ అయిన వసిష్ఠుడుకూడా వచ్చి ఈమాట అనాలి. నా యీకోరికి నెరవేర్చితిరా మీరు వెళ్లిపోవచ్చును' అని దృఢంగా చెప్పాడు.

అప్పుడు దేవతలందరూ వెళ్ళి కోరగా వసిష్ఠుడు వచ్చి 'విశ్వామిత్రా! నువ్వు బ్రహ్మర్షి వయినావు' అని చెప్పి అతనితో

స్నేహం చేశాడు. దేవతలున్నూ ' నువ్వు బ్రహ్మర్షివే. ఏమీూ సందేహం లేదు. నువ్వుకోరిన వన్నీ నీకు సిద్ధిస్తాయి' అని చెప్పారు.

ఇలాగ బ్రహ్మర్షి అయి విశ్వామిత్రుడు వసిష్ఠుణ్ణి గొప్పగా పూజించాడు. మరిన్నీ ఒక్కమాటు భూమండలం అంతా తిరిగిన్నీ వచ్చాడు.

రామా! ఈవిశ్వామిత్రుడు ఇలాగ బ్రహ్మర్షి అయి బ్రాహ్మణ్యం పొందాడు. ఈ విశ్వామిత్రుడు మహర్షులలో శ్రేష్ఠుడు. రూపొందిన తపస్సు. ఇతనెప్పుడూ ధర్మపరుడే. బలపరాక్రమాలలో ఇంతవాడు మరి లేడు."

## జనకుడు విశ్వామిత్రుణ్ణి పూజించడం

ఇలా చెప్పి శతానందుడు విరమించాడు. అప్పుడు జనకుడు రామలక్ష్మణుల యెదట విశ్వామిత్రుణ్ణి చూసి దోసిలివొగ్గి "రామలక్ష్మణులతో నువ్వు నాయజ్ఞానికి రావడంవల్ల నేను ధన్యుణ్ణయినాను. అనుగ్రహించబడ్డాను. దర్శనం యిచ్చి నువ్వు నన్నేలినవాడ వయినావు. మహాభాగా! బ్రహ్మర్షుల కెల్ల శిరోమణి వయిన విశ్వామిత్రా! నీసందర్శనంవల్ల నాకు అనేకసుగుణా లలవడ్డాయి. త్రిలోకవిఖ్యాత మైన నీతపోవృత్తాంతం నేనూ రాముడూ సవిస్తరంగా తెలుసుకున్నాము. ఈసభలో వున్నవారున్నూ నీ అసాధారణశక్తియుక్తులు తెలుసుకున్నారు. నీతపస్సు అప్రమేయం. నీబలమున్నూ అప్రమేయం. నీగుణాలన్నీ అప్రమేయాలు. బ్రహ్మదేవుని కథలు వింటున్నా, మహేశ్వరుని కథలు వింటున్నా ఎలా తృప్తి కలగదో నీకథలు విన్నా అలాగే నాకు తృప్తి కావడం లేదు. బ్రహ్మర్షీ! అదే సూర్యాస్తమయం కాబోతోంది. కర్మకాలం అతిక్రమించకుండా నేను యజ్ఞశాలకు వెళ్లవలసివుంది. రేపుదయం మళ్లీ నన్ను చూడగలవు. నీకు స్వాగతం. నాకు సెలవుదయచెయ్యి" అని విన్నవించుకున్నాడు.

విశ్వామిత్రుడు అందుకు చాలా సంతోషించి జనకుణ్ణి అనేకవిధాల ప్రశంసించి సెలవిచ్చాడు. జనకుడు విశ్వామిత్రునికి ప్రదక్షిణ నమస్కారాలు సమర్పించి వెళ్లిపోయాడు. విశ్వామిత్రుడున్నూ రామలక్ష్మణులను వెంటబెట్టుకుని తన బసకు వెళ్లాడు.

## ౬౨

## జనకుడు విశ్వామిత్రునికి శివధనుస్సు సంగతి చెప్పడం

తెల్లవారాక, జనకుడు, అప్పుడు చెయ్యవలసిన కర్మకాండ అంతా ముగించుకుని రామలక్ష్మణులతో కూడా విశ్వామిత్రుణ్ణి రప్పించి శాస్త్రంలో చెప్పిన విధంగా మునికీ రామలక్ష్మణులకూ పూజచేశాడు. మరిన్ని అతను "బ్రహ్మర్షీ! నీకు స్వాగతం. నన్నేమి చెయ్యమంటావో ఆజ్ఞాపించు" అన్నాడు.

అప్పుడు విశ్వామిత్రుడు "రాజా! లోకవిఖ్యాతులైన యీ రామలక్ష్మణులు క్షత్రియవీరులు. దశరథుని కుమారులు. నీయింట నున్న శివధనుస్సు చూడాలని వీరికోరిక. నీకు భద్రం అగుగాక. ఈరాజపుత్రులకు ఆధనుస్సు చూపించు. అదిచూసి వీరు యథేష్టంగా వెళ్ళిపోతారు" అన్నాడు.

దానిమీద జనకు డీలా చెప్పుకుని వచ్చాడు.

"బ్రహ్మర్షీ! శివధనస్సు నాయింట ఎందుకున్నదో అది సకృచ్ఛ్రంగా విను. దేవరాతు డని మాపూర్వులలో ప్రఖ్యాతిగల రాజుండేవాడు. అతను మాకూటస్థుడైన నిమికి ఆరోతరంవాడు. దేవత లతనికి ఇది నిధిరూపంగా దయచేశారు. తాను దక్షయజ్ఞం ధ్వంసం చేసినప్పుడు పరమేశ్వరుడు ఈధనుస్సు చూపించి 'హవిర్భాగాలు కోరివచ్చిన నాకు మీరు భాగాలు కల్పించారు కారు. కనక, దేవతలారా!

ఇదే యీధనుస్సుతో మీతలలు ఎగరగొడతా' అని చాలా రోషంగా చెప్పాడు. అది విని దీను లయి పోయి దేవతలందరూ శివుణ్ణి సంతోష పెట్టారు. అందుకు ప్రీతుడై శివుడు వారి కందరికీ ఈధనుస్సు ఇచ్చాడు. దేవత లిది పరమానుగ్రహంతో మా దేవరాతునికి ప్రసాదించారు. ఇది యిలావుండగా : చయనం చేద్దామనే వుద్దేశంతో నేను భూమి దున్నుతూ వుండగా నాగేటి చాళ్ళలో నాకొక కన్య దొరికింది. ఆమెకి సీత అని సార్థకనామం వుంచి నేను పెంచుతున్నాను. అయోనిజ అయిన నా కూతురు సీతను బలపరాక్రమంతునికే ఇవ్వాలని నిశ్చయించుకుని నేను ఆమెను వీర్యశుల్క అని ప్రకటించాను. ఆమె ననేకులు కోరారు ; కాని యివ్వలేదు. అంతట వారందరూ కలిసివచ్చి 'ఎలాంటి బల పరాక్రమాలు చూపించాలీ ?' అని అడిగారు. 'దీని నెక్కుపెట్టా' లని నేను శివధనుస్సు చూపించాను. కాని వారిలో వొక్కడయినా అదిఎక్కు పెట్టలేకపోయాడు. కదపనే లేకపోయాడు. నావల్ల ప్రత్యాఖ్యాతులయి వారందరూ రోషం తెచ్చుకొని కలిసి మిథిల ముట్టడించారు. నేను తమ్ము తిరస్కరించా ననుకుని వారు మిథిల ననేకవిధాల పీడించారు. నేనున్నూ వెనుదీయక యుద్ధం చేశాను ; కాని ఒక్కసంవత్సరం గడిచాటప్పటికి నాకు సాధనసామగ్రి తక్కువ అయిపోయింది. అందుకు నేను చాలా దుఃఖించి తపస్సుచేసి దేవతలను మెప్పించాను. వారు పరమాదరంతో నాకు చతురంగ బలాలూ యిచ్చారు. నేను మళ్లీ మెదిరించి నిలిచాను. పాపకర్ములూ, పరాక్రమశూన్యులూ అయిన ఆరాజు లందరూ అమాత్యులతో కలిసి తలోదిక్కుకీ పారిపోయారు. ఈ ధనుస్సు చరిత్ర యిది. దీనిని రామలక్ష్మణులకున్నూ చూపిస్తాను. రాముడు ధనుస్సు ఎక్కుపెట్ట గలిగితే అయోనిజ అయిన నాకూతురు సీతను అతని కిచ్చి పెళ్ళిచేస్తాను."

# ౬౩

## రాముడు శివధనుస్సు విరవడం

"అయితే, ఆధనుస్సు రామునికి చూపించు" అని విశ్వామిత్రుడు చెప్పగా "గంధమాల్యవిభూషిత మైన శివధనుస్సు తీసుకురండి" అని అమాతుల్యకు ఆజ్ఞాపించాడు. వెంటనే వారు పట్నంలోకి ధనుస్సు పట్టించుకువచ్చారు. ఆధనుస్సు పొడుగైన యినపపెట్టెలో వుంది. ఆపెట్టెకు ఎనిమిది చక్రా లున్నాయి. మహాబలవంతు లైన అయిదు వేలమంది పురుషులు ఆపెట్టెను అతికష్టంమీద యజ్ఞశాలలోకి లాక్కొని వచ్చారు. "రాజా! రాజు లందరూ పూజించిన ధనుస్సు ఇదిగో" అని అమాత్యులు విన్నవించుకోగా, జనకుడు విశ్వామిత్రుణ్ణి చూసి దోసిలి వొగ్గి రామలక్ష్మణులున్నూ వినేటట్టుగా 'బ్రహ్మర్షీ! ఈధనుస్సు మాజనకవంశీయులందరిచేతా పూజించబడ్డది. మహామహా రాజు లనేకులు వచ్చి ఇది యెక్కుపెట్టడానికి కయినా చాలక పోయారు. ఈధనుస్సు వంచడానికీ, నారి యెక్కుపెట్టడానికీ, బాణం సంధించడానికీ, నారి మోగించడానికీ—తుదకు ఎంత బరువుందో తెలుసుకోడం కోసం కదపడానికీ కూడా దేవతలూ అసురలూ రాక్షసులూ గంధర్వులూ యక్షులూ కిన్నరులూ ఉరగులూ ఎంత మాత్రమూ చాలకపోయినప్పు డిక మనుష్యుల లెక్క యేమిటీ? అయినా, అదిగో ఆధనుస్సు ఈరాజపుత్రులకు చూపించు" అన్నాడు.

"రామా! చూసిరా నాయనా!" అని విశ్వామిత్రుడు చెప్పగానే ధనుస్సు ఉండినచోటికివెళ్ళి రాముడు పెట్టె తెరిచి చూసి "బ్రహ్మర్షీ! ఇదిగో ధనుస్సు ముట్టుకుంటున్నా" నన్నాడు. జనకుడూ విశ్వామిత్రుడూ "తప్పకుండా" అన్నారు. వెంటనే అక్కడవుండిన వేలాది జనం చూస్తూవుండగా, అతివిలాసంగా ధనుర్మధ్యం పట్టుకుని యెత్తి, అంతకంటే లీలగా నారి యెక్కుపెట్టి, రాముడు దాని మధ్యకు విరి

చేశాడు. అప్పుడు పిడుగుపడ్డంత చప్పు డయింది. పర్వతాలు పగిలి పోతే వాటికిపోయేటట్టు భూమి దారుణంగా కంపించింది. ఆధ్వని భరించలేక జనకుడూ, విశ్వామిత్రుడూ, రామలక్ష్మణులూ తప్ప తక్కినవా రందరూ కూలబడ్డారు.

వారందరూ మళ్ళీ యథాప్రకారంగా లేచి నుంచున్నతరవాత జన కుడు సాధ్వసం విడిచి విశ్వామిత్రునితో "మహాత్మా! నేను దశరథ కుమారు డైన రాముని వీర్యదర్పం కళ్ళారా చూశాను. ఎవ్వరూ చెయ్యలేనిది కనక అతర్కితం. ఇలాంటి స్థితిలో రాముడు చేశాడు కనక, ఇది మహాద్భుతంగా వుంది. నా కూతు రైన సీత దశరథా త్మజు డైన రాముణ్ణి పెళ్ళాడి మాజనకవంశానికి కీర్తి తెస్తుంది. 'సీత వీర్యశుల్క' అన్న నాప్రతిజ్ఞ నెరవేరింది. నేను నా ప్రాణాల కంటే యెక్కువగా చూసుకున్న నాకూతుర్ని రామునికి ఇస్తాను. నీసెల వయితే నామంత్రులు రథారూఢులై వాయువేగమనోవేగాలతో అయోధ్యానగరానికి వెళ్ళి, ఇక్కడ జరిగిందంతా చెప్పి దశరథమహా రాజును తీసుకువస్తారు. వీర్యశుల్క అయిన సీతను ఇస్తా నన్న సంగతి అందరికీ చెబుతారు. సీరక్షణలో 'రామలక్ష్మణులు వర్ధమాన చంద్రులై వున్నా' రనిన్నీ చెబుతారు. ఇవన్నీ చెప్పి సంతోషపరిచే వారు దశరథమహారాజును తీసుకువస్తారు" అని విన్నవించాడు. "అభ్యంతరం యేమీ" అని విశ్వామిత్రుడు తన అంగీకారం తెలి పాడు. వెంటనే జనకుడు మంత్రులను అయోధ్యకు పంపేశాడు.

## ౬౮

## జనకుని ఆహ్వానం దశరథుడు అంగీకరించడం

జనకుని వార్తాహారులు అతివేగంగా వెళ్ళి మూడు దినాలలో అయోధ్య చేరుకున్నారు. ద్వారపాలకులు ప్రవేశపెట్టగా వారు నిండుకొలువున్న

వృద్ధుడైన దశమహారాజు దర్శనం చేసుకున్నారు. తరవాత వారు దశరథమహారాజును చూసి బద్ధాంజలిపుటులై సాధ్వసం విడిచి " మహారాజా ? మిథిలాధిపతి అయిన మాజనకమహారాజు ' నీకూ, నీఅగ్నిహోత్రాలకూ, పురోహితులకూ, ఋత్విజులకూ, పరివారానికీ ఎల్లప్పుడూ క్షేమమే కదా ' అని సాదరంగా అడుగుతున్నాడు. మరిన్నీ, మాజనకమహారాజు విశ్వామిత్రుని అనుమతిమీద ' రాజేంద్రా ! ఇదివరలో నేను నాకూతురైన సీత వీర్యశుల్క అని ప్రకటించాను. రాజులు చాలామంది రోషం తెచ్చుకుని వచ్చి నిర్వీర్యులయిపోయి వున్నారు. ఇదంతా నీకు తెలిసిందే. అలాంటి నా కూతురు, విశ్వామిత్రాదులతో కలిసి యాదాలాభంగా యిక్కడికి వచ్చిన నీకొడుకులవల్లజయించబడ్డది. నాదగ్గిర వుండిన ఆగొప్పధనుస్సు మహాజనసమూహంలో, రాముడుఎక్కుపెట్టగా మధ్యకి విరిగి చక్కాపోయింది. మాసీత వీర్యశుల్క అని నేను ప్రతిజ్ఞచేశాను. కనుక ఆమెను రామునికి ఇవ్వదలుచుకున్నాను. నువ్విందుకు అంగీకరించవలసినవాడవు. నీకు భద్రం అగుగాక. ఋత్విక్కులతోనూ పురోహితులతోనూ బంధువులతోనూ కలిసి శీఘ్రంగా వచ్చి నువ్వు రామలక్ష్మణులను చూడాలి. ఇలాగ నువ్వు నాకోరిక తీర్చి నీకొడుకులను ముద్దుచెయ్యకోరుతున్నాను ' అని నీతో చెప్పమన్నాడు. ఈమాటలన్నీ మాజనకమహారాజు విశ్వామిత్రుని అనుజ్ఞ పొంది పురోహితుడైన శతానందుని సమక్షంలో అన్నవి " అని చెప్పారు.

ఆమాటలు విని దశరథుడు చాలా సంతోషించి వసిష్ఠుణ్ణీ వామదేవుణ్ణీ మంత్రులనూ చూసి " కౌసల్యానందవర్ధనుడైన రాముడు విశ్వామిత్రునిచేత రక్షించబడుతూ లక్ష్మణునితో గూడా విదేహదేశంలో ఉన్నాడు. జనకుడు, అబ్బాయి బలపరాక్రమాలు చూసి అతనికి తన కూతురైన సీతను ఇవ్వదలుచుకుని వున్నాడు. మహాత్ముడైన జనకుడు

వర్తమానించిన యీవృత్తాంతం మీకందరికీ సమ్మతం అయితే మిథిలకు బయలుదేరి వెడదాం. త్వరగా వెడదాం" అన్నాడు. అందుకు అంగీకరించి మహర్షులూ మంత్రులూ "తప్పకుండా వెడదాం" అన్నారు. దానికి ప్రీతుడై దశరథుడు "అయితే రేపే ప్రయాణం" అన్నాడు. జనకుని మంత్రులు గొప్పసత్కారాలు పొంది ఆరాత్రి పరమానందంగా అక్కడ వుండినారు.

## ౬౫

## దశరథుడు మిథిలకు వెళ్ళి పూజితుడు కావడం

రాత్రి గడిచి తెల్లవారాక దశరథుడు సుమంత్రుణ్ణి పిలిచి "కోశాధిపతులందరూ పుష్కలంగా ధనమూ నవరత్నరాసులూ పట్టుకుని ఇప్పుడే బయలుదేరిపోవాలి. నేనాజ్ఞాపించిన వెంటనే మంచి పాలకులూ మంచి రథాలూ కూర్చుకుని అపారమైన చతురంగబలం బయలుదేరాలి. వసిష్ఠుడూ, వామదేవుడూ, జాబాలీ, కాశ్యపుడూ, దీర్ఘాయుష్కుడైన మార్కండేయుడూ, కాత్యాయనుడూ ముందు బయలుదేరి వెళ్ళాలి. వారినిమిత్తం నారథం సిద్ధం చేయించు. జనకదూతలు చాలా తొందర పెడుతున్నారు; కాలం మించిపోకుండా మనం బయలుదేరాలి" అని చెప్పాడు.

అందరూ బయలుదేరారు. గొప్ప చతురంగబలం వారివెంట వెళ్ళింది. నాలుగు దినాలకు అందరూ విదేహదేశం చేరుకున్నారు. వెంటనే జనకుడు వారికందరికీ ఉచితమర్యాదలు జరిగించాడు. వారందరూ మిథిలానగరం చేరగానే జనకుడు "దశరథమహారాజా! నీకు స్వాగతం. మాభాగ్యవశంవల్ల నువ్విక్కడికి దయచేశావు. బలపరాక్రమాలవల్ల నీకొడుకు లార్జించిన ఆనందం నువ్వుపొందావు. వశిష్ఠ

మహర్షీ ? మా అదృష్టం వల్ల నువ్వు దయచేశావు. ఎందరో బ్రాహ్మణోత్తములను వెంటబెట్టుకుని దేవతలతో కూడిన మహేంద్రుడు లాగ నువ్వు దయచేశావు. కార్యం నిర్విఘ్నంగా నెరవేరుతుంది. మహావీరులైన రఘువంశీయులతో చుట్టరికం అబ్బడంవల్ల మా కులం వన్నెకెక్కింది. మహారాజా, దశరథా ! రేపు తెల్లవారాక, అప్పటికి యజ్ఞం అయిపోతుంది కనక, ఋషిసమ్మతంగా వివాహం జరిగించు ' అని చెప్పి చాలా ఆదరించాడు.

జనకుని మాటవిని ఋషు లందరూ వింటూండగా దశరథుడు " మహారాజా ! ప్రతిగ్రహం దాతృవశం. సంగతి అంతా వినే వున్నాను. నువ్విప్పుడిస్తే స్వీకరించడానికి కప్పుడు నేను సిద్ధంగానే వున్నాను. నువ్వు ఎలా చెబితే అలా చెయ్యడానికిన్నీ ఉద్యుక్తుణ్ణయివున్నాను " అని బదులుచెప్పాడు.

ధర్మబద్ధమూ, యశస్కరమూ అయిన ఆమాటవిని జనకుడు చాలా ఆశ్చర్యపడ్డాడు. మును లందరూ వొకరినొకరు గౌరవించుకుని ఆనందించి ఆరాత్రి సుఖంగా గడిపారు. దశరథుడున్నూ కొడుకులను కలుసుకుని జనకుడు చాలా ఆదరించగా సుఖంగా వున్నాడు.

జనకుడు యజ్ఞం ముగించుకుని, కూతుళ్ళతో కూడా అంకురార్పణం మొదలైనవి నేరవేర్చుకుని రాత్రి గడిపాడు.

## ౭౭

## వసిష్ఠుడు జనకసభలో ఇక్ష్వాకువంశక్రమం చెప్పడం

తెల్లవారగానే మహర్షులతో స్నానసంధ్యాద్యనుష్ఠానా లన్నీ ముగించుకుని జనకుడు పురోహితుడైన శతానందుణ్ణి చూసి " నాతమ్ముడు అతిధార్మికుడైన కుశధ్వజుడు సాంకాశ్యపట్నంలో వుండి రాజ్యం

పాలిస్తున్నాడు. ఆపట్నం శత్రువులకు సాధ్యంకాకుండా వుండేటట్టు అగడ్తలో ఎన్నో శూలాలు పాతారు. నేనతణ్ణి చూడాలి. నాయు జ్ఞాని కతనే రక్షకుడు. ఇప్పుడు సీతావివాహసంబంధ మైన ఆనందం అతనున్నూ అనుభవించాలి ” అని చెప్పాడు. అది విని వడిగల గుర్రా లెక్కి వెళ్ళి, దూతలు, ఇంద్రుని ఆజ్ఞవల్ల విష్ణువును తీసుకువచ్చేటట్టు కుశధ్వజుణ్ణి తీసుకువచ్చారు. అతను ధార్మికుడైన తన అన్నకూ, శతానందునికీ పాదాభివందనాలు చేసి, అన్న ఆజ్ఞతో అతని పక్కనే వెలగల ఆసనం అధిష్ఠించాడు. తరవాత అన్నదమ్ము లిద్దరూ సుదామను డనే మంత్రిని చూసి “ నువ్వు త్వరగా వెళ్ళి అమిత తేజశ్శాలీ, శత్రుంజ యుడూ అయిన దశరథమహారాజును కొడుకులతోనూ మంత్రులతోనూ తీసుకురా ” అని పంపారు. అతను వెళ్ళి మగపెళ్ళివారిని సవైభవంగా తీసుకువచ్చాడు. ఉచితమర్యాదలు జరిగాక దశరథుడు “ జనకమహా రాజా ! భగవంతు డైన వసిష్ఠమహర్షి ఇక్ష్వాకువంశీయులకు కులదైవం అనీ, మాకు సంబంధించిన సమస్తవ్యవహారాలలోనూ వక్త అతనే అనీ నీకు తెలుసు. విశ్వామిత్రమహర్షి సెలవు పొందీ, ఈమునీంద్రుల అనుజ్ఞపొందీ ఆమహర్షి యిప్పుడు మావంశక్రమం అంతా వివరిస్తాడు ” అని చెప్పి వూరుకున్నాడు.

అప్పుడు వసిష్ఠుడు ప్రారంభించాడు.

“ అవ్యక్తప్రభవుడూ, శాశ్వతుడూ, నిత్యుడూ, నాశరహితుడూ అయిన బ్రహ్మకు మరీచి పుట్టాడు. మరీచికి కాశ్యపుడూ, కాశ్యపు నికి సూర్యుడూ, సూర్యునికి మనువూ పుట్టారు. ఆ మనువే మొదటి రాజయినాడు. మనువు కొడుకు ఇక్ష్వాకుడు. అయోధ్యలో వుండి ప్రజాపాలనం ప్రారంభించినవాడు ఆ యిక్ష్వాకుడే. అతని కొడుకు కుక్షి. కుక్షి కొడుకు వికుక్షి. వికుక్షి కొడుకు మహాతేజశ్శాలీ, మహాప్రతా పవంతుడూ అయిన బాణుడు. బాణుని కొడుకు అతనికి తగ్గవాడే అన

రణ్యుడు. అనరణ్యుని కొడుకు పృథువు. పృథువు కొడుకు త్రిశంకుడు. త్రిశంకుని కొడుకు గొప్ప యశశ్శాలి అయిన దుందుమారుడు. అత నికే యువనాశ్వు డని మారుపేరు. యువనాశ్వుని కొడుకు మాంధాత. మాంధాత కొడుకు సుసంధి. సుసంధికి ధ్రువసంధి ప్రసేనజిత్తు అని యిద్దరు కొడుకులు. వారిలో ధ్రువసంధి కొడుకు భరతుడు. భరతుని కొడుకు అసితుడు. అసితుణ్ణి హైహయులూ, తాలజంఘులూ, శశి బిందువులూ శత్రువులై ఎప్పుడూ బాధపెడుతూ వుండేవారు. వారితో యుద్ధం చేస్తూ అసితుడు ఒకమాటు ఓడిపోయి, కొద్దిబలం మాత్రం మిగలగా దాసతోనూ మంత్రులతోనూ హిమవత్పర్వతశిఖరాలలో వొకటయిన భృగుప్రస్రవణంమీద నివసించాడు. అతని కిద్దరు భార్యలు. అప్పుడు వారిద్దరూ గర్భవతులయారు. అందులో వొకతె గర్భం చెడగొట్టా లని తన సవతికి గరం అనగా విషం కలిసిన పిండివంటలు పెట్టింది. సరిగా ఆ సమయాన భార్గవచ్యవనుడు అసితుణ్ణి రక్షించదలచి అక్కడికివచ్చాడు. విషం తిన్న రాజపత్ని తనకి కొడుకు పుట్టా లని కోరుకుంటూ దేవవర్చస్సుగల చ్యవనునికి పాదాభివందనం చేసింది. అదిచూసి రెండో రాజపత్ని కాళింది కూడా మునికి నమస్కరించింది; అయితే, చ్యవనుడు విషం తిన్న ఆమెను చూసి ' మహాభాగురాలా! నీకడుపులో పురుషశిశువు ఉన్నాడు. కొద్దిదినాల్లోనే అతను పుడతాడు. అతను మహాబలశాలీ, మహాతేజశ్శాలీ అవుతాడు. అతనికి విషం తగిలింది. అయినా భయ పడకు ' అని చెప్పాడు. పతివ్రతా, పట్టపుదేవీ అయిన మొదటి ఆమె, తరవాత, చనిపోయిన భర్తను తలుచుకుని శోకిస్తూనే కొడుకును కన్నది. ఆబాలుడు గరంతో కూడా పుట్టడంవల్ల సగరు డైనాడు. సగరునికి అసమంజుడూ, అసమంజునికి అంశుమంతుడూ, అంశుమంతు నికి దిలీపుడూ, దిలీపునికి భగీరథుడూ, భగీరథునికి కకుత్స్థుడూ,

కకుత్థ్సునకు రఘువూ, పుట్టారు. రఘువునకు ప్రవృద్ధుడు పుట్టాడు. అతనికి వసిష్ఠుని శాపం సంభవించింది. దానివల్ల ప్రవృద్ధుడు పురుషాదు డనే రాక్షసు డయిపోయాడు. తనకు శాపం యిచ్చినందుకు కోపించి అతను తానుగూడా వసిష్ఠుణ్ణి శపించా లని చేతిలో నీళ్లు పోసుకున్నాడు; కాని 'తప్పు తప్పు' అని భార్య నివారించింది. ఆనీళ్ళు అతని కాళ్ళమీదే పడ్డాయి. అందువల్ల అతను కల్మాషపాదు డైనాడు. కల్మాషపాదుని కొడుకు శంఖణుడు. శంఖణుని కొడుకు సుదర్శనుడు. సుదర్శనుని కొడుకు అగ్నివర్ణుడు. అగ్నివర్ణునికి శీఘ్రగుడూ, శీఘ్రగునకు మరుడూ, మరునకు ప్రశుశ్రుకుడూ, ప్రశుశ్రుకునకు అంబరీషుడూ, అంబరీషునకు నహుషుడూ పుట్టారు. నహుషుని* కొడుకు యయాతి. యయాతి కొడుకు నాభాగుడు. నాభాగుని కొడుకు అజుడు. అజుని కొడుకు దశరథుడు. ఈదశరథుని కొడుకు లీ రామలక్ష్మణులు. జనకరాజర్షి ! ఇలాగ ఆదినుంచీ పరమపవిత్రమూ అద్వితీయమూ అయిన గొప్పవంశంలో పుట్టి పరమధార్మికులూ మహావీరులూ, సత్యవ్రతులూ అయిన యిక్ష్వాకు వంశీయుల సంతతివా రయిన ఈరామలక్ష్మణులకు నీ కూతుళ్ళనిమ్మని కోరుతున్నాను. నీకూతుళ్ళకు వీరూ, వీరికి నీకూతుళ్ళూ తగినవారు. కనక, వీరికి నీకూతుళ్ళ నివ్వడం చాలా మంచిది."

## ౭౨

## జనకుడు తనవంశక్రమం చెప్పడం

అప్పుడు జనకుడు కృతాంజలి అయి మహర్షిపుంగవా ! కులీను డైనవాడు కన్యాదానం చేశాటప్పుడు తన వంశక్రమం సవిస్తరంగా

---

* ఈ నహుషుడూ యయాతీ సూర్యవంశీయులు. చంద్రవంశంలో కూడా తరవాత, ఈ పేరు గలవారు పుట్టారు.

చెప్పడం ధర్మం కనక, స్తుతిపాత్ర మైన మా వంశక్రమం చెబుతాను విను" అని యిలా ప్రారంభించాడు.

"వసిష్ఠా ! నిమి అనే మహారాజుండేవాడు. తాను చేసిన గొప్ప పనులవల్ల అతను మూడు లోకాలలోనూ ప్రఖ్యాతి పొందాడు. అతను గొప్ప ధర్మాత్ముడు. బలపరాక్రమమంతులలో మేటి. అతని కొడుకు మిథి. అతను తన పేరిటనే మిథిల అని పేరుపెట్టి యీనగరం నిర్మించాడు. జనకవంశానికి అతనే మొదటివాడు. అది మొదలుకునే మాకు జనకులు అని పేరు. జనకుని కొడుకు ఉదావసువు. ఉదావసుని కొడుకు నందివర్ధనుడు. అతను బహు ధర్మాత్ముడు. నందివర్ధనుని కొడుకు సుకేతుడు. సుకేతుని కొడుకు దేవరాతుడు. అతను గొప్ప ధార్మికుడూ గొప్పబలశాలీని. అతను రాజర్షి కూడాను. దేవరాతుని కొడుకు బృహద్రథుడు. బృహద్రథుని కొడుకు మహావీరుడు. అతను శూరుడూ ప్రతాపవంతుడూను. మహావీరుని కొడుకు సత్యపరాక్రము డైన సుధృతి. సుధృతి కొడుకు ధర్మాత్ము డైన దృష్టకేతుడు. రాజర్షి అయిన దృష్టకేతుని కొడుకు హర్యశ్వుడు. హర్యశ్వుని కొడుకు మరుడు. మరుని కొడుకు ప్రతింధకుడు. ప్రతింధకుని కొడుకు ధర్మాత్ము డైన కీర్తిరథుడు. కీర్తిరథుని కొడుకు దేవమీఢుడు. దేవమీఢుని కొడుకు విబుధుడు. విబుధుని కొడుకు మహీధ్రకుడు. మహీధ్రకుని కొడుకు కీర్తిరాతుడు. అతను మహాబలశాలి. రాజర్షిన్ని అయిన కీర్తిరాతుని కొడుకు మహారోముడు. మహారోముని కొడుకు ధర్మాత్ము డైన స్వర్ణరోముడు. స్వర్ణరోముని కొడుకు హ్రస్వరోముడు. ధర్మజ్ఞుడూ మహాత్ముడూ అయిన హ్రస్వరోమున కిద్దరు కొడుకులు. వారిలో నేను పెద్దవాణ్ణి. నా తమ్ముడు కుశధ్వజుడు. మా తండ్రి రాజ్యభారమూ మాతమ్ముని భారమూ నామీద పెట్టి వానప్రస్థాశ్రమం స్వీకరించాడు.

వృద్ధు డైన మాతండ్రి కాలం చేశాక దేవసమాను డైన మాతమ్ముడు కుశధ్వజుణ్ణి ప్రేమిస్తూ యథాశాస్త్రంగా ప్రజాపాలనం సాగిస్తున్నాను.

ఇలా కాలం గడుస్తూ వుండగా, సాంకాశ్యపురాధిపతి అయిన సుధన్వుడు వచ్చి మిథిలానగరం ముట్టడించి 'నాకు శివధనుస్సూ సుందరి అయిన సీతా కావాలి, ఇచ్చెయ్యి' అని వర్తమానం చేశాడు. నేను 'ఇవ్వను, పో' అన్నాను. బ్రహ్మర్షీ! దానిమీద మాకు యుద్ధం జరిగింది. నేనా సుధన్వుణ్ణి యుద్ధంలో చంపేశాను. నాతమ్ముడూ మహావీరుడూ అయిన కుశధ్వజునికి సాంకాశ్యపురాధిపతిగా పట్టాభిషేకమున్నూ చేశాను. నేను నాకూతుళ్ళలో సీతను రామునికీ ఊర్మిళను లక్ష్మణునికీ యిస్తాను. దేవకన్యవంటిది సీత. అలాంటిదే ఊర్మిళయున్నూ. త్రికరణశుద్ధిగా వారి నిద్దరినీ క్రమంగా రామలక్ష్మణుల కిస్తాను. కనక, రామలక్ష్మణులకు సమావర్తనం చేయించు. పితృదేవతల ప్రీతికొరకు నాందీశ్రాద్ధమున్నూ జరిగించు. ఇవాళ మఖానక్షత్రం. నేటికి మూడోనాడు ఉత్తరఫల్గునీనక్షత్రం. ఆవేళ వివాహం. ఆసమయంలో సీతారాములకూ, ఊర్మిళా లక్ష్మణులకూ శుభోదర్కంగా గోభూతిలహిరణ్యాదిదానాలున్నూ జరిగించు."

## ౭౨

## భరతునికి మాండవినీ శత్రుఘ్నునికి శ్రుతకీర్తినీ నిశ్చయించడం

జనకు డిలా చెప్పగా వశిష్ఠునితో సంప్రతించి "జనకరాజేంద్రా! ఇక్ష్వాకువంశమూ, జనకవంశమూ ఆశ్చర్యకరాలూ అప్రమేయాలూను. ఈ రెండు వంశాలకూ సాటి వచ్చేది మరొకటి లేదు. ఈ వివాహ సంబంధం రెండు కులాలకూ తగ్గట్టుగానే వుంది. రూపసంపదను పట్టిన్నీ సీతారాములకూ, ఊర్మిళాలక్ష్మణులకూ ఉజ్జీలుచక్కగా

వున్నాయి. బాగుంది. ఇక మేము చెప్పవలసింది కొంచెమే వుంది. సీతమ్ముడు ఈకుశధ్వజుడు ధర్మజ్ఞుడు. ఈకుశధ్వజుని కిద్దరు కూతుళ్ళు న్నారు. ఆయిద్దరున్నూ త్రిలోకమోహినులు. వారిలో మాండవిని భరతుని కోసమూ, శ్రుతకీర్తిని శత్రుఘ్నుని కోసమూ మేము వరిస్తున్నాము. దశరథుని కుమాళ్ళు నలుగురూ రూపయౌవనవంతులు. మరిన్ని లోకపాలకులతో సాటివచ్చేవారూ, దేవతల పరాక్రమం పోలిన పరాక్రమం గలవారున్నూ. ఇలాగ మీయిద్దరితోనూ చుట్టరికం చెయ్యడంవల్ల ఇక్ష్వాకువంశం తేజరిల్లుగాక ” అని చెప్పాడు.

అప్పుడు జనకుడు వసిష్ఠవిశ్వామిత్రులను చూసి దోసిలి వొగ్గి “మీరిద్దరూ ఆలోచించి కులసంబంధం ఇంతచక్కగా నిరూపించడంవల్ల మా వంశం ధన్యం అయింది. మీరు సెలవిచ్చి నట్టు నాతమ్ముడు కుశధ్వజుని కూతుళ్లు భరతశత్రుఘ్నులకు భార్య లగుదురు గాక. మీ రాజపుత్రులు నలుగురూ మాఅమ్మాయిలను ఒక్కనాడే వివాహం చేసుకుందురుగాక, భగదేవతాక మైన ఉత్తరఫల్గునీ నక్షత్రంలో పగలు వివాహాలకు చాలా మంచి దని మనీషులు చెబుతారు; కనక అలా జరిగించండి. బ్రహ్మర్షి శేఖరు లయిన వసిష్ఠ విశ్వామిత్రులారా! మీరు మాకు కన్యాదాన ఫలం సిద్ధింపచేసి మాకు ధార్మికత్వం ప్రసాదించినవా రైనారు; కనక, ఈమూడు రాజ్యాలూ మీరు ఏలుకోండి. దశరథునికి ఈమిథిల యెలాంటిదో అయోధ్య నా కలాంటిది. కావున దశరథుని రాజ్యం నేనూ మారాజ్యాలు దశరథుడూ మీ కివ్వ డాని కర్హత గలవాళ్ళమే ” అని చెప్పాడు.

అప్పుడు దశరథుడున్నూ జనకులను చూసి “ మిథిలాధిపతు లైన మీఅన్నదమ్ములు ఇద్దరూ అసంఖ్యాకసుగుణగరిష్ఠులు. మహర్షులనూ రాజసంఘాలనూ మీరు చక్కగా పూజించారు. మీకు స్వస్తి కావా

లని కోరుతున్నాను. ఇక నేను మాఇనకు వెళ్ళి శ్రాద్ధకర్మలన్నీ నెర వేరుస్తాను" అని బదులు చెప్పాడు.

ఇలా చెప్పి దశరథుడు జనకులవద్ద సెలవు పుచ్చుకుని బ్రహ్మర్షుల నిద్దరినీ వెంటబెట్టుకుని బయలుదేరి వెళ్ళాడు. అప్పుడు చెయ్యవలసిన శ్రాద్ధకర్మలన్నీ ముగించుకుని మర్నాడు పొద్దున్న గోదానాలు చేశాడు. ఆచెయ్యడంలో, బ్రాహ్మలకు ఒక్కొక్కకొడుకు నుద్దేశించి ఒక్కొక్క లక్ష గోవులు ఇచ్చాడు. ఆ గోవుల కన్నిటికీ బంగారుకొమ్ములు చేయించాడు. అన్నిటికీ లేగలు బాగా వున్నాయి. అన్నీ సమృద్ధిగా పాలిస్తాయి. బ్రాహ్మణులు పాలు పితుక్కోడానికి ఒక్కొక్క ఆవుకి ఒక్కొక్క కంచుగిన్నె కూడా యిచ్చాడు. గోదానదక్షిణగా బ్రాహ్మణులకు పెద్దపెద్ద ధనరాసులున్నూ ఇచ్చాడు. గోదానాలు చేసిన నలుగురు కొడుకులూ చుట్టూకూచుని వుండగా ఆదశరథుడు లోకపాలకులచే పరివేష్టించబడిన బ్రహ్మదేవుడులాగా ప్రకాశించాడు.

## ౭౫

## రామలక్ష్మణభరతశత్రుఘ్నుల పెళ్లిళ్లు

దశరథుడు ఇలా గోదానాలు ముగించాటప్పటికి అలా యుధాజిత్తు చక్కావచ్చాడు. అతను కేకయరాజు కొడుకు. భరతునికి సాక్షాత్తుగా మేనమామ. అతను దశరథుణ్ణి కుశలవార్త లడిగి "మాతండ్రి కేకయరాజు మీక్షేమం అడిగాడు. నువ్వు ఎవరి కుశలం కోరుతావో ఆ మేము అందరమూ క్షేమంగా వున్నాము. మాతండ్రి, భరతుణ్ణి చూడా లని కోరుతున్నాడు. అతణ్ణి తీసుకువెళ్ళడానికి నేను అయోధ్యకు వచ్చి, వివాహాల కోసం మీరంతా మిథిలకు వచ్చా రని విని నేనిక్కడికి వచ్చాను" అని చెప్పాడు.

దశరథుడు ప్రియాతిథి అయిన యుధాజిత్తును బాగా గౌరవించి, కొడుకులతోనూ మహర్షులతోనూ ఆరాత్రి సుఖంగా గడిపాడు.

తెల్లవారాక అప్పుడు చెయ్యవలసిన పన్నీ ముగించుకుని, మహర్షుల నందరినీ వెంట నిడుకుని యజ్ఞశాలకు వెళ్ళాడు. రాముడు, శాస్త్రసమ్మత మైన విజయముహూర్తాన, చక్కగా అలంకరించుకుని వుండిన తమ్ములు గూడా బాగా మంగళాచారా లన్నీ ముగించుకుని వసిష్ఠుడూ తక్కిన మహర్షులూ బయలుదేరగా వారి వెంట వెళ్ళి తండ్రి దగ్గిర కూచున్నాడు.

అప్పుడు వసిష్ఠమహర్షి జనకుని దగ్గిరకు వెళ్ళి " రాజా ! కృతకౌతుక మంగళు లైన కుమాళ్ళతో కూడా వచ్చి దశరథుడు, కన్యాదాత లైన నీకోసం నిరీక్షిస్తున్నాడు. కన్యాదానం చేసినవారికీ స్వీకరించినవారికీ గూడా సకలార్థాలూ సిద్ధిస్తాయి. కనక, నువ్వు కన్యాదానాలు చేసి స్వధర్మఫలం అనుభవించు " అని చెప్పగా, జనకుడు ' మహాత్మా ? మిమ్మ్మి అడ్డుపెట్టడాని కిక్కడ ద్వారపాలకు లెవరున్నారూ ? ఇక్కడికి దయచెయ్యడానికి మీ కొకరి ఆజ్ఞ యెందుకూ ! ఇదంతా మీదే గదా, మీయింట మీకు అడ్డేమిటీ ? కృతకౌతుక సర్వస్వ లయి అగ్నిజ్వాలల లాగ నాకన్యలు అరుగో వేదిమూలంమీద కూచునివున్నారు. నేను సర్వమూ సిద్ధపరుచుకుని యీ వేది దగ్గిర ప్రతిష్ఠితుణ్ణయి వున్నాను. ఆలస్యం యెందుకూ ? మీదశరథుడు వచ్చి అంతా నెరవేర్చుకో వచ్చునే ? ' అన్నాడు.

దానిమీద దశరథుడు కొడుకులతోనూ మహర్షులతోనూ లోపలికి వచ్చాడు. అప్పుడు జనకుడు వసిష్ఠునితో " మహర్షీ ! మహర్షులందరితోనూ కలిసి లోకాభిరాము డైన రామునికి వివాహకార్యం జరిగించవయ్యా " అని కోరాడు.

అందు కంగీకరించి వసిష్ఠుడు విశ్వామిత్రుణ్ణీ శతానందుణ్ణీ దగ్గిర వుంచుకుని వారితో పర్యాలోచన చేస్తూ, అరటిచెట్లతోనూ, కొబ్బరి ఆకులతోనూ లతలు మొదలయినవాటితోనూ అలంకరించబడివుండిన పందిరిలో, మధ్యగా శాస్త్రోక్తంగా వేది కల్పించి, అది గంధపుష్పాక్షతాదులతో అలంకరించి అంకురార్పణ చేసిన వివిధపాలికలూ ధూమపాత్రలూ స్రుక్స్రువాలూ అర్ఘ్యపాత్రలూ లాజపాత్రలూ అక్షతల పాత్రలూ మొదలైన వన్నీ చేర్పించుకుని, వేది అంతా దర్భలు పరిచి మంత్రయుక్తంగా అగ్నిప్రతిష్ఠ చేసి హోమాలు చేశాడు.

అప్పుడు జనకుడు సర్వాభరణభూషితురాలై వున్న సీతను తీసుకు వచ్చి యెదట కూచోపెట్టి "కౌసల్యానందవర్ధనా! రామా! ఇదిగో నాకూతురు సీత, ఈమె నీకు సహధర్మచారిణి. ఈమె నంగీకరించి పాణిగ్రహణం చెయ్యి. పతివ్రత అయిన మాసీత నిన్నెప్పుడూ నీడలాగ అనుసరిస్తుంది" అని చెప్పి మంత్రపూతమైన జలం రాముని చేతిలో విడిచాడు.

అప్పుడు దేవదుందుభులు మోగాయి. పూలవాన కురిసింది. దేవతలూ మునులూ సాధువాదం చేశారు.

తరవాత, మళ్ళీ, జనకుడు "లక్ష్మణా! ఇలా రా. ఆలస్యం యెందుకూ! ఇదిగో మాఊర్మిళ. ఈమె నంగీకరించి పాణిగ్రహణం చెయ్యి. భరతుడా! ఇదిగో మా మాండవి. ఈమె నంగీకరించి పాణిగ్రహణం చెయ్యి. శత్రుఘ్నుడా! ఇదిగో మాశ్రుతకీర్తి. ఈమె నంగీకరించి పాణిగ్రహణం చెయ్యి. దశరథపుత్రులారా! మీ రందరూ సౌమ్యులు. మీరందరూ సుచరిత్రులూ సువ్రతులూను. ధర్మపత్నీసహితులయి సుఖించండి" అన్నాడు.

జనకు డిలా చెప్పగా, వసిష్ఠుని అనుమతి పొంది రాముడూ లక్ష్మణుడూ భరతుడూ శత్రుఘ్నుడూ వరాసగా సీతనూ ఊర్మిళనూ మాండవినీ శ్రుతకీర్తినీ పాణిగ్రహణం చేసి స్వీకరించారు. మరిన్నీ వారు ధర్మపత్నీసహితులై అగ్నిహోత్రానికీ, జనకునికీ, ఋషులకూ ప్రదక్షిణనమస్కారాలు చేశారు.

ఇలాగ పాణిగ్రహణ మహోత్సవం జరగగా ఆకాశంలో దేవదుందుభులు మోగాయి. పూలవాన కురిసింది. గంధర్వులు పాడారు. అప్సరసలు ఆడారు.

తరవాత, రామలక్ష్మణభరతశత్రుఘ్నులు తమ నవోఢలతో విడిదికి వెళ్ళారు. దశరథుడున్నూ మహర్షులనూ బంధువులనూ వెంటబెట్టుకుని మహోత్సాహంతో వెళ్లాడు.

## ౨౦

## పరశురాముడు అడ్డురావడం

తెల్లవారింది. విశ్వామిత్రుడు, జనకుడూ దశరథుడూ వీడ్కోలు ఇవ్వగా హిమవత్పర్వతానికి వెళ్ళిపోయాడు. వెళ్ళేటప్పుడు అతను వృద్ధరాజులనూ, సీతారాములనూ, ఊర్మిళాలక్ష్మణులనూ, మాండవీభరతులనూ, శ్రుతకీర్తిశత్రుఘ్నులనూ అనేకవిధాల ఆశీర్వదించాడు. తరవాత జనకుడు తమకు మిక్కిలి గొప్పగా వీడ్కోలు మహోత్సవం చెయ్యగా దశరథుడున్నూ అయోధ్యకు బయలుదేరాడు. జనకుడు వారిని చాలా దూరం సాగనంపాడు. ఆ సమయంలో, జనకుడు, సీతకూ ఊర్మిళకూ మాండవికీ శ్రుతకీర్తికీ కన్యాధనంగా ఎన్నో లక్షల ఆవులూ, గొప్పగొప్ప ఉన్నివస్త్రాలూ

ఉత్తమా లైన పట్టుబట్టలూ, ఏనుగులూ గుర్రాలూ రథాలూ పదాతి సీరులూ గల మంచి సేనా, చక్కని చుక్క లైన దాసీకన్యలనూ, పరిచారకులనూ లెక్కలేకుండా యిచ్చాడు. మరిన్నీ, బంగారమూ, ముత్యాలూ, పగడాలూ కూడా అపారంగా యిచ్చాడు.

జనకుడు సాగనంపి మిథిలకు వెళ్ళిపోయిన తరవాత, దశరథుడు కొడుకులతోనూ మహర్షులతోనూ శీఘ్రప్రయాణం చేశాడు. ఆ ప్రయాణంలో వారికి పైని ఆకాశాన ఘోరరూపా లయిన కాకులూ మొదలైన పక్షులు పరుషంగా కూశాయి; కాని భూమిమీద ఎదట మృగాలు ప్రదక్షిణంగా వెళ్ళాయి. అది చూసి రాజశార్దూలు డైన దశరథుడు వసిష్ఠుణ్ణి చూసి "మహర్షీ! ఘోరరూపా లైన పక్షులు విరసంగా కూస్తున్నాయి. మృగాలు ప్రదక్షిణంగానే తిరుగుతున్నాయి. గాని నాహృదయం కొట్టుకుంటోంది. మనస్సు చెదిరిపోతోంది. ఇదంతా యేమిటి?" అని అడిగాడు. అందుకు వసిష్ఠుడు "ఇప్పుడు ఒక అపాయం రాబోతోంది. ఈ పక్షికూతలకు ఫలితం అది. ఆ అపాయం ఏబాధా లేకుండానే తొలగిపోతుంది. మృగాలు ప్రదక్షిణంగా వెళ్ళినందుకు అది ఫలితం. కనక, నిశ్చింతంగా వుండు" అని మెల్లిగానూ చక్కగానూ చెప్పాడు. వారిలా మాట్లాడుకుంటూ వుండగానే గాలిదుమారం రేగింది. భూమి వొణికిపోయింది. చెట్లు కూలిపో సాగాయి. పొగ రేగి సూర్యబింబం కప్పేసింది. దిక్కులు అంధకార బంధురా లయిపోయాయి. సేన అంతా దుమ్మూ ధూళీ ముంచెత్తేసింది.

వసిష్ఠుడూ, తక్కిన మునులూ, రాజకుటుంబమూ తప్ప తక్కినవా రందరూ మూర్ఛిల్లారు. అప్పు డొక మహాపురుషుడు ఎదట సాక్షాత్కరించాడు. అతను కైలాసం లాగ దుర్ధర్షుడై వున్నాడు. కాలాగ్ని లాగ

దుస్సహంగా వున్నాడు. పామరులు చూడడానికి అశక్యంగా తేజ రిల్లుతున్నాడు. చేత్తో వొక గొప్ప బాణం పుచ్చుకుని మూపున గండ్ర గొడ్డలీ గొప్ప ధనుస్సూ ఉంచుకుని త్రిపురాసురులను సంహరించిన మహేశ్వరుడు లా వున్నాడు. చూడగా, అతను, యిరవై వొక్క సారులు క్షత్రియులను ఏరియేరి సంహరించిన పరశురాముడు.

అగ్నిహోత్రం లాగ వెలిగి పోతున్న ఆ భయంకర పరశురాముణ్ణి చూసి జపహోమ పరాయణులైన వసిష్ఠాది మహర్షులు 'తండ్రిని చంపా రన్న కోపంతో వెనక యితను క్షత్రియ సంహారం చేసివుండడం నిజమే ; కాని, ఆ కోపం అంతా ఇదివరకే శాంతించింది. ఆ పగ చల్లారి పోయింది. కనక, యిప్పు డందుకు పూనుకోడు' అని కూడా కూడ బలుక్కుని, అర్ఘ్యాదికం పుచ్చుకుని 'రామా, రామా' అని మృదుమధుర భాషలతో యెదురువెళ్ళి పూజించారు. ఆ పూజ అందు కుని, ఆనందించి, ప్రతాపశాలి అయిన భార్గవరాముడు దశరథరాముణ్ణి చూసి యిలా అన్నాడు.

## ౭౧
## "ఈ ధ నుస్సు వం చ వో య్"

"దశరథరామా ! నీవీర్యదర్పాలు విన్నాను. నువ్వు శివధనుర్భంగం చెయ్యడం కూడా నేను సవిస్తరంగా విన్నాను. పరమాద్భుతం అయిన ఆవృత్తాంతం విని నేను మరోగొప్పధనుస్సు పట్టుకువచ్చాను. ఈధనుస్సు జామదగ్న్యం. అది యెక్కుపెట్టడంగాదు, ఈధనుస్సు ఎక్కుపెట్టి, బాణం తొడిగి నీబలం చూపించు, నీకు ద్వంద్వయుద్ధం యిస్తాను."

ఈమాట విని దశరథుడు విషణ్ణముఖు డయి, దీనుడున్నూ అయి, దోసిలివొగ్గి "మహాత్మా ! క్షత్రియులమీద కోపంతగ్గించు కుని నువ్వు శాంతించి వున్నావు. బ్రాహ్మణోత్తముడవు. గొప్ప యశశ్శా

లీవి. స్వాధ్యాయ వ్రతసంపన్నమైన భార్గవవంశంలో పుట్టినవాడవు. ఇంద్రుని దగ్గిర ప్రతిజ్ఞచేసి శస్త్రం విడిచిపెట్టేసి వున్నావు. భూమి అంతా కాశ్యపునికి ఇచ్చేసి అరణ్యాలకు పోయి మహేంద్రపర్వతం మీద తపోదీక్షలో వుండినావు. అలాంటి నువ్వు ఇప్పుడు నాకు సర్వ నాశం చెయ్యడానికి వచ్చావు. భార్గవరామా ! నా రాము డొక్కడు చనిపోయినా యిక మాకేమి వుంటుందీ ? ఏమి చూసుకుని మేము బతకగలమూ !'' అని అనేక విధాల ప్రాధేయపడ్డాడు.

కాని పరశురాము డదేమీ వినిపించుకోనేలేదు. అతనికేసీ చూడ లేదు. మళ్ళీ రాముణ్ణే చూస్తూ "రామా ! నువ్వు విరిచేసిన ధనుస్సూ, ఇదిగో నాదగ్గిర వున్న యీధనుస్సూ అతి ప్రయత్నం మీద విశ్వకర్మ సృష్టించాడు. ఇవి చాలా శ్రేష్ఠాలు. దివ్యాలు. త్రిలోకప్రఖ్యాతి గలవి. గట్టివి, బలమైనవీని. అందులో వొకటి దేవతలు యుద్ధం చెయ్య బూనిన మహేశ్వరుని కిచ్చారు. అది త్రిపురాసురులను సంహరించింది. అదే నువ్వు విరిచేశావు. ఇదిగో, యీ ధనుస్సు దేవతలు విష్ణుమూర్తి కిచ్చారు. ఇది స్నీ చాలా గొప్పది. శివధనుస్సుకు ఎంతమాత్రమూ తీసిపోయేది కాదు. ఒకప్పుడు దేవతలందరూ 'శితికంఠుడైన శివుడు గొప్పవాడా, విష్ణువు గొప్పవాడా ? వారి బలాబలాలు వివరించి చెప్పు, అనికోరగా బ్రహ్మ శివవిష్ణువుల కిద్దరికీ విరోధం కలిగించాడు. వా రిద్దరూ పరస్పరజిగీషతో ఘోరయుద్ధం చేశారు. అప్పుడు విష్ణుమూర్తి హుంకారం చెయ్యగా శివధనుస్సూ, త్రినేత్రుడయిన శివుడూ స్తంభించి పోయారు. అప్పుడు దేవతలందరూ వచ్చి ప్రార్థించగా వారిద్దరూ శాంతించారు. మరిన్నీ విష్ణువే గొప్పవా డని దేవత లనుకున్నారు. శివుడు కోపించి ధనుర్బాణాలు విదేహాధిపతి అయిన దేవరాతు డనే రాజర్షి కిచ్చేశాడు. ఇప్పుడు నాదగ్గిర వుండిన యీధనుస్సు విష్ణుమూర్తి భార్గవవంశ తిలకుడైన ఋచీకునకు ప్రయోగోపసంహారాలు

ఉపదేశించి యిచ్చాడు. ఋచీకుడు ఇది తన కొడుకూ అప్రతిమ కర్ముడూ మహాత్ముడూ అయిన నాతండ్రికిచ్చాడు. నాతండ్రి శస్త్రాస్త్రాలు విడిచిపెట్టి తపస్సు చేసుకుంటూ వుండగా కార్తవీర్యార్జునుడు పామరుడై చంపేశాడు. ఇలాగ కార్తవీర్యార్జునుడు అకారణంగా నాతండ్రిని చంపడం వల్ల కోపం వచ్చి నేను అనేక పర్యాయాలు పుడుతూ పెరుగుతూ వున్న క్షత్రియుల నందరినీ సంహరించాను. భూమి అంతా జయించాను; కాని, యజ్ఞంచేసి అదంతా కాశ్యపునికి ఇచ్చేశాను. తరవాతనేను మహేంద్రపర్వతానికి వెళ్ళి తపస్సు చేసు కుంటున్నాను. ఇలా వుండగా, నువ్వు శివధనుస్సు విరిచావని తెలిసింది. అంచేత యింత వడిగా వచ్చాను. ఇలాగ పితృపితామహాక్రమంగా నాకు సంక్రమించిన యీ విష్ణువు ధనుస్సును క్షత్రధర్మం చూపించి నువ్వు పుచ్చుకో. ధనుస్సు ఎక్కుపెట్టి యీ బాణం తొడుగు. ఇలా చెయ్య గలిగితే నీకు ద్వంద్వయుద్ధం యిస్తాను. ''

## ౭౬

## పరశురాముడు పరాభూతుడై మహేంద్రగిరికి వెళ్లడం

ఇదంతా విని దశరథరాముడు, తండ్రి దగ్గిర వుండడంవల్ల సవినయంగా "భార్గవరామా! నువ్వు చేసిన పను లన్నీ విన్నాను. తండ్రిఋణం తీర్చుకున్న నిన్ను నేను ప్రశంసించి అనుసరిస్తాను. నువ్వు నన్ను క్షత్ర ధర్మహీను ణ్ణనీ, దుర్బలు ణ్ణనీ భావిస్తున్నట్టున్నావు. ఇదే నాపరాక్ర మం చూసుకో" అని చెప్పి క్రుద్ధుడై పరశురాముని ధనుస్సూ బాణమూ గభీమని పుచ్చుకున్నాడు. మరిన్నీ, ఆధనుస్సు ఎక్కిపెట్టి, బాణం కూడా తొడిగి, పరశురాముణ్ణి చూసి నిప్పులు కక్కుతూ "భార్గవరామా! నువ్వు బ్రాహ్మణుడవు కావడంవల్లా, బ్రహ్మర్షి

అయిన విశ్వామిత్రుని సోదరికి నువ్వు పౌత్రుడవు కావడంవల్లా నేను నీప్రాణాలు తియ్యను ; కాని నీపాదగతీ, తపస్సువల్ల నువ్వు సంపాదించుకున్న లోకాలూ — యీరెండింటిలో యేదోవొకటి నాశనం చేస్తాను, తప్పదు. ఏది కొట్ట మంటావో చెప్పు. ఇది విష్ణుబాణం. కనక, యిది వ్యర్థంగా భూమిమీద పడిపోదు ” అని గంభీరంగా చెప్పాడు. ఉత్కృష్ట మైన విష్ణుధనుస్సు ధరించివున్న శ్రీరాముణ్ణి చూడడానికి దేవతలు బ్రహ్మనూ ఋషులనూ వెంటబెట్టుకుని అక్కడికి గుంపులుగుంపులుగా వచ్చారు. గంధర్వులూ కిన్నరులూ చారణులూ అప్సరసలూ యక్షులూ రాక్షసులూ ఉరగులూ కూడా ఈఅద్భుత చర్య చూడడానికి జట్లుజట్లుగా వచ్చారు.

దశరథ రాముడు విష్ణుధనుస్సు చేతపట్టడంవల్ల లోకంఅంతా జడీభూతం అయిపోయింది. పరశురాముడు నిర్వీర్యు డయిపోయి రామునితో మెల్లిమెల్లిగా “ నేనీ భూమి అంతా వెనక కాశ్యపుని కిచ్చేశాను. అంచేత అతను నన్ను యీభూమిమీద నివసించడానికి వల్లకా దని నిషేధించాడు. నేనలాగే మసులుకుంటున్నాను. ఇది నా శపథం. కనక, దశరథరామా ! నాకాళ్లు కొట్టవద్దు. నాతపస్సువల్ల ఆర్జించుకున్న లోకాలే నాకు లేకుండా చెయ్యి. నువ్వు ఈవిష్ణుధనుస్సు ఎక్కుపెట్టగలగడంవల్ల నువ్వు నిత్యు డైన శ్రీహరి అని తెలుసుకున్నాను. నీకు శుభం కావాలి. అప్రతిమకర్ముడవూ, యుద్ధంలో సాటిలేనివాడవూ అయిన నిన్ను ఈదేవత లందరూ చూస్తున్నారు. ఇది నాకు లజ్జాస్పదం కాదు. బాణం విడిచిపెట్టు. నేనిక మహేంద్రపర్వతానికి పోవాలి ” అని చెప్పాడు.

ప్రతాపశాలి అయిన పరశురాము డీలా చెప్పగా రాముడు బాణం విడిచిపెట్టాడు. తపస్సు చేసి తాను సంపాదించుకున్న లోకాలు రాముడు

తనకు లేకుండా చెయ్యడంవల్ల పరశురాముడు మహేంద్రగిరికే వెళ్లి పోయాడు. వెంటనే దిక్కులూ విదిక్కులూ తేజస్వంతా లయినాయి. దేవత లందరూ రాముణ్ణి వినుతించారు. పరశురాముడున్నూ రాము నికి ప్రదక్షిణనమస్కారాలు చేసి యథేచ్ఛగా వెళ్లిపోయాడు.

## ౭౩

## రామలక్ష్మణభరతశత్రుఘ్నులు నవోఢలతో గృహప్రవేశంచెయ్యడం

ప్రశాంతచిత్తుడై పరశురాముడు వెళ్లిపోయాక రాముడు విష్ణుధను ర్బాణాలు అప్రమేయుడైన వరుణుని కిచ్చి, వశిష్ఠాదిమహర్షుల కందరికీ నమస్కరించి, భయభ్రాంతు డయిపోయి వుండిన తండ్రితో "పరశు రాముడు వెళ్లిపోయాడు. ఇక సేన అయోధ్యాభిముఖంగా నడిపించు" అని చెప్పాడు.

ఆమాట విని దశరథుడు రాముణ్ణి కౌగిలించుకుని శిరస్సు ముద్దాడి, పరశురాముడు వెళ్లిపోడంవల్ల రాముడూ తానూ మళ్లీ జన్మించినట్టు భావించి సేనకు సెలవిచ్చాడు.

అక్కడ అయోధ్య చక్కగా అలంకరింపబడింది. నగరం అంతటా జెండా లెత్తారు. ఎక్కడ చూసినా మంగళవాద్యాలు మోగిపోతు న్నాయి. రాచబాట లన్నీ చక్కగా తడపబడ్డాయి. ప్రతీవీధిలోనూ చివరికి సందుగొందుల్లో కూడా ఎన్నో విధా లయిన పువ్వులు చల్లారు. పౌరు లందరూ మహోత్సాహవంతులై వున్నారు. ఎక్కడెక్క ణ్ణుంచో వచ్చి కొత్తవారున్నూ నగరం అంతా నిండిపోయి వుండినారు. పౌరులు ఎదురురాగా దశరథుడు కొడుకులతోనూ, కోడళ్లతోనూ, మహర్షులతోనూ, పరివారంతోనూ అలాంటి పట్నం ప్రవేశించాడు.

అలాగే అనేకులు వెంట రాగా హిమవత్పర్వతం లాగ మహోన్నతమైన తన భవనమున్నూ ప్రవేశించాడు. కౌసల్యా సుమిత్రా కైకా కోడళ్లను ప్రీతితో లోపలికి తీసుకువెళ్లారు. కోడళ్లందరూ మంగళాశీర్వచనాలు పొంది పట్టుచీరలు కట్టుకుని దేవాలయాలకు వెళ్లి పూజలు సమర్పించుకున్నారు.

రాముడూ లక్ష్మణుడూ భరతుడూ శత్రుఘ్నుడూ, పెద్దల కందరికీ నమస్కారాలు చేసి, బ్రాహ్మణులకు గోవులూ ధనధాన్యాలూ ఇచ్చి సత్కరించి, ఉత్సాహంతో వుండిన భార్యలతో తమతమ వాసగృహాలు ప్రవేశించారు.

కొన్ని దినాలు వెళ్లాక, దశరథుడు భరతుణ్ణిపిలిచి 'నాయనా! కేకయరాజపుత్రుడు నీమేనమామ ఇదే నిన్ను తీసుకువెళ్ళడానికి వచ్చి వున్నాడు. మిథిలలోనే నిన్ను పంప మని అతను కోరివుండినాడు. కనక, అతనితో వెళ్ళి నువ్వు వారి నందరినీ సంతోషపెట్టు' అని చెప్పాడు. ఇది విని భరతుడు తండ్రికీ రామునికీ నమస్కరించి, లక్ష్మణుణ్ణి కౌగిలించుకుని, తల్లుల నందరినీ పూజించి అందరిదగ్గిరా సెలవు పుచ్చుకుని -- శత్రుఘ్నుణ్ణి వెంటబెట్టుకుని మేనమామతో వెళ్ళి పోయాడు.

భరతుడూ శత్రుఘ్నుడూ వెళ్లాక రాముడూ, మహాబలుడైన లక్ష్మణుడూ దేవసమానుడైన తండ్రిని పూజిస్తూ అతని సెలవు చొప్పున పౌరులకు హితమైన కార్యాలు చెయ్యసాగారు. మరిన్నీ తల్లులను పూజించవలసినట్టు పూజిస్తూ, గురువులను సేవించవలసినట్టు సేవిస్తూ రాజకార్యాలు నిర్వహించసాగారు. రాము డిలాగ సత్స్వభావుడై మంచినడత అలవర్చుకోడంవల్ల అతణ్ణి చూసి తండ్రీ, బ్రాహ్మణులూ, వర్తకులూ నగరంలోనూ దేశంలోనూ రాజ్యంలోనూవుండే జను

లందరూ ఆనందించసాగారు. సత్యపరాక్రముడూ మహాశక్తిశాలీ అయిన రాముడు సమస్తప్రాణి కోటికీ బ్రహ్మదేవుడు లాగ అందరికీ ప్రీతిపాత్రుడైనాడు.

మరిన్ని రాముడు సీతయందే దృష్టి ప్రాణాలూ ఉంచుకుని చాలాకాలం ఆమెతో సుఖించాడు. తండ్రి చేసిన భార్య కావడం వల్లనే కాక, సుగుణాలవల్లా, రూపురేఖలవల్లా సీత రామునికి మరీ ప్రీతిపాత్రురా లయింది. సీతకు రామునిమీద, తనమీద రామున కున్న ప్రీతికంటే ఎక్కువ ప్రీతి వుంది. రాముడు సీతకు తనయెడల హృద్గత మయివున్న ప్రేమ కూడా ఆకారేంగితచేష్టాదులవల్ల తెలుసుకుని ఆమెని మరీ ప్రేమించసాగాడు. సీతకూడా ఆకారేంగితచేష్టలవల్ల రామునికి తనయెడల గల అంతర్గతప్రేమ తెలుసుకుని అతని కేది యిష్టమో అలాగే చేస్తూ అతణ్ణి ఆనందపెడుతూ తాను ఆనందించ సాగింది.

రాజర్షిపుత్రుడైన రాముడు ఉత్తమరాజకన్య అయిన సీతతో కలిసి, అతికామయమానన అయిన లక్ష్మితో కూడిన విష్ణువులాగ చాలా ప్రకాశించాడు.

శ్లో. చరితం రఘునాథస్య శతకోటిప్రవిస్తరమ్ ॥
ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్ ॥
యదక్షరపదభ్రష్టం మాత్రాహీనం చ యద్భవేత్ ॥
తత్సర్వం క్షమ్యతాం దేవ నారాయణ నమోస్తు తే ॥

---

సరస్వతీ పవర్ ప్రెస్ — రాజమహేంద్రవరము 1954